శ్రీ [illegible] స్తు.

శ్రీమన్మార్తాండాయనమః

# జ్యోతిషవిద్యాప్రకాశిక









నామ

జ్యోతిషగ్రంథః

శ్రీమత్పరాశరాది మహర్షిప్రణీత బృహత్పారాశరహోరా
ద్యనేక సద్గ్రంథపరిశీలన నిపుణేన, శ్రీవాసిష్ఠా తటస్థిత
గోపాలపుర రాజధానీ వాస్తవ్యేన, శ్రీమద్దండిభట్ట
వేంకటకృష్ణశాస్త్రిణః ప్రియశిష్యేణ,
శ్రీమద్బాకెళ్ల సోమనాథసిద్ధాం
తి [illegible], వేంకట [illegible]
[illegible]
కృతా



రాజా ప్రెస్, రాజమండ్రి.

1928



కాపీ రైటు] వెలనాణ్యం రు 2—0—0

# జ్యోతిషవిద్యాప్రకాశిక



నాల్గవ భాగము.

# దశాఫలాధ్యాయము

## పీఠిక

ఆర్యులారా !

మాజ్యోతిష పాఠశాలాగ్రంథములలో 4 వ భాగమగు నీదశాఫలాధ్యాయము, బృహత్పరాశరహోర, సర్వార్థచింతామణి, మొదలగు ప్రాచీన జ్యోతిషగ్రంథముల ననుసరించి ప్రతిమహాదశకు, దశాంతర్దశాఫలములు తాత్పర్య సహితముగా వ్రాయబడియున్నది. ఆయాగ్రంథముల ననుసరించి దశాంతర్దశా ఫలములు వ్రాయబడి యున్నప్పటికి, వారి వారి లగ్నములను బట్టియు, గ్రహములను బట్టియు ఆయాబలములను గణితముచేత సాధించి, లగ్నములకును, గ్రహములకును, షోడశవర్గులను, షడ్బలసాధనములను, గ్రహములయొక్క ఆధిపత్య, స్థితి, సాహచర్యాదులను సరిగా గమనించి, లగ్నముయొక్కయు, గ్రహములయొక్కయు, బలా బలములను గణితముచేత సాధించి, దీనియందు వ్రాయబడిన ఫలములను లగ్నము యొక్కయు, గ్రహముల యొక్కయు, బలాబ

లముల ననుసరించి వానికి తగినట్లుపయోగించుకొనవలెను. ముందుగా మహాదశానాథుని బలమును, అటుపిమ్మట అంతర్దశానాథుని బలమును గమనించి దానికితగినట్లు ఫలములను జూచుకొనవలెను. మహాదశానాథుడు దుర్బలముగానుండి, అంతర్దశానాథుడు బలవంతుడైనప్పుడు, అట్టి యంతర్దశకు విశేషశుభములను జెప్పగూడదు. పీఠికమీద జాతకము, సామాన్యజాతకమా లేక రాజయోగజాతకమా అనువిషయమును గమనించి ఆజాతకమునకు తగినట్లు దశాఫలములను, ఆదశకు తగినట్లు అంతర్దశాఫలములను? జూచుకొనవలెను.

దీనికి పిమ్మట రాబోవు ఆయుర్దాయాధ్యాయము సాధ్యమైనంత త్వరలో ముద్రించి పాఠకులకు పంపబడును.

ఇట్లు

ఆకెళ్ళ వెంకటశాస్త్రి



శ్రీరస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీమన్మార్తాండాయనమః

# జ్యోతిషవిద్యాప్రకాశిక.



## నాల్గవభాగము.

## 'దశాఫలాధ్యాయము'

శ్లో॥ పుణ్యంవా వ్యథ పాపరూపమపివా కర్మార్జితం ప్రాగ్భవే
తత్పాకోత్రతు ఖేచరస్యహి దశాభుక్త్యాదిభిర్జాయతే
తస్మాత్తేటదశావిభాగ ఇహచావశ్యం క్రియాత్తత్ఫలం
జ్ఞేయం తత్త్వదనిష్టశాంతికరణాదీష్టం సుఖంప్రాప్నుయాత్॥

జన్మాంతరమందొనరించిన పుణ్యపాపరూపకంబగు కర్మ యొక్క ఫలము యీజన్మమందు దశాంతర్దశాదులవల్ల దెలియ బడును. గనుక దశావిభాగమవశ్యకమైనది. అందువల్ల శుభాశుభ ఫలములు తెలియును. ఆదశాదులవల్ల గలిగిన అనిష్టములకు శాంతులు చేయుటవల్ల అనిష్టపరిహారమై అభీష్టసిద్ధిని సుఖము నుపొందును గావున ముందుగా దశావిభాగము ముఖ్యమైనద నిగ్రహింపవలెను.

### గ్రహదశాఫలములు.

ప్రతిగ్రహమునకును శుభదశాఫలమనియు, పాపద శాఫలమనియు రెండువిధములుగానుండును — ప్రతిగ్రహ మునకు గ్రహస్ఫుటమును సాధించి, షోడశవర్గులను గనుగొని

భావస్ఫుటమును జేసికొని, గ్రహములయొక్క ఆధిపత్య, స్థితి, సాహచర్యాదివీక్షణములవల్ల గ్రహముశుభుడుగా నుండెనేని శుభ ఫలమును పాపుడుగానుండెనేని పాప ఫలమును గలుగునని మనముగ్రహించుకొనవలెను.

పారాశర్యే

2. శ్లో॥ కేంద్రాధీశ్వరకోణనాయకదశాశ్చాంతర్దశాశ్శోభనాః
సామాన్యాశ్చ ధనత్రిలాభభవనాధీశగ్రహాణాం దశాః
షష్ఠాష్టవ్యయభావనాయకదశాః కష్టాభవేయు స్సదా
నేతుర్లగ్నమపీక్ష్యతత్రచ వదేత్తత్తద్దశాభుక్తిషు॥

జన్మలగ్నముల గాయతు కేంద్రాధిపతులయొక్కయు, కోణాధిపతులయొక్కయు, మహాదశలును, అంతర్దశలునుగూడ శుభ ఫలము నిచ్చును.

2. 3॥ స్థానాధిపతులయొక్క దశలును, అంతర్దశలును మిశ్రమ ఫలమునిచ్చును. 6, 8, 12 స్థానాధిపతులయొక్క దశలును, అంతర్దశలును చెడుఫలము నిచ్చును. మహాదశానాథుడేరాశి యందుండునో ఆరాశియేలగ్నముగా నెంచుకొని ఆలగ్నముల గాయతుగూడ కేంద్రకోణాధిపతులు శుభ ఫలములను వారి యంతర్దశలయం దిత్తురని గ్రహించవలెను—

3. శ్లో॥ దాయేశస్థగృహంపరికల్ప్యచ తనుం తస్మాచ్ఛుభక్షేశ్వర
స్థానాద్యంయుతదృగ్బలం బలమపీహాలోచ్య తచ్ఛోభయోః
నాన్యోన్యంయది షష్ఠనైధనగృహాస్థిత్యాదికం శోభనం
చేత్తా తత్రవిరుద్ధభావసహితౌ వీర్యానుసారాద్వదేత్॥

# దశాఫలధ్యాయము.

మహాదశానాథుడున్న రాశినిలగ్నముగ గల్పించి అట్టి లగ్నము లగాయతు అంతర్దశానాథునియొక్క యాధిపత్యము స్థితి, దృష్టిమొదలగు వానివల్ల గలుగుబలము నాలోచించి, యామహాదశాంతర్దశానాథు లిరువురకిని, పరస్పరము షష్టాష్ట స్థిత్యాది దోషములు లేకుండెనేని, ఆఅంతర్దశానాథుడుశుభ ఫలమునిచ్చుననియు, వారిరువురికిని షష్ఠాష్టకాది దోషములు న్నచో నాయిరువురిలో బలముగానున్న గ్రహముయొక్క ఫలముగలుగుననియు తెలియవలెను.

4. శ్లో॥ పాకేశాధ్యుషితాంత్య శత్రునిధనే సంస్థో విపాకేశ్వర
స్తచ్ఛత్రుర్భవతీహ లాభధనభే సోదర్యాత్మజే బంధుభే।
భాగ్యేవా దశమే సమన్వితఖగ స్తచ్ఛోభనాఖ్యో మహా
త్తత్కామాన్వితఖేచరశ్చ శుభదః పాకేచయుక్తోపిచ॥

మహాదశా నాథుడున్న రాశి లగాయతు 12, 6, 8, స్థానములయందున్నవాడు ఆదశానాథునికి శత్రువనబడును. 11, 2, 3, 5, 4, 9, 10, స్థానములయందున్నవాడు దశా నాదునికి శుభుడగును. దశానాథునికి సప్తమస్థానమందున్నవాడును, దశానాథునితో కలిసియున్న వాడును, శుభులగుదురు.

5. శ్లో॥ పాకేశస్తు ఖలోయుతశ్శుభఖగః పాపంయుత శ్శోభనో
మిశ్రించాయుతయోగకృద్దిశతి తత్పాపాదికం దీనతాం
యోగంచైవ మృతిం యదా యుగపదేవైకస్తు దాతుంక్షమ
స్తస్యాదా స్వవిపాకఏవ సుమహాద్యోగం ప్రకుర్యాదసౌ॥

దశానాథుడు పాపుడై యున్నప్పుడు వానితో సంబంధములేని శుభునియొక్క అంతర్దశ పాపఫలము నిచ్చును. వానితో సంబంధించిన శుభునియొక్క అంతర్దశ మిశ్రమ ఫలము నిచ్చును. వానితో సంబంధములేని రాజయోగ గ్రహముయొక్క అంతర్దశ మిక్కిలి పాప ఫలమునిచ్చును. ఒక్కమహాదశానాథునకే మారక లక్షణమును, రాజయోగలక్షణమును ఇవి రెండును కలిగియున్నప్పుడు ఆమహాదశానాథుని యొక్క స్వభుక్తిలో మిక్కిలి రాజయోగము గలుగును.

6. శ్లో॥ తాదృక్షేటమహాదశాసుఫలదా కృత్స్నాఖిలాభుక్తయ
స్తద్వచ్ఛోభసదా స్తదీయమరణం దూరాదపాస్య త్వసౌ
అన్యత్రద్యుచరశ్శుభాశుభపలం కుత్రాపి నోయచ్ఛతి
సాద్యచ్ఛేద్యది సర్వతోపిహిదశా సానిష్ఫలేత్యూచిరే॥

మారకత్వయోగకారకత్వ లక్షణములు రెండునుగల పాపమహాదశయందు ముందుగా తన స్వభుక్తియందే రాజయోగారంభమును జేసి తనదశలో వచ్చే పాపాంతర్దశలయందుగూడ నారాజయోగమునే వృద్ధిచేయును. శుభాంతర్దశల యందునుగూడ యోగించును. అనగా నామహాదశ యావత్తును చివరవరకు రాజయోగమునిచ్చి తానుచేయవలసిన మారకమును తరువాత రాబోవు మహాదశలోనికి త్రోసివేయును. ఇట్టిలక్షణములుగల మహాదశ, స్వభుక్తియందే యోగించును. గాని యితరమహాదశలో తనభుక్తియందు యోగించదు. ఒకవేళ తనభుక్తి యోగించినచో యేమహాదశలో నీభుక్తి యో

గించునో అది యోగించినపిమ్మట చివరవరకు శేషించియుండు మహాదశయంతయు వ్యర్థమగును.

7 శ్లో॥ యస్య భావస్యనాథస్తు లగ్నాద్భావాచ్చ కేంద్రగః
త్రికోణస్థోపివా తస్య భావస్య శుభమాదిశేత్॥

ఏభావాధిపతి ఆభావము లగాయతును, జన్మలగ్నము లగాయతును కేంద్రకోణముల యందుండునో ఆభావాధిపతి యొక్క దశయందు ఆభావఫలమును సంపూర్ణముగానిచ్చును.

8 శ్లో॥ త్రిషడాయగతాః పాపా శ్చోత్తమస్థానసంస్థితాః
స్వదశాసు శుభందద్యు ర్లగ్నేశస్సుహృదోయది

లగ్నములగాయతు 3, 6, 11 స్థానములయందున్న పాపగ్రహములు, దుర్బలులుగాకయుండి, లగ్నాధిపతికిమిత్రులైన యెడల అట్టిపాపగ్రహదశలు మిక్కిలిశుభఫలముల నిచ్చును.

9 శ్లో॥ రంధ్రరిష్ఫారిపైర్యుక్తా శ్శుభాః పాపఫలప్రదాః
తద్దృష్టియోగతోవాపి శుభమన్యద్వినశ్యతి॥

8, 12, 6 స్థానాధిపతులతో కలిసిన శుభగ్రహములు పాపఫలముల నిచ్చును. 8, 6, 12 స్థానాధిపతులయొక్క దృష్టికలిగినను పాపఫలము గలుగును—దీనికిని 6, 8, 12 స్థానాధిపతులయొక్క సంబంధముగాని దృష్టిగాని, ఉండకూడదు.

10 శ్లో॥ రిష్ఫాష్టారిగతస్యరాశి రశుభస్తద్భేశయుగ్దృష్టభం
భ్రష్టంస్యాత్క్రమశ స్సితజ్ఞగురవస్స్వస్తేషు సౌఖ్యప్రదాః

మిత్రోచ్చస్వభగాష్టడంత్యమృతిగావా సౌమ్యదృష్టాశ్శుభా
స్తన్నాథా రిపునీచమూఢవిజితా శ్చేత్తద్గ్రహస్థాశ్శుభాః॥

లగ్నము లగాయతు 12, 8, 6 స్థానములు పాపస్థానములు. యీపాపస్థానములయందే స్థానాధిపతులందుగో ఆస్థానాధిపతులకుగలయాధిపత్యరాసులుగూడదుర్బలమైనవియగును. 12,8, 6స్థానాధిపతులతోగలిసియున్నయితరగ్రహములయొక్క యాధిపత్యరాసులుగూడ దుర్బలమైనవి. 12, 8, 6 స్థానాధిపతులచే చూడబడినస్థానములును దుర్బలమైనవి యగును.

12 వ. స్థానమందు శుక్రుడును 8 వ స్థానమందు బుధుడును 6 వ స్థానమందు గురుడును శుభులగుదురు. 6, 12, 8, స్థానములయందుండువారు మిత్రఉచ్చస్వక్షేత్రముల యందున్నను శుభులచేత చూడబడినను శుభులగుదురు. 6, 8, 12, స్థానాధి పతులు శత్రుక్షేత్రమందుగాని నీచయందుగాని అస్తంగతముగుటగాని పరాజయమునందు గాని యున్నయెడల ఆ 6, 8, 12, స్థానములయందుండు గ్రహములును ఆస్థానాధి పతులును శుభులగుదురు.

శ్లో॥ ఆరూఢలగ్నాచ్చ తథా స్వలగ్నాత్।
కేంద్రత్రికోణస్థితఖేచరస్య।
దశాప్యయా దుత్తమయోగమిత్థం।
వదంతి గర్గాదిమహామునీంద్రాః॥

అనుశ్లోకమును బట్టిలగ్నము లగాయతున్నూ ఆరూఢలగ్న

ము లగాయితున్నా గూడ కేంద్రకోణములయందున్న గ్రహ
ముయొక్క దశ మొదటిపక్షముగా యోగించును.

శ్లో॥ షష్ఠాష్టమద్వాదశగేపి లగ్నా।
దారూఢలగ్నాత్ప్రభృతిత్రికోణే।
కేంద్రస్థితశ్చే ద్యదితద్గ్రహస్య।
దశాస్తుతే మధ్యమయోగమేవ॥



అనుశ్లోకమునుబట్టి లగ్నాములగాయతు షష్ఠాష్టమవ్యయస్థాన
ములయందున్నను ఆరూఢలగ్నము అగాయతు కేంద్రకోణము
లయందున్నయెడల ఆగ్రహముయొక్క దశ రెండవపక్షముగా
యోగించును.



శ్లో॥ స్థిత్వాతు లగ్నాత్కిల కేంద్రకోణే
ష్వారూఢలగ్నా ద్వ్యయరంధ్రయోశ్చ
షష్ఠే స్థితశ్చేద్యది తద్గ్రహస్య
దశాలభేతా ధమయోగమేవ॥

అను శ్లోకమునుబట్టి లగ్నములగాయితు కేంద్రకోణ
ములయందుండి ఆరూఢ లగ్నములగాయితు షష్ఠాష్టమ వ్యయ
ములయందున్నయెడల ఆగ్రహముయొక్క దశ మూడవపక్ష
ముగా యోగించును.

శ్లో॥ ఆరూఢలగ్నాచ్చ తథా స్వలగ్నాత్
షష్ఠాష్టమద్వాదశసు స్థితస్య
దశానయోగం లభతేగ్రహస్య
నాస్త్యత్ర సందేహలవోపి సత్యం॥

అను శ్లోకమునుబట్టి లగ్నములగాయితున్న అషాఢ లగ్నము లగాయితున్నగూడ షష్ఠాష్టమ వ్యయములయం దున్న గ్రహములయొక్క దశ యేమియున్న యోగించదు.

మహాదశాఫలములు.

శ్లో॥ సూర్యోత్కృష్ట దశాకరోతి సుతధీ ప్రజ్ఞాధికారోచ్ఛ్రియ
జ్ఞానార్థాగమకీర్తి పౌరుష సుఖప్రాస్త్యైశ్వ రానుగ్రహాన్
భానోః పాపదశాదికష్టవిఫలోద్యోగార్థహాన్యామయా
రాతిక్షోభ మహీశకోపజనకారిష్టాది బాధోదయాన్॥

రవిశుభవర్గులుకలిగి ఆధిపత్యస్థితి సాహచర్యాదులవలన బలముకలిగి శుభుడైయున్న యెడల అట్టి రవిదశయందు సంతానమువృద్ధియు బుద్ధిప్రజ్ఞ ఉద్యోగాభివృద్ధి జ్ఞానము ధనలాభము కీర్తి పౌరుషము సౌఖ్యము యైశ్వర్యానుగ్రహము మొదలగు శుభఫలములు గలుగును. ఈరవి పాపుడుగా నుండెనేని మిక్కిలి కష్టము విఫలప్రయత్నము ధనహాని రోగము శత్రువులవలనబాధ రాజులవలన భయము పితృమరణము మొదలగు చెడుఫలములు గలుగును.

చంద్రమహాదశాఫలము

శ్లో॥ చంద్రోత్కృష్టదశాకరోతి జననీ శ్రేయస్త్రీకాదిక
క్షేత్రారామగృహాసన ద్విజవరశ్రీశోభనాందోళికాన్
ఇందోః పాపదశాన్నహీనకృపణానందార్థనాశామయ
ప్రజ్ఞాహీనజుగుప్స మాతృహరణ క్రోధాదిశీతజ్వరాన్॥

చంద్రునియొక్క శుభదశయందు మాతృసౌఖ్యము తటాకారామనిర్మాణము భూలాభము, గృహసౌఖ్యము, సజ్జన సహవాసము శుభవ్యయము వాహనసౌఖ్యము మొదలగునవి గలుగును. చంద్రునియొక్క పాపదశయందు సంతానకష్టము ధననాశనము రోగము పరాభవము ఈర్ష్యకోపము వాతరోగము మాతృవిచారము మొదలగునవి గలుగును.

కుజదశాఫలము.

శ్లో॥ భౌమోత్కృష్టదశాకరోతి వసుధాప్రాప్తీష్టవస్త్వాగమ
ప్రజ్ఞాస్వచ్ఛమనః పరాక్రమధనారాతిక్షయాంశ్చానుజాన్
పాపాంగారదశానుజార్తి కలహక్షేత్రాగ్ని బాధవ్రణా
క్షిక్షీణాది మహీశపీడసుజనక్రోధాసివేధోమయాన్॥

కుజునియొక్క శుభదశయందు భూలాభము కోరిన వస్తువు లభించుట ప్రజ్ఞ స్వచ్ఛమైన మనస్సుగలిగియుండుట పరాక్రమము ధనలాభము శత్రునాశనము సోదరవృద్ధి మొదలగునవి గలుగును. పాపదశయందు సోదరనష్టము కలహము భూవ్యయము అగ్నిబాధ రణబాధ నేత్రభంగము రాజులవలన భయము, సజ్జనవిరోధము కత్తిపోటు రోగము మొదలగునవి గలుగును.

బుధదశాఫలము.

శ్లో॥ సౌమ్యోత్కృష్టదశాకరోతి వసనానంతార్థధాన్యోచ్ఛ్రయ
శ్రేయస్సౌఖ్యగృహస్వబంధు విజయప్రాప్తీష్టవస్త్వాగమాన్

బౌధ్యాః పాపదశా విదశగమనక్రోధ స్వబంధుక్షయ
ప్రజాహీన వణిగ్జనార్తి కలహ క్షేత్రార్థనాశాపదః

బుధునియొక్క శుభదశయందు వస్త్రలాభము, ధనలాభము ధాన్యాభివృద్ధి శ్రేయస్సు సౌఖ్యము గృహలాభము బంధుసమాగమము జయము సకలకార్యసాధనము మొదలగునవి గలుగును. బుధునియొక్క పాపదశయందు విదేశగమనము రోగము బంధునాశనము అవమానము వాణిజ్యమువలన నష్టము కలహము భూవ్యయము ధననాశనము మొదలగునవి గలుగును.

గురుదశాఫలము.

శ్లో॥ జీవోత్కృష్టదశాకరోతి విపులగ్రామాధికారాత్మజ
శ్రీసౌభాగ్యగుణాకరాశ్రితజనాశ్వాందోళికా వైభవాః
జైవ్యాపాపదశా మహేశ్వరభయాధివ్యాధిధైర్యచ్యుతా
ధాన్యానర్థమహీసురార్తి జనకక్రోధాశనార్తి క్షయాః॥

గురునియొక్క శుభదశయందు గ్రామాధికారము సంతానసౌఖ్యము ధనవృది సజ్జనసహవాసము. ఆశ్వాందోళికాది వాహనసౌఖ్యములు గలుగును. పాపదశయందు రాజులవలన భయము వాతరోగము పిరికితనము ధాన్యనాశనము ధనవ్యయము తండ్రితో విరోధము దరిద్రము మొదలగునవి గలుగును.

శుక్రదశాఫలము

శ్లో॥ శౌక్రీ శ్రేష్ఠదశాకరోతి సుఖసౌభాగ్యేభ్రయాందోళికా
ప్త్యైశ్వర్యాయుతధర్మబుద్ధి కనకారామాశ్వగీతోత్సవాన్
శౌక్రీపాపదశాకళత్రభయకృన్నిచార్థహానిప్రదా
త్యంతస్తేయమహాప్రదోష విపులస్త్రీవర్గరోగోద్భవాన్॥

శుక్రునియొక్క శుభదశయందు సౌఖ్యము సౌభాగ్యము అందోళికాది వాహనసౌఖ్యము ఐశ్వర్యాభివృద్ధి ధర్మము బంగారము ఆరామనిర్మాణము సంగీతము సాహిత్యము మొదలగు శుభఫలములు గలుగును. పాపశుక్రదశయందు కళత్రనాశనము ధనవ్యయము దొంగతనము గొప్పహాని స్త్రీసంబంధమైన రోగము మొదలగు చెడుఫలములు గలుగును.

శనిదశాఫలము.

శ్లో॥ మందోత్కృష్టదశాకరోతి విభవప్రజ్ఞాదియజ్ఞాదిక
క్షేత్రగ్రామపురాధినాయక బహువ్యాపారదక్షోత్సుకాన్
మాందీపాపవిషప్రయోగధనహృద్దేహాద్యనర్థోదయాన్
రాజక్రోధ విరుద్ధకార్యవికలాన్ రోగాదిబాధోదయాన్॥

శనియొక్క మంచిదశయందు ఐశ్వర్యము ప్రజ్ఞయజ్ఞయాగాదిక్రతువులు చేయుట భూలాభము గ్రామాధిపత్యము రాజ్యాధిపత్యము అనేకవ్యాపారములయందు నేర్పరితనము మొదలగునవి గలుగును. పాపదశయందు విషప్రయోగము ధనహాని శరీరపీడ రాజులవలన హాని విపరీతమైన కార్యములు

చేయుట మంచికార్యములయందు విఘ్నము గలుగుట రోగ॥ మువలన బాధ మొదలగునవి గలుగును.

రాహుదశాఫలము.

శ్లో॥ రాహూత్కృష్టదశాకరోతి సకలశ్రేయోమహద్రాజ్యకృ
ద్ధర్మాగమపుణ్యతీర్ధచలసజ్ఞానప్రభావోదయాన్
రాహోః పాపదశాహిభీతి విషజస్సర్వాంగరోగార్తి
కృచ్ఛస్త్రాగ్నిభ్యంత్యవిరోధవృక్షపతనారాతిప్రపీడోదయాన్

రాహువు బలవంతుడై యున్నయపుడు వానిదశయందు సమస్తసౌఖ్యములు అనుభవించును రాజ్యాధికారము ధర్మము ధనలాభము తీర్ధయాత్ర జ్ఞానము ప్రతిష్ఠ మొదలగునవి గలుగును. రాహువు పాపుడైనపుడు వానిదశయందు సర్పభీతి విషప్రయోగము రోగములవలన బాధ శస్త్రపీడ అగ్నివలన బాధ విరోధము చెట్లమీదనుండి క్రిందపడుట శత్రుభయము మొదలగునవి గలుగును.

కేతుదశాఫలము.

శ్లో॥ కేతూత్కృష్టదశాకరోతి విజయక్రూరక్రియార్థాగమ
మ్లేచ్ఛక్ష్మాపతిలబ్ధభాగ్యకవనప్రారంభశత్రుక్షయాన్
కేతోః పాపదశాతికష్టవిఫలార్థక్రియోద్యోగహృచ్ఛూలార్తి
జ్వరకంపనద్విజజనద్వేషాతిమూర్ఛక్రియాః॥

కేతువు బలవంతుడై యున్నయపుడు వానిదశయందు జయమును క్రూరకార్యమువలన ధనలాభము రాజులవలన భా

గ్యము కవిత్వము శత్రునాశనము గలుగును. కేతువుయొక్క పాపదశయందు మిక్కిలికష్టము. కార్యవిఫలత్వము ఉద్యోగ భంగము ఆస్థిగతజ్వరము బ్రాహ్మణవిరోధము మూర్ఖవ్యాపారములుచేయుట హృద్రోగము మొదలగు చెడుఫలములు గలుగును.

## అంతర్దశాఫలములు.

మహాదశానాథుడు మిక్కిలిబలవంతుడై అనగా శుభ షడ్వర్గులుగలిగి షడ్బలసంపన్నుడై అష్టకవర్గువలన 5 బిందువులకంటె యెక్కువబిందువులుగలిగి నీచాస్తంగతాదిదోషములులేక లగ్నములగాయితు కేంద్రకోణములయందు బలముగానున్న యెడల ఆట్టిమహాదశారంభమునుండి చివరవరకు మిక్కిలి హెచ్చుగా యోగించును. అనగా ఆమహాదశలో నడచునట్టి అంతర్దశాభుక్తులన్నియు ఆమహాదశానాథుని అనుసరించియే దానికితగిన ఫలములనిచ్చుచుండును. అట్టిబలవంతుడైన మహాదశలో ఆదశానాథునిలగాయతు షష్ఠాష్టమవ్యస్థానములయందున్న గ్రహములయొక్క అంతర్దశలయందు సామాన్యముగా చెడుఫలములు గలుగవు.

మహాదశానాథుడు మిక్కిలి దుర్బలుడైయున్నప్పుడు వానిలో శుభునియొక్క అంతర్దశవచ్చినను శుభఫలములనీయక ఆమహాదశ అంతయు పూర్తిగా చెడిపోవును.

లగ్నములగాయితున్నూ దశానాథునిలగాయతున్నూ

గూడ కేంద్రకోణములయందున్న గ్రహములయొక్క అంత ర్దశలు బాగుగా యోగించును. ఒకదానికి కేంద్రకోణముల యందును రెండవదానికి షష్ఠాష్టమవ్యయములయందును వున్న గ్రహములయొక్క అంతర్దశ మిశ్రమఫలము నిచ్చును. లగ్న మునకును దశానాథునకునుగూడ షష్ఠాష్ఠమవ్యయములయం దున్న గ్రహములయొక్క అంతర్దశలయందు మిక్కిలి చెడ్డఫల ములు గలుగును.

లగ్నమునకు షష్ఠాష్టవ్యయములయందున్న పాపగ్ర హములయొక్క మహాదశలలో వానికి షష్ఠాష్టమవ్యయముల యందున్న పాపగ్రహములయొక్క అంతర్దశలయందు మిక్కి లి చెడ్డఫలములు గలుగును.

ఒక్కొక్కజాతకములో గ్రహములన్నియు చాలాభా గము అన్యోన్యషష్ఠాష్టకములు గలిగియున్నపుడు అట్టిజాతకు నకు ప్రతిఅంతర్దశయందును యేదో యొకవిధమైన ఆపత్తుగలు గుచుండును.

శ్లో॥ అన్యోన్యషష్ఠాష్టమదాయకాలే నృపాద్భయం
భృత్యజనైర్విరోధం। స్త్రీయావిరోధం సుతదారనా
శం చోరాగ్నిబంధ్వార్తిమనోవికారమ్॥

దశాంతర్దశానాథులిరువురును అన్యోన్యషష్ఠాష్టకముల యందున్నపుడు రాజులవలన భయము సేవకులతోను స్త్రీల తోను విరోధము కళత్రపీడ సంతానవిచారము చోరబాధ బంధునష్టము మొ॥ విగలుగును.

శ్లో॥ పాకేశ్వరాదంత్యగతస్యభుక్తౌ స్థానచ్యుతింబం
ధుజనైర్విరోధం। విదేశయానం స్వజనైర్విరోధం
పాదాక్షిహృద్రోగముపైతికాలే॥

దశానాథునకు వ్యయస్థానమందున్న అంతర్దశయందు
స్థానభ్రష్టత్వము బంధువిరోధము విదేశయాత్ర కుటుంబకలహ
ము శరీరపీడ మొదలగునవి గలుగును—

శ్లో॥ దశాధిపేనాపియుతస్యభుక్తౌ స్త్రీపుత్రభృత్యా
ర్థకృషేర్వినాశమ్। ఉద్యోగభంగం స్వజనైర్వికష్ట
మాకస్మికం దూషణమేతికాలే॥

దశానాథునియొక్క స్వభుక్తియందు దారాపుత్రాది
పీడ ధనవ్యయము ఉద్యోగభంగము వ్యవసాయనష్టము బంధు
వులవలననష్టము అపవాదమో॥ గలుగును.

శ్లో॥ దశాధిపాద్విత్తగతస్యభుక్తౌ మృద్వన్నపానాం
బరగంధమాల్యమ్। పరోపకారం స్వజనస్యసఖ్యం స్త్రీపు
త్రబంధ్వాత్మమనోవిలాసమ్॥

దశానాథునకు ద్వితీయమందున్న గ్రహముయొక్క
అంతర్దశయందు సౌఖ్యమైనభోజనము మంచివస్త్రము గంధ
మాల్యానులేపనము పరోపకారము స్వజనులతోస్నేహము
దారాపుత్రాదిసౌఖ్యము గలుగును

శ్లో॥ దశాధిపాత్సోదరరాశిగస్యభుక్త్యా నృపాద్విత్తముపైతి
సఖ్యమ్సుగంధమాల్యాంబరభూషణంచ సుహృద్భవం
భోజన సౌఖ్యపుష్టిమ్॥

దశానాథునకు తృతీయస్థానమందున్న గ్రహాంతర్దశ యందు రాజులవలన ధనముస్నేహము మంచివస్త్రములు అలంకారములు భోజనసౌఖ్యము మొదలగునవి గలుగును.

శ్లో॥ దాయేశ్వరాదంబుగతస్యభుక్తౌ దారాత్మజార్థం గృహధర్మయానమ్

మృష్టాన్నపానాంబరభూషణంచ శుభగ్రహాశ్చేత్ఫల మన్యథా స్యాత్॥

దశానాథునకు చతుర్థస్థానమందున్న గ్రహాంతర్దశ యందు దారాపుత్రధనసౌఖ్యము గృహలాభము ధర్మము వాహనసౌఖ్యము మృష్టాన్నభోజనసౌఖ్యము మొ॥ గలుగును.

శ్లో. పాపగ్రహోపి శుభదః ఖలు దాయనాథా
ద్బంధుస్థిత స్స్వభవనోచ్చ బలాదియుక్తః
సౌమ్యగ్రహోప్యశుభద స్సుఖరాశియుక్తో దాయేశ్వరా
త్స్వభవనోచ్చబలాదిహీనః॥

దశానాథునకు చతుర్థమందున్న గ్రహము పాపగ్రహమైనప్పటికి ఉచ్చస్వక్షేత్రాదిబలయుక్తుడై యున్నయెడల శుభ ఫలమునేయిచ్చును. శుభగ్రహమున్నప్పటికి నీచశత్రుక్షేత్రము లు గలిగియున్నయెడల పాపఫలమునేయిచ్చును.

శ్లో॥ దశానాథాత్సుతస్థస్యభుక్తౌ పుత్రాప్తిమాదిశేత్॥
శుభగ్రహస్యసౌఖ్యంచ పాపభుక్తౌ సుతక్షయః॥

దశానాథునకు పంచమమందున్న గ్రహభుక్తియందు

సంతానప్రాప్తిగలుగును. శుభభుక్తియైనయెడల సంతానము నిలుచును. పాపభుక్తియైనయెడల సంతానముగలిగి నష్టమగును.

శ్లో॥ అంతర్దశాయాంపాపస్య షష్ఠస్థస్య దశేశ్వరాత్
చోరారిఋణదేహార్తిం లభతే పదవిభ్రమమ్
తస్మాత్షష్ఠస్య సౌమ్యస్య దశేశాత్సుఖవర్ధనమ్
లభతేపుత్రమిత్రాప్తిం స్వోచ్ఛమూలాదిగస్యతు।

దశానాథునకు షష్టమమందున్న పాపగ్రహాభుక్తియందు శత్రురోగఋణవృద్ధియు చోరబాధయు స్థానభ్రష్టత్వము మొదలగు చెడుఫలములు గలుగును. ఆదశానాథునకు షష్టమమందున్న శుభగ్రహాభుక్తియందు సౌఖ్యమును సంతానవృద్ధి మిత్రసమాగమము మొదలగు శుభఫలములుగలుగును.

శ్లో॥ దాయేశాత్సప్తమస్థస్య పాపస్యాపహృతౌ తథా
దారార్థపుత్రబంధూనాంనాశం భూపతితోభయం
సప్తమస్థశుభస్యాపిహృతౌ సౌఖ్యం దశాధిపాత్
నీచశత్రువిహీనస్థ స్సదత్త్వాంబరభూషణమ్॥

దశానాథునకు సప్తమమందున్న పాపగ్రహాభుక్తియందుదారాపుత్రబంధుధననాశనమును రాజులవలన భయమును. గలుగును. శుభభుక్తియందు మంచివస్త్రములు అలంకారములు మొదలగునవి గలుగును.

శ్లో॥ పాకేశాదష్టమస్థస్య పాపస్యాపహృతౌ భయమ్
నిధనం కుత్సితాన్నంచ చోరాగ్నినృపపీడనం
పాకే శాదష్టమస్థస్య సౌమ్యస్యాపహృతౌ సుఖం
భుక్త్యాదౌ శోభనంప్రోక్త మంతేకష్టం వినిర్దిశేత్॥

దశానాధునకు అష్టమమందున్న పాపగ్రహభుక్తియందు భయము మారకము సౌఖ్యములేని భోజనము చోరాగ్నిభయము రాజువలన బాధయు గలుగును. శుభభుక్తియైన యెడల ఆభుక్తియొక్క మొదటిభాగమందు సౌఖ్యమును రెండవభాగమందు కష్టమును గలుగును.

శ్లో. దాయేశాన్నవమస్థస్య పాపస్యాపహృతౌ యథా
అశుభంలభతేకర్మ స్థానభ్రంశం మనోరుజం
ప్రధానతశ్శుభస్థస్య సౌమ్యస్యాపహృతౌ యథా
వివాహం యజ్ఞదీక్షాంచ దానార్తింలభతేనరః॥

దశానాధునకు నవమమందున్న పాపగ్రహభుక్తియందు అశుభకర్మలు చేయుటయు స్థానభ్రష్టత్వము శరీరపీడ మొదలగునవి గలుగును. ఆదశానాధునకు నవమమందున్న శుభగ్రహభుక్తియందు వివాహము యజ్ఞయాగాదిక్రతువులు దానములు మొదలగు శుభకార్యములు చేయును.

శ్లో. కర్మస్థపాపఖేటస్యహృతౌ పాకేశ్వరాద్యథా
కర్మనాశమవాప్నోతి దుష్కీర్తింవివిధాపదం
తస్మాత్కర్మస్థసౌమ్యస్యహృతౌ సౌఖ్యం వినిర్దిశే
తటాకగోపురాదీనాం పుణ్యకర్మాది సంగ్రహం॥

దశానాధునకు దశమస్థానమందున్న పాపగ్రహాభుక్తి యందు కర్మనాశము అపఖ్యాతి పలువిధదుఃఖములు గలుగును. శుభగ్రహాభుక్తియందు సౌఖ్యము తటాకములు గోపురములు నిర్మించుట పుణ్యకార్యములు చేయుటయు మొదలగు మంచిఫలములు గలుగును,

శ్లో. లాభస్థస్యదశానాధాత్ పాపస్యాపహృతౌ ధనం
లభతే పుత్రమిత్రార్థస్థానప్రాప్తించ శాశ్వతీం
పాకేశాల్లాభయుక్తస్య సౌమ్యస్యాపహృతౌసుఖం
భాగ్యోత్తరం నృపాత్ప్రీతిం దారపుత్రాదివర్ధనం॥

దశానాధునకు లాభస్థానమందున్న పాపగ్రహాభుక్తి యందును శుభగ్రహాభుక్తియందునుగూడ ధనలాభము భూలాభము సంతానసౌఖ్యము బంధుసన్మానము భాగ్యము రాజసన్మానము కళత్రసౌఖ్యము మొదలగు శుభఫలములు గలుగును.

శ్లో. వ్యయస్థస్యహృతౌదుఃఖం పాపస్యతుదశాధిపాత్
అర్థనాశం నృపాత్క్రోధం స్థాననాశం స్మృతిభ్రమం
పాకేశ్వరాద్వ్యయస్థస్యసౌమ్యస్యాపహృతౌయదా
వాహనంభోగభాగ్యంచ వస్త్రాభరణభూషణం॥

దశానాధునకు వ్యయస్థానమందున్న పాపగ్రహాభుక్తి యందు ధననష్టము రాజవిరోధము స్థానభ్రష్టత్వము మనోవ్యాకులత యివిమొదలగు ఫలములు గలుగును. శుభగ్రహా

భుక్తియందు వాహనసౌఖ్యము భోగము భాగ్యము సువస్త్రాలంకారప్రాప్తి మొదలగునవి గలుగును.

శ్లో. అంతర్దశాయాంక్రూరస్య క్రూరదాయే మహద్భయం
స్థానాక్షిబంధుపుత్రార్థదారనాశం నృపాద్భయం
శుభభుక్తౌశుభేదాయే స్థానవాహనభూషణం
సౌమ్యభుక్తౌ పాపదాయే త్వాదౌసౌఖ్యం పరంభయం
సౌమ్యదాయేపాపభుక్తౌ త్వాదౌ కష్టం తతశ్శుభం॥

దశానాధుడును అంతర్దశానాధుడుగూడ పాపులైనప్పుడు ఆపాపభుక్తియందు విశేషభయమును స్థానభ్రష్టత్వము నేత్రహాని బంధుపీడ దారాపుత్ర ధననష్టములు రాజువలన భయము గలుగును. దశానాధుడును అంతర్దశానాధుడును కూడ శుభులైనప్పుడు ఆశుభభుక్తియందు భూసంపాదనయు వాహనసౌఖ్యము అలంకారప్రాప్తియు గలుగును. పాపదశలో శుభభుక్తియందు మొట్టమొదట శుభమును తరువాత కష్టమును గలుగును.

శ్లో॥ రవిమహాదశలోరవ్యంతర్దశ మా 3 ది 18

లగ్నాత్కేంద్రత్రికోణస్థే స్వోచ్చస్వక్షేత్రసంయుతే తద్భుక్తౌ తీర్థయాత్రాదిస్నానం దైవతదర్శనం నృపప్రసాదమారోగ్యం క్షేత్రస్త్రీపుత్రసౌఖ్యదం వాహనాంబరపశ్వాదివృద్ధిదంసర్వసౌఖ్యదంఇష్టసిద్ధిప్రదంచైవగృహేకళ్యాణసంభవం గీతనృత్తాదిషుప్రీతిః గణికావృద్ధిసంగ్రహః .స్వవారేరాజసన్మా

నం బంధుభిర్బహుసంకులం। పితృబంధుజనోత్సాహం దుర్గార ణ్యవిచారణం యత్నకార్యార్థసిద్ధిస్స్యా త్సర్వత్రవిజయీభవేత్॥

మౌక్తికాభరణప్రాప్తిః అపూర్వంవస్తుదర్శనం
శ్వేతాశ్వగజయోగాదిలబ్ధం రాజప్రసాదతః,

లగ్నము లగాయతు కేంద్రకోణములయందుగాని ఉచ్చస్వక్షేత్రములయందుగాని బలవంతుడైయున్న రవిమహా దశలోరవిభుక్తియందు తీర్థయాత్రలు దేవతాదర్శనము రాజా నుగ్రహము ఆరోగ్యము భూలాభము దారాపుత్రసౌఖ్యము లు వాహనసౌఖ్యము వస్త్రములు పశువృద్ధి గృహమందుశు భకార్యములు జరుగుటగీతనృత్యాదిసౌఖ్యములువేశ్యానందము ఆదివారమునందు రాజసన్మానము బంధుసమాగమము పితృ సౌఖ్యము కార్యసాఫల్యము అలంకారప్రాప్తి అపూర్వవస్తు దర్శనము గజాందోళికాది వాహనసౌఖ్యములు మొదలగునవి గలుగును.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయేసంస్థేనీచస్థేశత్రురాశిగే
తద్భుక్తౌస్థాననాశంచ దాయాదకలహంతథా
స్వబంధుజనవిద్వేషం నృపక్రోధం తథైవచ
క్షేత్రార్థపశునాశంచ దారపుత్రాదివిగ్రహం
శిరోబాధా కుక్షిబాధా దేహజాడ్యం మనోరుజం
చోరాగ్నివ్రణభీతిశ్చ శత్రుభీతి ర్మహద్భయం
పాపయుక్తేథవాదృష్టే పాపచింతా మహద్భయం

దేహపీడామనస్తాపం కార్యనాశం ధనక్షయం
రాజకార్యకలాపేన బంధుద్వేషం మనోరుజం
యత్నకార్యవిఘాతశ్చ విదేశగమనంతథా॥

షష్ఠాష్టమవ్యయస్థానములయందుగాని నీచయందుగాని శత్రుక్షేత్రమందుగాని యున్నయెడల యీరవిభుక్తియందు స్థానభ్రష్టత్వము జ్ఞాతులతో కలహము బంధువులతోవిరోధము రాజానుగ్రహము భూవ్యయము ధననాశనము పశునాశనము దారాపుత్రాదిపీడ శిరోబాధ దేహబాధ మనశ్చాంచల్యము శత్రురోగబుణవృద్ధి మొదలగు భయములుగలుగును ఈరవిపాపగ్రహముతోకలిసినను చూడబడినను చెడుపనులుచేయుటయు మిక్కిలిభయము దేహపీడ మనస్తాపము కార్యనాశనము ధనవ్యయము కార్యవిఘ్నము విదేశగమనమును గలుగును.

శ్లో. లగ్నాధిపేనసంయుక్తే ఆదౌసౌఖ్యంధనాగమం
అయత్నాదర్థహానిస్స్యాత్ తతోరోగమవాప్నుయాత్॥

ఈరవిలగ్నాధిపతితోడ కలిసియున్నయెడల మొట్టమొదట సౌఖ్యము. ధనలాభము, గలిగి పిమ్మట అకస్మాత్తుగాధనవష్టము, రోగముగలుగును.

శ్లో. భాగ్యాధిపేనసంయుక్తే భాగ్యవృద్ధికరంశుభం
సత్కర్మజ్ఞానసిద్ధిస్స్యాత్పురాణశ్రవణాదికం॥

ఈరవిభాగ్యాధిపతితో గూడినయెడల భాగ్యవృద్ధి మంచికర్మలుచేయుటయు జ్ఞానము పురాణశ్రవణము యివి మొదలగుమంచి ఫలము లు గలుగును.

శ్లో॥ వాహనాధిపసంయుక్తే వాహానం భవతి ధృవం
గృహక్షేత్రాదిలాభశ్చ చతుష్పాజ్జీవలాభకృత్॥

ఈరవిచతుర్థస్థానాధిపతితో గూడినయెడల విశేషభాగ్యము వాహనము గృహలాభము భూలాభము పశువృద్ధి యివి మొదలగుమంచి ఫలములు గలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే వస్త్రాభరణసంగ్రహాః
మాతృబంధువిరోధశ్చ శిరోబాధా భవిష్యతి॥

ఈరవిచంద్రునితో కలిసి యున్నప్పుడు తల్లితోను బంధువులతోను విరోధము శిరోబాధయును గలుగును చంద్రునిచే చూడబడినప్పుడు మంచివస్త్రములు అలంకారములు గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే దాయాదిరిపువృద్ధిదం
స్వదేహోదరబాధాచ చింతితార్థస్యనాశనం॥

ఈరవికుజునితో కలిసియున్నను చూడబడినను జ్ఞాతివృద్ధియు శత్రువృద్ధియు శరీరపీడ సోదరనష్టము ధనసంపాదనకై ఆలోచింపబడిన కార్యముయొక్క భంగము యివి మొదలగునవి గలుగును.

శ్లో॥ సౌమ్యదృష్టియుతేవాపి విష్ణుపూజాదిచింతనం
ఉద్యోగసిద్ధిలాభంచ క్రయవిక్రయకౌశలం

ఈరవిబుధునితో కలిసియున్నను చూడబడినను విష్ణు

పూజ ఉద్యోగలాభము వస్తువుకొనుట అమ్ముటయందునేర్ప రితనము యివి మొదలగు మంచిఫలములు గలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే పుత్రోత్పత్తి ర్భవిష్యతి
స్వగృహేశుభకార్యాణి ధనధాన్యాదిసంగ్రహం॥

ఈరవిగురునితో కలిసినను చూడబడినను పుత్రలాభము గృహమందు శుభకార్యములు జరుగుటయు ధనలాభము ధాన్యలాభము మొ॥ మంచిఫలములు గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే వివాహస్త్రీప్రసూతికృత్
వాహసంవస్తుసంప్రాప్తి రిష్టసిద్ధిసుఖాదికం॥

ఈరవిశుక్రునితో కలిసినను చూడబడినను వివాహము స్త్రీసంతానము వాహనము వస్తుసంపాదన తానుకోరినకార్యము సఫలమగుట మొ॥ సుఖములు గలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే క్షేత్రగోకృషినాశనం
స్వభృత్యకలహంచైవ స్థాననాశంస్వసౌఖ్యయం

ఈరవిశనితో కలిసినను చూడబడినను భూవ్యయము వ్యవసాయనష్టము సేవకులతో విరోధము స్థానభ్రష్టత్వము రాజులవలన భయము మొదలగు నీచఫలములు గలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యు ర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం సూర్యప్రార్థన మాచరేత్
రుద్రాభిషేచనంచైవ పశ్చాచ్ఛాంతిమవాప్నుయాత్
రక్తధేను ప్రదాతవ్యం భవేదాయుష్యవర్ధనం॥

ఈరవిద్వితీయమందుగాని సప్తమమందుగాని శనితో గలిసినయెడల మారకముగలుగును. అట్టిదోషము పోవుటకై సూర్యప్రార్థనయు రుద్రాభిషేకము యెర్రనిగోవును దానముచేయుట ఇవి జరిగించుటవలన ఆయుర్వృద్ధిగలుగును.

రవిదశలో చంద్రభుక్తి మా, 6

శ్లో॥ సూర్యస్యాంతర్గతేచంద్రే లగ్నాత్కేంద్ర త్రికోణగే
వివాహశుభ కార్యంచ ధనధాన్య సమృద్ధికృత్
గృహక్షేత్రాభివృద్ధిశ్చ పశువాహనసంభ్రమం॥

రవిమహాదశలో చంద్రభుక్తియందు చంద్రుడు లగ్నములగాయితు కేంద్రకోణములయందున్నయెడల వివాహము శుభకార్యములు ధనధాన్యవృద్ధి గృహనిర్మాణము భూలాభము పశువృద్ధి వాహనసౌఖ్యము మొదలగునవి గలుగును.

శ్లో॥ తుంగస్వక్షేత్రగేవాపి దారసౌఖ్యం ధనాగమం
పుత్రలాభం శుభంచైవ సన్మానం భవతిధ్రువం॥
మహారాజప్రసాదేన ఇష్టసిద్ధి సుఖాధికం॥

ఈచంద్రుడు ఉచ్చయందుగాని స్వక్షేత్రమందుగాని వున్నయెడల కళత్రసౌఖ్యము ధనలాభము పుత్రలాభము రాజసన్మానము శుభకార్యములు జరుగుట మొదలగునవి గలుగును. మహారాజులవల్లనుంచి తానుకోరిన కార్యము సఫలమగును.

శ్లో॥ క్షీణేవాపవసంయుక్తే దారాపుత్రాదినాశనం
వైషమ్యజనసంవాదం భృత్యవర్గ వినాశనం
విరోధంరాజకలహం ధనధాన్యపశుక్షయం॥

ఈచంద్రుడు। క్షీణచంద్రుడైనను పాపులతోఁ గలిసినను కళత్రనాశనము పుత్రనాశనము దుర్మార్గులతో విరోధము సేవకులయొక్క నాశనము రాజులతో కలహము ధనధాన్య నాశము పశునాశనము గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే స్థాననాశం నృపాద్భయం
కలహంధననాశంచ సంతాపంభవతి ధృవం॥

ఈచంద్రుడు రవితో గలసినయెడల స్థానభ్రష్టత్వము రాజులవలనభయము కలహము ధనవ్యయము విచారము మొదలగునవి గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే వ్రణశస్త్రాదిబంధనం
సమానజనహానిశ్చ క్షేత్రనాశం తథైవచ॥

ఈచంద్రుడు కుజునితో గలిసినను చూడబడినను వ్రణబాధ శస్త్రములవలన బాధ సమానమనుజునియొక్క మరణము భూనాశనము మొదలగునవి గలుగును.

శ్లో॥ సౌమ్యేనసంయుతేదృష్టే క్రయవిక్రయ కౌసలం
స్వబంధుజనసమ్మోదం యత్నకార్యార్థసిద్ధికృత్॥

ఈచంద్రుడు బుధునితోఁ కలసినను చూడబడినను కొనుట అమ్ముటయందు నేర్పరితనము బంధుజనసమ్మతము తలచిన కార్యము నెరవేరుట మొదలగు మంచిఫలములు గలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే పుత్రక్షేత్రవివృద్ధిదం
గర్భిణీసంగమంచైవ ఇష్టసిద్ధిర్భవిష్యతి॥

ఈచంద్రుడు గురునితో గలిసినను చూడబడినను పుత్ర

వృద్ధి భూసంపాదన గర్భిణిస్త్రీతోసంగమము కార్యానుకూలము
మొదలగు మంచిఫలములు గలుగును.

శ్లో. శుక్రేణసంయుతేదృష్టే విద్యాగోష్ఠిధనాగమం
క్షేత్రార్థదారసంప్రాప్తిః పుత్రలాభం మహోత్సవం॥

ఈచంద్రుడు శుక్రునితోగూడినను చూడబడినను విద్యాప్రసంగము ధనసంపాదన భూలాభము కళత్రసౌఖ్యము పుత్రసౌఖ్యము అధికసంతోషము మొదలగు మంచిఫలములు గలుగును.

శ్లో. శనినాభృత్యకలహం గోహానిక్షేత్రనాశనం
విదేశగమనంచైవ సర్వత్రకలహం తథా॥

యీచంద్రుడు శనితోగూడినయెడల సేవకులతో కలహము స్థానచలనము పశునష్టము భూవ్యయము సకలజనులతో కలహము మొదలగు చెడుఫలములు గలుగును.

శ్లో. షష్ఠాష్టమవ్యయేచంద్రే జలభీతిమనోరుజం
బంధనం రోగపీడాచ స్థానవిచ్యుతికారణం
మూత్రకృచ్ఛ్రం మనస్తాపం దాయాదిజనవిద్వరం॥

ఈచంద్రుడు షష్ఠాష్టమవ్యయములయందున్నయెడల ఉదకమువలన భయము మనోవ్యాకులత కారాగృహప్రాప్తి దేహపీడ స్థానభ్రష్టత్వము మూత్రకృచ్ఛ్రరోగము మనోచాంచల్యము బంధుజనులతో విరోధము మొదలగు చెడుఫలములు గలుగును.

శ్లో. దాయేశాద్భాగ్యలాభస్థే సౌఖ్యస్యాపహృతంసుఖం
భాగ్యోత్తరం నృపాత్ప్రీతిం దారాపుత్రాదివర్ధనం
రాజ్యప్రాప్తి మహోత్సాహం స్థానప్రాప్తించ శాశ్వతం
వివాహయజ్ఞదీక్షాంచ యోగాం తేలభతేనరః
వాహనంబంధుభాగ్యంచ దేవతార్చనం మహత్ ॥

దశానాథునకు భాగ్యమందుగాని లాభమందుగాని యున్నటువంటి పూర్ణచంద్రునియొక్క భుక్తియందు సౌఖ్యము ఉత్తరఖండమందు భాగ్యము రాజులవలనప్రీతి కళత్రసౌఖ్యము పుత్రసౌఖ్యము రాజ్యలాభము సంతోషము శాశ్వతమైనవసతి వివాహము యజ్ఞయాగాది క్రతువులుచేయుట వాహనము బంధుసన్మానము, భాగ్యము గొప్పదైన దేవతార్చనము అంత్యమందు రాజయోగము యివిగలుగును.

శ్లో. దాయేశాత్కేంద్రపుత్రస్థే చంద్రస్యాపహృతంధనం
తటాకగోపురాదీనాం పుణ్యకర్మాదిసంగ్రహం
రాజ్యప్రాప్తిర్మహోత్సాహం సత్కీర్తివివిధానిచ
నీచశత్రువిహీనశ్చ మృద్వన్నాంబరభూషణం॥

దశానాథునకు కేంద్రమందుగాని పంచమమందుగాని ఉన్నటువంటిన్ని నీచయందుగాని శత్రుస్థానమందుగాని లేనటువంటి పూర్ణచంద్రునియొక్క భుక్తియందు తటాకనిర్మాణము దేవాలయప్రతిష్ఠ మొదలగు పుణ్యకర్మలు చేయుట రాజ్యలాభము సంతోషము విశేషకీర్తి మంచివస్త్రములు భూషణములు సుభోజనము మొదలగు మంచిఫలములు గలుగును.

శ్లో. దాయేశాద్రిపురంధ్రిస్థే వ్యయేవా పాపసంయుతే
నిధనం కుత్సితాన్నంచ చోరాగ్ని నృపపీడనం
స్థానభ్రంశం మనోదుఃఖం దేహపీడా భయంక్వచిత్॥

దశానాథునకు షష్టాష్టవ్యయములయందు పాపులతో గూడిన చంద్రభుక్తియందు ధనవ్యయము సౌఖ్యములేని భోజనము దొంగలవల్లను అగ్నివల్లను రాజులవల్లను భయము స్థానభ్రష్టత్వము మనోవ్యాకులత శరీరపీడ భయము మొదలగునవి ఒకప్పుడు గలుగుచుండును.

శ్లో. ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యుభయంభవేత్
తద్దోషపరిహారార్థం దుర్గాదేవీజపంచరేత్
శ్వేతాంగాం వృషభందద్యా ద్దానమారోగ్యమాదిశేత్॥

దశానాథునకు ద్వితీయసప్తమములయందున్న చంద్రుడు పాపుడైయున్నయెడలమరణము సంభవించును. అట్టి దోషము హరించుటకై దుర్గాదేవీజపము తెల్లనైన ఎద్దును దానముచేయుట దీనివలన ఆయుర్దాయము వృద్ధియగును.

రవిదశలో కుజాంతర్దశ మా 4 రో 6

శ్లో. సూర్యస్యాంతర్గతేభౌమే లగ్నాత్కేంద్రత్రికోణగే
స్వోచ్చస్వక్షేత్రసంయుక్తే శుభకర్మ శుభాధికం
భూలాభం కృషివృద్ధించ ధనధాన్యాదివర్ధనం
గృహక్షేత్రాదిలాభంచ రక్తవస్త్రాది లాభకృత్
దారాపుత్రాదిసౌఖ్యంచ యుద్ధేజయము వాప్నుయాత్
ప్రవాళరత్నలాభంచ సుతజనోత్సవంతథా॥

రవి మహాదశలో కుజాంతర్దశయందు కుజుడు లగ్న ములగాయతు కేంద్రకోణములయందుగాని ఉచ్చస్వక్షేత్ర ములయందుగాని ఉండినయెడల మంచికర్మలు. శుభకార్య ములు చేయుటయు భూసంపాదన వ్యవసాయలాభము ధన ధాన్యాదివృద్ధి గృహనిర్మాణము మెరినివస్త్రములు కళత్ర సౌఖ్యము పుత్రసౌఖ్యము యుద్ధమందు జయము మంచిపగడ ములు రత్నములును సంపాదించుటయు పుత్రోత్సవము మొ॥ మంచిఫలములు గలుగును.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయస్థైవా నీచక్షేత్రగతేపివా
తద్భుక్తౌజ్ఞాతికలహం సహోదరజననాశనం
దారాపుత్రవియోగంచ పశువాహన నాశనం
జ్వరాదివ్రణబాధాచ చోరాగ్నినృపపీడనం
యత్నకార్యవినాశంచ స్వస్త్రీకలహమేవచ
రాజద్వేషం మనోదుఃఖం శత్రువృద్ధి మహాభయం॥

యీకుజుడు షష్ఠాష్టమవ్యయములయందుగాని నీచ రాశియందుగాని ఉండినయెడల జ్ఞాతివిరోధము తనతో సమా నమైన వానియొక్క మరణము కళత్రనష్టము పుత్రవిచారము పశునాశనము జ్వరము వ్రణబాధ చోరులవల్లను అగ్నివల్లను రాజులవల్లను భయము ప్రయత్నించిన కార్యముయొక్క విఫ లము భార్యతో విరోధము రాజులతో విరోధము మనోవ్యా కులత శత్రువృద్ధి విశేషభయము మొదలగు చెడుఫలములు గలుగును.

శ్లో॥ పంచమాధిపయుక్తేనా భాగ్యవృద్ధికరం శుభం
భాగ్యలాభాదిసంయుక్తే లాభంచైవ భవిష్యతి॥

ఈకుజభుక్తియందు కుజుడు పంచమాధిపతితోగూడిన యెడల భాగ్యము శుభములు గలుగును. భాగ్యాధిపతితోగాని లాభాధిపతితోగాని కూడినయెడల విశేష ధనలాభము గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే సంతాపం పితృనాశనం
ఉద్యోగహానింకురుతే శత్రుబాధాం ధనక్షయం॥

ఈకుజుడు రవితోగూడినను చూడబడినను సంతాపము పితృమారకము ఉద్యోగభంగము శత్రువులవలన బాధ ధననష్టము గలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే సువస్త్రాభరణాంతథా
గృహేకళ్యాణశుభదం యత్నకార్యార్థసిద్ధిదం॥

యీకుజుడు చంద్రునితోగూడినను చూడబడినను మంచివస్తువులు వస్త్రములు ధరించుటయు గృహమందు శుభకార్యములు జరుగుటయు ధనలాభము కార్యలాభము యివి మొదలగు మంచిఫలములు గలుగును.

శ్లో॥ సౌమ్యేనసంయుతేదృష్టే స్త్రీసౌఖ్యం బంధుపూజ్యతా
విద్యాగోష్ఠీ వాక్పటుత్వం శత్రువృద్ధి ర్భవిష్యతి॥

ఈకుజుడు బుధునితోగలసినను చూడబడినను కళత్రసౌఖ్యము బంధువులచే పూజింపబడుట విద్యాప్రసంగము వాక్పటుత్వము. శత్రువృద్ధి యివి గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే స్త్రీసౌఖ్యం బంధుపూజ్యతా
విచిత్రగృహలాభంచ వివాహం పుత్రసంభవం॥

ఈకుజుడు శుక్రునితో గూడినను చూడబడినను కళత్ర సౌఖ్యము బంధుపూజ్యత చిత్రమైన గృహనిర్మాణము వివాహము పుత్రలాభము యివి మొదలగు మంచిఫలములు గలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే గర్భస్రావే శిశుక్షయం
ఘాతపాతాదికలహం సమానజననాశనం॥

ఈకుజుడు శనితో గూడినను చూడబడినను గర్భస్రావమువలన సంతాననష్టము కలహముయినను దెబ్బతగులుటగాని పడుటయుగాని సమానమైనవానియొక్క మరణము యివి గలుగును.

శ్లో॥ దాయేశాద్రిపురంధ్రస్థే స్థానపశ్వాదినాశకృత్
నిధనం కుత్సితాన్నంచ చోరాగ్ని నృపపీడనం॥

దశానాథుడైన రవికి కుజుడు షష్ఠఅష్టమములయందున్నయెడల స్థానభ్రష్టత్వము పశునాశనము ధననాశనము సాధారణ భోజనము దొంగలవల్లను అగ్నివల్లను రాజులవలనను భయముగలుగును.

"కర్మాధిపేనసంయుక్తే కుజే కర్మాదినాశనం" దశమాధిపతితో కలిసినయెడల మంచికర్మలు చేయకపోవుటయు జరుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణస్థే పాపస్యాపహృతంధనం
అశుభంలభతే కర్మ స్థానభ్రంశం మనోరుజం
గురుపుత్రాదిదారాణాం తపోదానవినాశనం॥

దశానాథుడైన రవికి కేంద్రకోణములయందు కుజుడున్నయెడల ధనవ్యయము అశుభకార్యములు చేయుట స్థానభ్రష్టత్వము శరీరపీడ పుత్రదారాదినాశనము తపోవిఘ్నము మొదలగునవి గలుగును.

శ్లో॥ నీచేవాపాపసంయుక్తే రాజమూలాద్ధనవ్యయం॥
దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే
భుక్త్యాదౌకష్టమాప్నోతి పశ్చాత్సౌఖ్యం భవిష్యతి॥

ఈకుజుడు నీచయందుగాని పాపులతో కలిసిగాని వున్నయెడల రాజులవలన ధనవ్యయమగును. దశానాథునకు షష్ఠాష్ట వ్యయస్థానములయందు కుజుడుండి పాపులతో కలిసియున్నయెడల యీకుజభుక్తియందు ఆదియందు కష్టమున్ను అంత్యమందు సుఖమున్ను గలుగును.

శ్లో॥ ద్వితీయద్యూననాథేతు దేహజాడ్యం మనోరుజం
సుబ్రహ్మణ్య జపంచైవ అనడ్వాహం తథైవచ
దానం కుర్వీత విధివత్ శాంతి మాప్నోత్యసంశయః॥

దశానాథునకు ద్వితీయమందుగాని సప్తమమందుగాని కుజుడున్నయెడల దేహపీడ మనోపీడ గలుగును. సుబ్రహ్మణ్య జపముగాని వృషభమును దానముగాని చేసినయెడల సౌఖ్యము గలుగును.

రవిమహాదశలో రాహుభుక్తి మా 10 రో 24

శ్లో॥ సూర్యస్యాంతర్గతేరాహౌ లగ్నాత్కేంద్రత్రికోణగే
ఆదౌద్విమాసపర్యంతం ధననాశం మహద్భయం
చోరాగ్నినృపభీతిశ్చ దారపుత్రాదిపీడనం
తత్పరంసుఖమాప్నోతి శుభయుక్తేశుభాంశగే
దేహారోగ్యం మహత్సౌఖ్యం రాజప్రీతికరం శుభం॥

రవిలో రాహువు లగ్నములగాయతు కేంద్రత్రికోణము లయందున్నయెడల ఆరాహుభుక్తియందు మొట్టమొదట రెండుమాసములపర్యంతము ధననష్టము మిక్కిలి భయము చోరులవల్లను అగ్నివల్లను రాజులవల్లను భయమున్ను దారా పుత్రపీడయు గలుగును. అటుపిమ్మట యీరాహువు శుభగ్రహయుక్తుడైనగాని శుభనవాంశయందుగాని యున్నయెడల దేహారోగ్యము రాజానుగ్రహము గలుగును.

శ్లో॥ లగ్నాదుపచయేరాహౌ శుభయుక్తేథవీక్షితే
భాగ్యవృద్ధిర్యశోలాభం దారపుత్రవివర్ధనం
పుత్రోత్సవాది సంతోషం గృహేకళ్యాణవైభవం॥

లగ్నములగాయతు 3, 6, 10, 11 స్థానములయందు యీరాహువు శుభగ్రహసంబంధవీక్షణములు గలిగియున్న యెడల భాగ్యాభివృద్ధియు కీర్తిదారాపుత్రసౌఖ్యములు పుత్రోత్సవము వివాహాదిశుభకార్యములు జరుగును.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయేరాహౌ పాపయుక్తేథవీక్షితే
బంధనం స్థాననాశంచ కారాగృహనివేశనం

చోరాగ్నిప్రణభీతిశ్చ దారాపుత్రాదిపీడనం
చతుష్పాజ్జీవనాశశ్చ గృహక్షేత్రాది నాశనం
ఉన్నతాత్పతనంచైవ శూద్రప్రభువశాద్భయం॥

లగ్నములగాయతు షష్ఠాష్టమవ్యయస్థానములయందు రాహువుండి పాపగ్రహసంబంధవీక్షణములు గలిగియున్నయెడల బంధనము స్థానభ్రష్టత్వము కారాగృహ ప్రవేశము చోరాగ్నిప్రణబాధ దారాపుత్రాదినాశనము ఎత్తుప్రదేశము నుండి క్రిందపడుట శూద్రప్రభువులవలన భయముఁగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే కలహం స్థాననాశనం
మతిభ్రంశంమానభంగ మధికారంచ నాశనం॥

ఈరాహువు రవితోఁగలసినను చూడబడినను కలహము స్థానభ్రష్టత్వము మతిచాంచల్యము మానభంగము అధికార నాశనము గలుగును.

శ్లో॥ చంద్రేణసంయుతేదృష్టే స్వస్త్రీకలహమేవచ
శిరోక్షికుక్షిబాధాచ బంధునాశం తథైవచ॥

ఈరాహువు చంద్రునిదోఁగలిసినను చూడబడినను స్వభార్యతో కలహము శిరోబాధ నేత్రబాధ కుక్షిబాధ బంధునష్టము గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే జ్వరస్ఫోటప్రణాదికం
దాయాదికలహంచైవ సమరే ప్రాణహానిదం॥

ఈరాహువునకు కుజునితో సంబంధవీక్షణములు గలిగియున్నయెడల జ్వరము స్ఫోటకము ప్రణబాధ గలుగును.

దాయాదులతో కలహము యుద్ధమందు భయము గలుగును.

శ్లో॥ సౌమ్యేనసంయుతేదృష్టే భుక్త్వాదౌ కష్టమాప్నుయాత్
రాజసన్మానకీర్తిశ్చ గృహే కళ్యాణవైభవం॥

ఈరాహువునకు బుధునితో సంబంధవీక్షణములు గలిగియున్నయెడల ముందుగా కష్టమును తరువాత రాజసన్మానము కీర్తి గృహమందు కళ్యాణమహోత్సవములు జరుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే సుహృత్కలహమేవచ
ద్విజాతికలహంచైవ పత్నీగర్భవినాశనం॥

ఈరాహువు గురునితో కలిసినను చూడబడినను స్నేహితులతో విరోధము భార్యకు గర్భస్రావము గలుగుట యివి గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే వాహనాంబరసౌఖ్యదం
స్త్రీపుత్రమిత్రబంధూనాం సౌఖ్యం భవతిలాలసం॥

ఈరాహువునకు శుక్రునియొక్క సంబంధవీక్షణములు గలిగినయెడల వాహనము మంచివస్త్రములు అలంకారములు సౌఖ్యము కళత్రము పుత్రులు మిత్రులు బంధువులు వీరియొక్క సుఖము మొదలగు మంచిఫలములు గలుగును.

శ్లో॥ మందదృష్టియుతేవాపి నీచస్త్రీసంగమంతథా
నీచసేవామహత్కష్టం పశుక్షేత్రవినాశనం॥

ఈరాహువునకు శనియొక్క సంబంధవీక్షణములు గలిగినయెడల హీనస్త్రీ సంభోగము నీచసేవ మిక్కిలి కష్టములు. పశువులు భూమి మొదలగు వానినష్టములు గలుగును.

శ్లో॥ దాయేశాద్రిపురంధ్రిస్థే వ్యయేవా పాపసంయుతే
నృపచోరాగ్నిభీతిశ్చ జ్వరాదిభయమీదృశం॥

దశానాథునకు షష్ఠాష్టవ్యయములయందు రాహువు పాపగ్రహములతో గలిసియున్నయెడల నృపచోర అగ్నిభీతియు జ్వరభయము మొదలగునవి గలుగును.

శ్లో॥ ద్విసప్తమస్థితే రాహౌ తస్థానాధిపసంయుతే
అపమృత్యుభయంచైవ సర్వభీతిశ్చ సంభవేత్
దుర్గాజపంతు కుర్వీత ఛాగదానం సమాచరేత్
కృష్ణాంగాంమహిషీం దద్యాచ్ఛాంతిమాప్నోత్య సంశయః॥

దశానాథునకు 2, 7, స్థానములయందు రాహువుండి ఆస్థానాధిపతితోగూడినయెడల పాముకాటువలన మరణము గలుగును. అట్టిఅపమృత్యుభయము పోవుటకై దుర్గాజపమును ఛాగదానమును నల్లనిగేదిని దానమును చేయవలెను.

రవిదశలో గురుభుక్తి మా 9 రో 18.

శ్లో॥ సూర్యస్యాంతర్గతేజీవే లగ్నాత్కేంద్రత్రికోణగే
ఉచ్చస్వక్షేత్రలాభస్థే మిత్రక్షేత్రగతేపివా
దాయేశేబలసంయుక్తే వివాహం రాజదర్శనం
ధనధాన్యాదిలాభంచ పుత్రలాభంమహత్సుఖం
మహారాజప్రసాదేన ఇష్టకార్యార్థలాభకృత్
రాజసన్మానకీర్తించ లోకానుగ్రహవైభవం
ధనలాభం మహాత్సౌఖ్యం ధర్మసిద్ధికరం శుభం

స్వగృహేచోత్సవంచైవ విద్యాభ్యాసాది కౌశలం
దేవతాగురుభక్తిశ్చ పుణ్యతీర్థావగాహనం
భాగ్యకర్మాధిపవశాద్రాజ్యలాభం మహోత్సవం
పుత్రలాభం ప్రకుర్వీత ఇష్టసిద్ధిం శుభాధికం॥

రవిమహాదశలో గురునియొక్క అంతర్దశయందు లగ్నములగాయతు కేంద్రకోణములయందుగాని ఉచ్ఛస్వక్షేత్ర లాభమిత్రక్షేత్రములయందుగాని గురుడు బలముగానున్నను వివాహము రాజదర్శనము ధనధాన్యాభివృద్ధి పుత్రలాభము మిక్కిలిసౌఖ్యము రాజానుగ్రహమువలన యత్నకార్యలాభము రాజసన్మానము సమస్తజనులవలన పూజ్యత ధనలాభము ధర్మకార్యములనుచేయుట శుభకార్యములనుజరుపుట విద్యాభివృద్ధి దేవబ్రాహ్మణభక్తి తీర్థయాత్రలుచేయుట మొదలగునవి గలుగును.

శ్లో॥ పాపగ్రహసమాయుక్తే పాపకర్మరతస్తథా
పాపమూలాద్ధనంనాశం దేశభ్రష్టం మనోరుజం
నీచేవాస్తంగతేవాపి ధననాశం మనోరుజం
రాజకోపం ప్రకుర్వీత ఇష్టబంధువినాశనం॥

ఆగురుడు పాపగ్రహముతో కలిసియున్నయెడల పాపకర్మలు చేయుటయు అందువలన ధననాశనము దేశత్యాగము శరీరపీడ గలుగును. ఆగురుడు నీచయందుగాని అస్తంగతుడై గానివున్నయెడల ధననాశనము శరీరపీడ రాజకోపము బంధునాశనమును గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే నృపక్రోధంభవిష్యతి
ఉద్యోగభంగమాలస్యం శిరోరోగం తథైవచ
శశినాసంయుతేదృష్టే భూషణాంబరసంగ్రహం
మృష్టాన్నపానకుసుమం శయ్యాసౌఖ్యాదిరేవచ॥

ఆగురుడు రవితోగలిసినను చూడబడినను రాజక్రోధము ఉద్యోగభంగము శిరోరోగము గలుగును. చంద్రునితో గలిసినను చూడబడినను వస్త్రాభరణవృద్ధి సుభోజనము కుసుమ శయ్యాసౌఖ్యము యివిగలుగును.

శ్లో॥ భౌమేనసంయుతేదృష్టే స్త్రీపుత్రక్షేత్రనాశనం
యత్నకార్యవినాశశ్చ సర్వత్రకలహం తథా
సౌమ్యదృష్టియుతేవాపి వేదశాస్త్రాది పాఠకః
దేవతారాధనంచైవ గర్భోత్పత్తిర్నసంశయః॥

ఆగురుడు కుజునితో గలిసినను చూడబడినను స్త్రీపుత్రనాశనము భూవ్యయము చేయబూనినపని విఘ్నము జరుగుట అందరితోను విరోధము యివిగలుగును.

బుధునితోగలిసినను చూడబడినను వేదశాస్త్రాదిపాండిత్యము దేవతారాధనము భార్యగర్భముధరించుట మొదలగునవి గలుగును.

శ్లో॥ భృగుదృష్టియుతేవాపి విటగాయక సంకులం
గానవిద్యాధికౌశల్యం సువస్త్రాభరణాయుతం
శనినాశంయుతేదృష్టే కృషిక్షేత్రవినాశనం
భృత్యవర్గాదికలహం నీచసేవాభవిష్యతి!

ఈగురుడు శుక్రునితో గలిసినను జూడబడినను విటులతోను పాటకులతోను గలిసియుండుట సంగీతము పాడుట యందు నేర్పరితనము మంచివస్త్రాభరణములతో గూడియుండుట యివి గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడల వ్యవసాయనష్టము భూనష్టము సేవకులతో విరోధము నీచసేవ యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్సుభరాశిస్థే భాగ్యవృద్ధిస్సుఖావహాం
తద్భుక్తౌద్రవ్యలాభశ్చ రాజప్రీతిమహోత్సవం
ధనధాన్యవివృద్ధిశ్చ పుత్రలాభం మహాత్సుఖం
యత్నకార్యార్థసిద్ధిశ్చ తీర్థయాత్రాఫలం వదేత్॥

దశానాథుడైన రవికి కేంద్రకోణములయందు గురుడున్నయెడల అట్టి గురుభుక్తియందు ద్రవ్యలాభము రాజానుగ్రహము ధనధాన్యాభివృద్ధి పుత్రలాభము యత్నకార్యసిద్ధి తీర్థయాత్రాఫలము గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే
తద్భుక్తౌదేహబాధాచ పుత్రనాశం ధనక్షయం
బుద్ధిభ్రంశం మానభంగం అతికష్టదరిద్రతా
సర్వత్రకలహంచైవ కృషిధాన్యవినాశనం॥
ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం రుద్రజప్యవ్రతంచరేత్

స్వర్ణదానం ప్రకుర్వీత దానంవిద్యు_క్తమాచరేత్
పశ్చాత్సౌఖ్యమవాప్నోతి ఇష్టసిద్ధిర్భవిష్యతి॥

దశానాథుడైన రవికి షష్ఠాష్టమవ్యయములయందు పాపగ్రహముతోగలిసి గురుడున్నయెడల ఆగురుభుక్తియందు శరీరపీడ పుత్రనష్టము ధనవ్యయము మనశ్చాంచల్యము మాన భంగము మిక్కిలి కష్టము దరిద్రము సర్వజనవిరోధము వ్యవసాయనష్టము మొదలగునవి గలుగును.

ఆగురుడు దశానాథునితోగాని లగ్నమందుగాని పాప గ్రహముతో గలిసియున్నయెడల నూరకముజరుగును. దానికి రుద్రజపమును సువర్ణదానమును చేసినయెడల వెంటనే సౌఖ్య ము గలుగును,

రవిదశలో శనిభుక్తి మా 11 రో 12.

శ్లో॥ రవేరంతర్గతేమందే లగ్నాత్కేంద్రత్రికోణగే
తృతీయే లాభగేవాపి తుంగరాశిస్థితేపివా
తద్భుక్తౌ కార్యసిద్ధిశ్చ వ్యవహారే ధనాగమం
గృహేకళ్యాణసంపత్తిః బంధుసన్మానమేవచ
సమానజనమిత్రత్వం మిత్రవర్గవివృద్ధిదం
నీలవస్తూని సంప్రాప్తి గజమాహిషసంకులం
యత్నకార్యసుసిద్ధిశ్చ గృహప్రారంభణంతథా
నానామూలాధనాప్తిశ్చ నృపమూలాన్మహత్సుఖం॥

రవిమహాదశలోశని లగ్నములగాయతు కేంద్రకోణ

ములయందుగాని ద్వితీయలాభములయందుగాని ఉచ్ఛయందు గాని వున్నయెడల ఆశనిభుక్తియందు వ్యవహారమువలన ధనలాభము గృహమందు కళ్యాణము బంధుసన్మానము సమానజనులతో స్నేహము మిత్రవృద్ధి నల్లనివస్తువులయొక్క సంపాదన యేనుగులు మొదలగు పశువృద్ధి యత్నకార్యసిద్ధి గృహనిర్మాణముఅనేకవిధములధనలాభము రాజులవలన సుఖముగలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టరాశిస్థే వ్యయేవా నీచరాశిగే
తద్భుక్తౌ దేహనాశశ్చ చింతావ్యాధిర్భవిష్యతి
నీచసంసర్గకలహం స్థాననాశం నృపాద్భయం
ఆప్తబంధువినాశశ్చ సమాజ జననాశనం
దాయాదికలహంచైవ పశుహాని ర్భవిష్యతి
యత్నకార్యవినాశశ్చ సర్వత్రకలహంతథా
భుక్త్యాదౌత్రీణి మాసాని అత్యంతం కష్టసంభవః॥

యీశనిలగ్నములగాయితు లగ్నమందుగాని షష్ఠాష్ట వ్యయమందుగాని నీచయందుగాని వున్నయెడల యీశనిభుక్తియందు శరీరపీడ మనోరోగము నీచులతో విరోధము స్థానభ్రష్టత్వము రాజులవలన భయము ఆప్తబంధునష్టముదాయాదులతో కలహము పశునష్టము యత్నకార్యనష్టము గలుగును. యీభుక్తియొక్క ఆదియందు మూడుమాసములవరకు మిక్కిలి కష్టము గలుగును.

శ్లో॥ పాపదృష్టియుతేమందే రాజద్వారే విరోధకృత్
బంధనం ప్రాణహానిశ్చ అకస్మాత్కలహంతథా
వాతశూలమహావ్యాధిః జ్వరాతీసారపీడనం॥

ఈశనికి పాపులతో సంబంధవీక్షణములు గలిగియున్న యెడల రాజులతో విరోధము బంధనము ప్రాణహాని గలుగును. శూలవ్యాధి జ్వరాతిసారము గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే నృపక్రోధంభవిష్యతి
ఉద్యోగభంగమాలస్యం పితృవర్గవినాశనం
శశినాసంయుతేదృష్టే మనోవ్యాధి ర్భవిష్యతి
శిరోబాధాకుక్షిబాధా సర్వత్రకలహం తధా॥

ఈశని రవితో కలిసియున్నను చూడబడినను రాజులతో విరోధము ఉద్యోగభంగము పితృభంగము పితృవర్గనాశనము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్న యెడల మనోరోగము శిరోభాధ కుక్షిబాధ కలహము గలుగును.

శ్లో॥ భౌమేనసంయుతేదృష్టే భ్రాతృభిఃకలహం తధా
యుద్ధేష్వపజయంచైవ మహావ్యాధి ర్భవిష్యతి
సౌమ్యేన వేదశాస్త్రాది శిక్షాజ్ఞానంచ సంగ్రహం
బాంధవాది సహాయుక్తం స్వగృహేబ్యోత్సవంతధా॥

ఈశనికి కుజునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్న యెడల సోదరులతో విరోధము యుద్ధమందు అపజయము గొప్పరోగముగలుగును.

బుధునితో కలిసినను చూడబడినను వేదశాస్త్రముల

యందు పరిజ్ఞానము బంధుసమాగమము గృహమందు శుభకార్యములును జరుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే పుత్రనాశం ధనక్షయం
దేహతాపంబంధునాశం బుద్ధిభ్రంశం భవిష్యతి
శుక్రేణసంయుతెదృష్టే స్త్రీసౌఖ్యంవస్త్రసంగ్రహం
వాహనం భూషణప్రాప్తిః స్త్రీప్రభోస్తు సుసేవనం॥

యీశనికి గురునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడల పుత్రనాశనము ధనక్షయము దేహతాపము బంధునాశనము మనశ్చాంచల్యము గలుగును.

శుక్రునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడల స్త్రీసౌఖ్యము వస్త్రవాహనాలంకారప్రాప్తి రాజులవద్ద ఉద్యోగము గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేపి వా
ధనధాన్యవివృద్ధిశ్చ కృషిక్షేత్రాదిసంగ్రహం వాహ
సంబంధుసంప్రాప్తిః కళ్యాణాదిమహోత్సవం॥

దశానాధుడైన రవికి యీశని కేంద్రకోణములయందు కాని తృతీయలాభములయందుగాని వున్నయెడల ధనధాన్యాభివృద్ధి కృషిక్షేత్రాభివృద్ధి వాహనసౌఖ్యము బంధుసమాగమకళ్యాణాదిమహోత్సవములు గలుగును.

శ్లో॥ దాయేశాద్రిపురంధ్రస్థే వ్యయేవా పాపసంయుతే
నిధనం బంధనం భీతిః దారపుత్రాదినాశనం॥

దాయేశాద్రిపురంధ్రస్థే వ్యయేవా శుభసంయుతే
భుక్త్యాదా శోభసంప్రోక్తం అంతక్లేశకరంధృవం॥

దశానాధునకు షష్ఠాష్టమవ్యయములయందు శని పాపగ్రహములతో కలిసియున్నయెడల శరీరపీడ బంధనము భయము దారపుత్రాది నష్టము గలుగును. శుభగ్రహముతో గలిసియున్నయెడల ఆభుక్తియొక్క ఆదియందు సౌఖ్యమును అంత్యమందు కష్టమును గలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనసనాథేతు అపమృత్యుభయావహం
కృష్ణాంగాంమహిషీం దద్యాద్దానేనారోగ్యమావిశత్
మృత్యుంజయజపంచైవశాంతింకుర్యాద్యథావిధి
ఛాగదానమితిప్రోక్త మపమృత్యునివారణం
పశ్చాత్సౌఖ్యమవాప్నోతి ఇష్టసిద్ధిర్భవిష్యతి॥

దశానాధుడైన రవికి శనిద్వితీయసప్తమములయందున్నయెడల మరణభయముగలుగును. దానికి నల్లని శరీరముగల గేదెను దానముచేసినయెడల అట్టి అపమృత్యుదోషము తొలగును. మరిన్ని శివజపముగాని మేకదానముగాని చేసినయెడల సౌఖ్యముగలుగును.

రవిమహాదశలో బుధ భుక్తి మా 10 రోం

శ్లో॥ సూర్యస్యాంతర్గతేసౌమ్యే లగ్నాత్కేంద్రత్రికోణగే।
తృతీయేలాభగేవాపి ఉచ్చేవా శుభసంయుతే।
తద్భుక్తౌ రాజసన్మానం పుత్రదారాది సంగ్రహం।

సమానజనవిశ్వాసం బంధూనాముపకారకం।
వాక్పటుత్వం మనోధైర్యం వస్త్రభూషణసంగ్రహం।
దేవతాగురుభక్తిశ్చ పితృమాతృపూజనం।
మహారాజప్రసాదేన యిష్టసిద్ధిర్భవిష్యతి।
అపూర్వవస్తు సంప్రాప్తిః వజ్రమాణిక్యసంగ్రహం॥

సూర్యదశలో బుధునియొక్క అంతర్దశయందు బుధుడు లగ్నము లగాయతు కేంద్రకోణముల యందుగాని ఉచ్ఛయందుగాని శుభగ్రహయుక్తుడైగాని వున్నయెడల ఆబుధభుక్తి యందు పుత్రదారాభివృద్ధి సమానజనులతో స్నేహము బంధువులకుపకారము వాక్పటుత్వము మనోధైర్యము వస్త్రాలంకారప్రాప్తి దేవబ్రాహ్మణగురుభక్తి పితృమాతృసేవ రాజానుగ్రహమువలన యత్నకార్యసిద్ధి నూతనవస్తుసంపాదన వజ్రమాణిక్యములయొక్క సంపాదన మొదలగునవి గలుగును.

శ్లో॥ భాగ్యేపంచమరాశిస్థే సన్మానంభవతి ధృవం।
స్వకర్మధర్మవృద్ధిస్స్యాత్ గురుదేవార్చనసుఖం॥

ఈబుధుడు భాగ్యమందుగాని పంచమమందుగాని వుండినయెడల రాజసన్మానము కర్మాభివృద్ధి ధర్మప్రవర్తనము గురుదేవార్చన మొదలగునవి గలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాంత్యరాశిస్థే అష్టమే నీచగేపి వా।
కలహం దేహబాధాచ బంధుపుత్రవినాశనం।
కారాగృహప్రవేశంచ నిగళంబంధనం తథా।

అన్యథా గ్రామవాసశ్చ నానారోగభయం తథా।
ఆదౌ దుఃఖఫలంచైవ మధ్యే సుఖమవాప్నుయాత్॥
అంతే క్లేశకరంచైవ। బలహీనం భవిష్యతి॥

లగ్నములగాయతు షష్ఠాష్టవ్యయముల యందుగాని నీచయందుగాని బుధుడున్న యెడల కలహామున్ను దేహబాధయున్ను బంధుపుత్రవినాశనము కారాగృహానివేశనము నిగళబంధనము అన్యగ్రామవాసము అనారోగ్యభయము గలుగును. ఈభుక్తియొక్క ఆదియందును అంత్యమందును కష్టమును మధ్యయందు సౌఖ్యమును గలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే దేహతాపం వినిర్దిశేత్।
శిరోభ్రమణరోగాది స్థాననాశం నృపాద్భయం।
శశినాసంయుతే దృష్టే విద్యాసంగ్రహతత్పరః।
సాంఖ్యయోగాదితత్వజ్ఞః నటగాయకలోలుపః॥

బుధుడు రవితో కలిసియున్న యెడల శరీరతాపము శిరోరోగము స్థాననాశనము రాజులవలన భయముగలుగును. చంద్రునితో గలిసినయెడల విద్యాభివృద్ధి తత్వవిచారణ నాట్యగానములయందు ప్రీతిగలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే క్షేత్రపత్నివినాశనం।
అన్నద్వేషం శిరోరోగం నేత్రవైకల్యమేనచ।
గురుణాసంయుతే దృష్టే పుత్రవృద్ధిర్భవిష్యతి।
అంబరాభరణప్రాప్తిః నృపమూలాద్ధనాగమం।

బుధునకు కుజునియొక్క సంబంధవీక్షణములు గలిగి యున్నయెడల భూనాశనము భార్యావియోగము అన్నద్వేష ము శిరోరోగము నేత్రవ్యాధిగలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడ ల పుత్రవృద్ధి వస్త్రాలంకారసౌఖ్యము రాజులవలనధనలాభమి యివిమొదలగు మంచిఫలములు గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే వాహనాని సులబ్ధవాన్।
కళత్రసౌఖ్యమాప్నోతి చింతితార్థస్య సిద్ధిదం।
శనినాక్షేత్రవృద్ధిశ్చ దాసీదాసాదిసంగ్రహం।
గోమహిష్యాదిలాభశ్చ యత్నకార్యార్థసిద్ధికృత్॥

ఈబుధునకు శుక్రునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడల వాహనసౌఖ్యము కళత్రసౌఖ్యము తలచిన కార్యము నెరవేరుట గలుగును,

శనియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడల భూసంపాదన దాసదాసీజనములు పశులాభము యత్నకార్య సఫలముగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా మశ్చిత్తే లాభగేపివా।
శుభగ్రహయుతేవాపి ధనలాభము దీరయేత్।
బంధూపకారం కళ్యాణం విచిత్రగృహలాభకృత్।
యుద్దేషుజయమాప్నోతి మహత్వాహంతరైనచ।
మణివస్త్రాదిలాభశ్చ విద్యాసంగ్రహతత్పరః।
తీర్థస్నానఫలప్రాప్తిః దర్శనంచ మహాత్మనాం॥

దశానాథుడై నరవికి బుధుడు కేంద్రకోణములయందు గాని తృతీయలాభములయందుగాని శుభగ్రహముతో గలిసి యున్నయెడల ధనలాభము బంధువులకుపకారము కళ్యాణము విచిత్రగృహనిర్మాణము యుద్ధమందుజయము మణివస్త్రాది లాభములు విద్యాగోష్టి తీర్ధయాత్రఫలము మహాత్ములయొక్క దర్శనము గలుగును.

శ్లో॥ దాయేశాత్సుతభాగ్యస్థే పుత్రవృద్ధి స్తదాభవేత్।
శుభగ్రహాయుతేసౌఖ్యం బుద్ధిపుత్రార్థసంపదః॥

దశానాథునకు పంచమభాగ్యస్థానములయందు బుధుడున్నయెడల పుత్రసంతానవృద్ధి గలుగును శుభగ్రహముతో గలిసియున్నయెడల సమస్తసౌఖ్యములు గలుగును.

శ్లో॥ దాయేశాద్వ్యయగేషష్టే రంధ్రేవా పాపసంయుతే।
తద్భుక్తౌకలహంచైవ స్థాననాశంతథైవచ।చోరాది
రిపుభీతిశ్చ సమానజననాశనం।ద్వితీయసప్తమస్థేవా
అపమృత్యుర్భవిష్యతి।తద్దోషపరిహారార్థం విష్ణుసా
హస్రకంజపేత్। రజితప్రతిమాదానం కుర్యాదారో
గ్యమాదిశేత్॥

ఈబుధుడుదశానాధునకు షష్టాష్టమ వ్యయస్థానముల యందున్నను పాపగ్రహముతోగలిసియున్నను యీభుక్తియం దు కలహము స్థానభ్రష్టత్వము శత్రుచోరబాధ బంధునాశనము గలుగును.

ద్వితీయసప్తమ స్థానములయందున్న యెడల మారకభయముగలుగును దీనికివెయ్యిపర్యాయనములు విష్ణుజపము రజిత ప్రతిమాదానము చేసినయెడల ఆరోగ్యముగలుగును.

రవిదశలో కేతుభుక్తి మా 4 రో 6.

శ్లో॥ రవేరంతర్గతే కేతౌ లగ్నాత్కేంద్రత్రికోణగే। తృతీయే
లాభగేవాపి శుభగ్రహాయుతేపివా।తద్భుక్తౌ పు
ణ్యతీర్థాదిస్నానం దైవతదర్శనం।కీర్తిలాభం మహో
త్సాహం సమరేవిజయప్రదం।నీలవస్తుషుసంప్రాప్తిః
గురుదైవతదర్శనం నష్టద్రవ్యార్థసిద్ధిస్స్యాత్ స్కంధోపాసన
తత్పరః

రవిలో కేతువు లగ్నములగాయతు కేంద్రకోణముల యందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహాయుక్తుడై యున్నయెడల ఆభుక్తియందు తీర్థయాత్రాదిలాభము దేవతాదర్శనము కీర్తి లాభము యుద్ధమందుసేర్పు నల్లనివస్తు సంపాదన గురుదర్శనము పోయినద్రవ్యము దొరుకుట కుమారస్వామియొక్క ఉపాసన మొదలైనవి గలుగును.

శ్లో॥ లగ్నాదుపచయే కేతౌ ధనలాభం మహత్సుఖం।
వివాహోత్సవకార్యాణి శుభకర్మశుభాదికం।
శుభగ్రహసమాయుక్తే రాజానుగ్రహశాంతికం।
పుత్రోత్సవాదిసంతోషం గజగోలాభమేవచ॥

లగ్నములగాయతు 3, 10, 11 స్థానములయందు కేతువుండినయెడల ధనలాభము మహాసౌఖ్యము వివాహముశుభ

కార్యములు శుభకర్మలుగలుగును శుభగ్రహముతో గలిసిన యెడల రాజానుగ్రహము పుత్రోత్సవము సంతోషము యేనుగులు గోవులు వీటియొక్క సంపాదనగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టె నృపబాధాభవిష్యతి
జ్వరాతిసారరోగాది స్వస్థానచలనంభవేత్
శశినాసంయుతేదృష్టె సుఖశయ్యాదిభోజనం
యత్నకార్యసుసిద్ధిస్స్యాత్ స్త్రీపుత్రధనవృద్ధిదం॥

ఈ కేతువు రవితోగూడినను చూడబడినను రాజులవలన బాధ జ్వరము అతిసారము స్థానచలనము గలుగును.

చంద్రునియొక్క సంబంధ వీక్షణములు గలిగినయెడల శయ్యాసౌఖ్యము సుఖభోజనము యత్నకార్యసిద్ధి స్త్రీపుత్ర సంపత్తుగలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టె శత్రుబాధాభవిష్యతి
కలహంరాజకోపశ్చ స్థాననాశంతథైవచ
సౌమ్యేనసంయుతేదృష్టె బంధూనాముపకారకం
క్షేత్రస్త్రీపుత్రవృద్ధిస్స్యాద్విద్యాభ్యాసాదిసంగ్రహం॥

యీ కేతువునకు కుజునియొక్క సంబంధ వీక్షణములు గలిగియున్న యెడల శత్రువులవలన బాధ కలహము రాజులతో కలహము స్థానభ్రష్టత్వము గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్న యెడల బంధువులకుపకారము భూసంపాదన స్త్రీపుత్రధనసంపత్తు విద్యాసౌఖ్యము యివిగలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే దేహారోగ్యంతధైవచ
పుత్రోత్సవాదిసంతోషం సర్వకార్యసుసిద్ధిదం॥
శుక్రేణసంయుతేదృష్టే స్త్రీసౌఖ్యం బంధుపూజ్యతా
విద్యావినోదసౌఖ్యంచ విటగాయకసంకులం॥

ఈ కేతువు గురునితోగూడిన దేహారోగ్యము పుత్రోత్సవము సర్వకార్యములు సిద్ధించుటయుగలుగును. శుక్రుని యొక్క సంబంధవీక్షణములు గలిగినయెడల కళత్ర సౌఖ్యము బంధుపూజ్యత విద్యావినోదము సౌఖ్యము నాట్యము సంగీతముగలవారితో స్నేహము మొదలగు ఫలములుగలుగును.

శ్లో॥ శనినాదేహవాతాది కలహంరాజవిద్వరం
సంతాపజ్వరపీడాచ గ్రహణీరోగసంభవం

యీ కేతువు శనితోగూడినయెడల వాతరోగము కలహము రాజవిరోధము సంతాపము జ్వరపీడ గ్రహణీరోగము యివిమొదలగు బాధలు గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయే లాభగేపివా
శుభగ్రహయుతేవాపి ధనలాభముదీరయేత్
ప్రభుసన్మానమారోగ్యం వస్త్రాభరణసంగ్రహం
పుత్రోత్సవాదిసంతోషం గృహలాభంవిచిత్రకం

దశానాధుడైనరవికి కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహములతోగూడిగాని యున్నయెడల ధనలాభము ప్రభుసన్మానము ఆరోగ్యము

వస్త్రాభరణప్రాప్తి పుత్రోత్సవము సంతోషము వివిధగృహలాభము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే
తద్భుక్తౌ స్థాననాశాది నృపమూలాద్ధనవ్యయం
పశుక్షేత్రాదినాశశ్చ వివిధాకలహంతథా
చోరాగ్నివిషబాధాచ సర్వత్రకలహం తథా॥

దశానాథుడైన రవికి షష్ఠమమందుగాని అష్టమవ్యయములయందుగాని పాపులతోగూడిగాని వున్నయెడల ఆభుక్తియందు స్థానభ్రష్టత్వము రాజులవలనధనవ్యయము, పశునాశనము భూవ్యయము వివిధకలహము చోరులవల్లను అగ్నివల్లను విషమువల్లను బాధ సకలజనులతో కలహము యివిగలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా మహావ్యాధిర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం సూర్యప్రార్థన మాచరేత్॥

దశానాథుడైన రవికి ద్వితీయసప్తమములయందు కేతువున్నయెడల గొప్పవ్యాధిగలుగును దానికి సూర్యప్రార్థన జేసినయెడల రోగశాంతిగలుగును.

రవిదశలోశుక్రభుక్తి మా 12

శ్లో॥ సూర్యస్యాంతర్గతేశుక్రే లగ్నాత్కేంద్రత్రికోణగే
లాభేవాథతృతీయస్థే ఉచ్ఛస్వక్షేత్రగేపివా
తద్భుక్తౌవాహనప్రాప్తిః మహారాజప్రసాదతః

కళ్యాణసుఖమారోగ్యం పుత్రజనోత్సవంతథా
ధనధాన్యాభివృద్ధిశ్చ క్షేత్రవృద్ధిశ్చజాయతే
తీర్థస్నానాదిసంప్రాప్తిః దేవతాగురుదర్శనం॥

రవిదశలో శుక్రభుక్తియందు శుక్రుడు లగ్నములగా యతు కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయం దుగాని ఉచ్ఛస్వక్షేత్రములయందు గాని యున్నయెడల వాహ నప్రాప్తి మహారాజదర్శనము కళ్యాణము సౌఖ్యము ఆరో గ్యము పుత్రజనోత్సవము ధనధాన్యాభివృద్ధి క్షేత్రవృద్ధి తీర్థస్నానాదిప్రాప్తి దేవదర్శనము గురుదర్శనము యివి గలుగును.

శ్లో॥ లగ్నషష్టాష్టరాశిస్థే వ్యయేవా పాపసంయుతే
దేహబాధామనస్తాపం కార్యనాశం మహాద్భయం
స్వబంధుకలహంచైవయత్నకార్యవినాశనం
సమరేషుభయంచైవ భూమిదారవినాశనం అశ్వగోగజ
నాశంచ స్వబంధూనాంక్షయంతథా
వస్త్రభూషణహానిశ్చ చోరబాధాభవిష్యతి

దశానాథుడైనరవికి లగ్నములగాయతు షష్టాష్టవ్యయ ములయందుగాని పాపులతోగూడినగాని శుక్రుడున్నయెడల దేహబాధ మనస్తాపము కార్యనాశనము విశేషభయము. ముఖ్యమైనబంధువులతో విరోధము. యత్నకార్యభంగము యుద్ధమందుభయము భూనష్టము దారపీడ పశునష్టము బం

ధుక్షయము వస్త్రాలంకారనష్టము చోరబాధ మొదలయినవి గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే వ్యాధిశస్త్రాదిపీడనం
ఆచారహీనవిభ్రంశం స్థాననాశం భవిష్యతి
శశినాసంయుతేదృష్టే దారపుత్రాదిసౌఖ్యదం
దేహారోగ్యం మనస్సౌఖ్యం ఇష్టసిద్ధి ర్భవిష్యతి॥

శుక్రుడు రవిసంబంధవీక్షణములుగలిగినయెడల శరీర పీడ శస్త్రబాధగలుగును. అనాచార ప్రవర్తనముస్థానభ్రష్టత్వము గలుగును

చంద్రసంబంధవీక్షణములు గలిగినయెడల దారపుత్రాదిసౌఖ్యము దేహారోగ్యము ఇష్టకార్యసిద్ధిగలుగును.

శ్లో॥ కుజేన దేహతాపాది శస్త్రఘాతాద్ పీడనం
కళత్రబంధుపీడాచ జ్ఞాతీనాంకలహంతథా
బుధే శాస్త్రాదివిజ్ఞానం బాంధవాదిసమాగమః
విశేషవిద్యావిజ్ఞానం గృహభూషణసంగ్రహం॥

శుక్రుడుకుజునితోకలసినయెడల దేహతాపము కత్తి దెబ్బ మొదలగునవిగలుగును. జ్ఞాతులతో విరోధము కళత్ర బంధుపీడగలుగును.

బుధునితోగలిసినయెడల శాస్త్రపరిజ్ఞానముబంధుసమాగమము ప్యాడిత్యము అలంకారప్రాప్తి గలుగును.

శ్లో॥ గురుణాసుతలాభశ్చ శతృవృద్ధి ర్భష్యతి
వ్యాధిపీడా కార్యహానిః నృపమూలాద్ధనవ్యయం

శనినా నీచసేవాది నీచానాంచ సహాంగమం
భృత్యైర్వర్గవిరోధశ్చ మనస్తాపం భవిష్యతి

ఈశుక్రుడు శనితోఁ గలిసినయెడల పుత్రలాభము శత్రువృద్ధి వ్యాధిపీడ కార్యహాని రాజమూలకముగా ధనవ్యయముగలుగును. శనితోఁగలిసినయెడల నీచసేవయు నీచులతో సహవాసము సేవకులతోఁ విరోధము మనస్తాపముగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణస్థే తృతీయే లాభగేపివా।
తద్భుక్తౌ రాజసన్మానం కళ్యాణాదిమహోత్సవం।
దారపుత్రాదిసౌఖ్యంచ వస్త్రాభరణసంగ్రహం।
అపూర్వవస్తుసంప్రాప్తి ర్ముక్తికాని విశేషతః॥
పశువాహనలాభంచ యిష్టసిద్ధిర్భవిష్యతి॥

దశానాథునకు కేంద్రకోణములయందుగాని తృతీయ లాభములయందుగాని శుక్రుండున్నయెడల ఈశుక్రభుక్తియందు రాజసన్మానము వివాహాదిమహోత్సవములు దారాపుత్రాదిసౌఖ్యములు వస్త్రాలంకారములు ముత్యములు మొదలగుభూషణములు గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే
నీచగ్రహాయుతేవాపి ధననాశంవదేద్బుధః
స్వదేహపీడనంచైవ దారాపుత్రవినాశనం
సర్వత్రకలహంచైవ స్థాననాశంతథైవచ
భుక్త్యాదౌ వాహనంలాభం మధ్యేశుభకరంభవేత్

అంతేధాన్యార్థనాశంచ స్థానభ్రంశమథాపివా
ద్వితీయద్యూనరాశిస్థే దేహపీడాభవిష్యతి
రంధ్రాధిపసమాయోగే అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం మృత్యుంజయజపంచరేత్
శ్వేతాంగాంమహిషీందద్యాత్ రుద్రజప్యంచకారయేత్॥

దశానాథుడైనరవికి శుక్రుడు షష్ఠాష్టవ్యయములయం దున్నను పాపగ్రహముతో గలిసినను నీచగ్రహముతోగలిసి నను ధననాశనము శరీరపీడ కళత్రపుత్రవిచారము కలహము స్థానభ్రష్టత్వము గలుగును. ఈభుక్తియొక్క అదియందు వాహనసౌఖ్యమును మధ్యయందు శుభకార్యములును అంత్య మందు ధనధాన్యనాశనమును స్థానభ్రష్టత్వముగలుగును. దశానాథునకు ద్వితీయసప్తమములయందున్నయెడల శరీరపీడ గలుగును యీశుక్రుడు అష్టమాదిపతితో సంబంధించినయెడల మారకభయముగలుగును. దీనికిపరిహారము స్వచ్ఛమైనగోవును గేదెదానమునుచేసి రుద్రజపమును చేయించవలెను.

చంద్రదశాయాం చంద్రభుక్తిమా 10

శ్లో॥ చంద్రస్యాంతర్గతేచంద్రేలగ్నాత్కేంద్ర త్రికోణగే
రాజసన్మానకీర్తిశ్చ వివాహః పుత్రసంపదః
మహారాజప్రసాదేన గ్రామభూమ్యాది లాభకృత్॥
వాహనంరాజ్యలాభశ్చస్వోచ్ఛస్వక్షేత్రసంయుతే॥

చంద్రమహాదశలో చంద్రభుక్తియందు లగ్నములగా

యతు కేంద్రమందుగాని చంద్రుడున్నయెడల రాజసన్మానము కీర్తి వివాహము పుత్రసంపద మహారాజానుగ్రహము వలన గ్రామలాభము భూలాభము గలుగును.

చతుర్థమందుగాని లాభమందుగాని రాజ్యమందుగాని చంద్రుడున్నయెడలను ఉచ్చయందుగాని స్వక్షేత్రమందుగాని యున్నను మిక్కిలి శుభమగును.

శ్లో॥ త్రికోణలాభగే చంద్రే గురుయుక్తే థవీక్షితే
రాజ్యలాభంమహాసౌఖ్యం యశోవృద్ధింశుభాధికం
పూర్ణచంద్రేపూర్ణఫలం సేనాధిక్యంమహాసుఖం
భాగ్యకర్మాధిపేయుక్తే గజాశ్వాంబరసంకులం
దేవతాగురుభక్తించ పుణ్యశ్లోకాదికీర్తనం॥

త్రికోణములయందుగాని లాభమందుగాని చంద్రుడు గురునితో కలిసినను చూడబడినను రాజ్యలాభము మహాసౌఖ్యము యశస్సు శుభములు గలుగును. పూర్ణచంద్రుడైనయెడల పూర్ణఫలములు గలుగును. సేనలు విశేషముగాగలవాడును విశేషసౌఖ్యవంతుడును అగును. భాగ్యాధిపతితోగాని కర్మాధిపతితోగాని కలిసినయెడల యేనుగులు గొప్పవస్త్రములుగలవాడును దేవతాగురుభక్తియుతుడును పుణ్యశ్లోకాది పారాయణగలవాడును అగును.

శ్లో॥ పాపయుక్తేథవాచంద్రే నీచేషష్టాష్టరిప్ఫగే
తత్కాలేధననాశస్స్యాత్ స్థానచ్యుతిమనోవ్యథా

దేహాయాసంమనస్తాపం రాజమంత్రైర్విరోధకృత్
గ్రహాక్త రాశిదిగ్భాగే ప్రయాణంచ భవిష్యతి
కృత్వాసనురమత్యుగ్రహతాశ్చోహతసంకులః
ఆయుధేనరక్షతాదిలిజత్వాశత్రురణేపిచ
మిత్రాత్మబంధునాశస్స్యాత్స్వప్రభోశ్చాపమృత్యుకృత్
యదిజీవిత పుణ్యంస్యా దాయుష్యంస్యాత్ప్రవృద్ధయే॥

ఈచంద్రుడు పాపులతోగూడినను నీచయందుగాని షష్ఠాష్టమవ్యయములయందుగాని యుండినను ఆచంద్రభుక్తి యందు ధననాశనము స్థాననాశనము మనోవ్యాకులత శరీర కష్టము మనస్తాపము రాజులతోగాని మంత్రులతోగాని విరోధము చంద్రుడున్న రాశి దిక్కునకు ప్రయాణము గలుగును.

మరియును యుద్ధమందు సైన్యనష్టము. ఆయుధము చేతను రక్షించుకొనుట మిత్రులయొక్కయు బంధువులయొక్కయు మరణము తనప్రభువు నశించుట వానియొక్క పూర్వ పుణ్యమువలన జీవించినయెడల ఆయుర్దాయము గలుగును.

శ్లో॥ ద్వితీయేద్యూననాథేతురంధ్రాధిప సమన్వితే
దేహజాడ్యం మానభంగ మపమృత్యుభయంభవేత్
శ్వేతాంగాంమహిషీందద్యాత్ మృత్యుంజయజపంచరేత్
పశ్చాత్సౌఖ్యమవాప్నోతియిష్టసిద్ధిర్భవిష్యతి॥

ఈచంద్రుడు ద్వితీయసప్తమాధిపతులతోగాని అష్టమాధిపతితోగాని గూడినయెడల శరీరపీడ మానభంగము మర

ణభయము గలుగును. దీనికి తెల్లని గోవును గేదెను దానము చేసినను మృత్యుంజయ జపము చేసినను యిష్టసిద్ధి సౌఖ్యము గలుగును.

చంద్రదశలో కుజభుక్తి మా 7

శ్లో॥ చంద్రస్యాంతర్గతేభౌమే లగ్నాత్కేంద్ర త్రికోణగే
సౌభాగ్యం రాజసన్మానం వస్త్రాభరణభూషితం
యత్నకార్యార్థ సిద్ధిస్స్యాత్ భవిష్యతినసంశయః
గృహక్షేత్రాదివృద్ధిశ్చ వ్యవహారస్తథైవచ
కార్యలాభం మహత్సౌఖ్యం స్వోచ్చస్వక్షేత్రజంఫలం
భాతృవర్గాభివృద్ధిశ్చ కీర్తిలాభం ధనాగమం॥

చంద్రదశలో కుజునియొక్క అంతర్దశయందు కుజుడు లగ్నములగాయతు కేంద్రకోణములయందున్నయెడల రాజసన్మానము సౌభాగ్యము వస్త్రాలంకారప్రాప్తి ప్రయత్నించిన కార్యము సఫలమగుట గృహక్షేత్రాభివృద్ధి వ్యవహారలాభము సౌఖ్యము గలుగును. ఉచ్చస్వక్షేత్రములయందు కుజుడున్న యెడల సోదరవృద్ధి యశస్సు ధనలాభము గలుగును.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయేభౌమే పాపయుక్తే ధనాయుషి
ధననష్టం విశేషంచ రాజమూలాచ్చశత్రుభిః
రక్తస్రావోజంతుపీడాభూవ్యయం కురుతేసగః॥

కుజుడు షష్ఠాష్టమవ్యయములయందుండి పాపులచే చూడబడినయెడల ధననష్టము రాజమూలకముగా శత్రువృద్ధి రక్తస్రావము జంతుపీడ భూవ్యయము యివిగలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే స్వాధికార పదస్థితం
నృపాప్తింభూషణప్రాప్తిం చించితాన్యర్థసిద్ధిదం॥

యీకుజుడు రవితోగలిసినను చూడబడినను ఉద్యోగమునందధికసౌఖ్యము రాజసన్మానము భూషణప్రాప్తి ధనలాభము గలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టేమనోత్సాహం మహత్సుఖం
బంధుకళ్యాణసంతోషం క్షేత్రలాభం తథైవచ॥

ఈకుజుడు చంద్రునితో గలిసినను చూడబడినను మనోత్సాహము విశేషసుఖము బంధుసమాగమము కళ్యాణమహోత్సవము భూలాభము గలుగును.

శ్లో॥ సౌమ్యేనసంయుతేదృష్టే వేదశాస్త్రాది సంగ్రహం
బంధూనాము పకారత్వం పాండిత్యంమనోజయం
గురుణాసంయుతేదృష్టే దేహారోగ్యం తథైవచ
సురభూసురపూజంచ ద్రవ్యలాభం భవిష్యతి॥

యీకుజునకు బుధునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడల వేదశాస్త్రములయందభ్యాసము బంధువుల వలన నుపకారము పాండిత్యము మనస్సునందు జయము గలుగును. గురునియొక్క సంబంధవీక్షణములు గలిగినయెడల శరీరసౌఖ్యము దేవబ్రాహ్మణపూజ ద్రవ్యలాభము గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టేదారాపుత్రసమాగమం
స్థానప్రాప్తిక్షేమలాభం అశ్వాద్యారోహణంతథా

శనినాసంయుతేదృష్టే సంతాపం దేహపీడనం
జ్వరాతిసారరోగాదిసమాన జననాశనం.

యీకుజునకు శుక్రునియొక్క సంబంధవీక్షణములు గలిగినయెడల దారపుత్రులతో కలిసియుంటుట స్థలప్రాప్తి సువర్ణలాభము గుర్రముయొక్క స్వారి చేయుట గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములు గలిగినయెడల శరీర పీడ సంతాపము జ్వరాతిసారము సమానమనుజునియొక్క నాశనము గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణస్థేదుశ్చిక్యేలాభగేపినా
తద్భుక్తౌవాహనప్రాప్తిఃమహారాజప్రసాదతః॥

దశానాథుని లగాయతు కుజుడు కేంద్రకోణములయం దుగాని తృతీయలాభములయందుగాని యున్నయెడల వాహన ప్రాప్తిమహారాజ ప్రసాదము యివిమొదలగు మంచిఫలములు గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవావ్యయేవాపాపసంయుతే
తద్భుక్తౌబంధునాశశ్చవిదేశగమనంతథా
జ్ఞాతిశతృవివృద్ధిశ్చక్షేత్రనాశంతథైవచ
ఇష్టమిత్రవిరోధశ్చసమానజననాశనం
షష్ఠాష్టమవ్యయాధీశేద్వితీయాధిపభుక్తిషు
సప్తమాధిపయుక్తేనఅపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థంస్కందంపంచాక్షరంజపేత్
భాస్కరప్రార్థనంకుర్యాన్నాగదానంచశామ్యతి॥

దశానాథుడైన చంద్రునకు కుజుడు షష్ఠాష్టమములయందున్నయెడలను పాపులతోగూడినను అట్టివ్యయభుక్తియందు బంధునాశనము విదేశగమనముజ్ఞాతివిరోధము క్షేత్రనాశనము ప్రేమగలబంధువులతో విరోధము సమానమనుజునియొక్క నాశనముగలుగును.

షష్ఠాష్టమవ్యయాధిపతులయొక్క దశలలో ద్వితీయాధిపతియొక్క భుక్తియందు సప్తమాధిపతితో కుజుడుకూడినయెడలఅపమృత్యుభయముగలుగును అట్టిదోషము హరించుటకై స్కందపంచాక్షరీజపమును సూర్యప్రార్థనయు నాగప్రతిమాదానమును చేయవలెను.

చంద్రదశలో రాహుభుక్తిఫల 18

శ్లో॥ చంద్రస్యాంతర్గతేరాహౌ లగ్నాత్కేంద్రత్రికోణగే
ఆదౌసౌఖ్యఫలంజ్ఞేయంశత్రునాశంమహద్భయం
చోరాగ్నినృపభీతిశ్చచతుష్పాజ్జీవనాశనం
బంధునాశంమిత్రహానికలహేనమనోవ్యథా
శుభయుక్తేశుభదృష్టేధనధాన్యసమృద్ధిమాన్
యవనప్రభుసన్మానంజాతకస్యశుభాశుభం॥

చంద్రమహాదశలో రాహుభుక్తియందు రాహువులగ్నములగాయతు కేంద్రకోణములయందున్నయెడల మొట్టమొదట సౌఖ్యముగలుగును శత్రునాశము గలుగును మరియు విశేషభయము చోరులవల్లను అగ్నివల్లను రాజులవల్లనుభయ

మున్నా గోవులు మొదలగువాని నాశనము బంధునాశనముమి త్రహాని కలహామందు మనోవ్యాకులతగలుగును.

యీరాహువునకు శుభులయొక్క సంబంధవీక్షణము లుగలిగినయెడల ధనధాన్యసమృద్ధి శూద్రప్రభువులవలన సన్మానముశుభాశుభములు యివిజాతకునికిగలుగును.

శ్లో॥ రంధ్రస్థానాధిపేయుక్తేదృష్టేవా దేహపీడనం
తపృరోగవిషాద్భీతిఃశుభయుక్తేసదోషభాక్॥

యీరాహువుఅష్టమాధిపతియొక్క సంబంధవీక్షణములు గలవాడైయున్నయెడల శరీరపీడ అగ్నివల్లను విషమువల్లను భయముగలుగును శుభులుతోకలిసినయెడల దోషములుండవు

శ్లో॥ తృతీయేలాభగేవాపిశుభగ్రహయుతేపివా
ఉచ్చరాశిగతేవాపితద్భుక్తౌవ్యాధినాశనం
రాజసన్మానమైశ్వర్యంస్వపుత్రాణాంశుభప్రదం
స్వనామాంకితఉద్యోగంయత్నకార్యార్థసిద్ధిదం
తీర్థస్నానంచలభతేదేవతోత్సవదర్శనం
చతుష్పాజ్జీవలాభశ్చవస్త్రభూషణ మాయతి॥
సమరేవిజయంచైవజ్ఞాతిశత్రువినాశనం

ఈరాహువుతృతీయలాభము లందున్నయెడలను శుభగ్రహవీక్షణములు గలిగియున్నను ఉచ్చయందున్నను యీరాహుభుక్తియందు రాజసన్మానము ఐశ్వర్యము తనకుమారుల యొక్కశుభము రాజుతోసమానమైన ఉద్యోగము ప్రయత్న

ముచేసినకార్యములు సఫలమగుట తీర్థస్నానఫలము దేవతా మహోత్సవదర్శనము గోవులు మొదలగువానియొక్క సంపాద నవస్త్రాలంకారప్రాప్తియివి గలుగును.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయేరాహౌనీచస్థే పాపసంయుతే
రోగద్వయాత్స్యాన్నిధనయుద్వైరోగోదయస్తథా
తత్కాలేపుత్రమరణంభ్రమానిర్వీర్యచేతనః
స్థానచ్యుతిమవాప్నోతికలహంశత్రువృద్ధిదం
తద్దోషయోగసంప్రాప్తేసర్పవృశ్చికపీడనం
రక్తస్రావంమూత్రరోగంవాహనాదిక్షయంభవేత్॥

ఈరాహువుషష్ఠాష్టమవ్యయములయందుగాని నీచయందుగాని పాపులతో గూడిగానియున్నయెడల ద్వందరోగముల వలనమరణము, అంతర్దశానాధునకు విరోధియైన విదశాభుక్తి యందుపుత్రమరణము మతిభ్రమగలుగుట స్థానచలనముకలహము శత్రువృద్ధిసర్పవృశ్చికపీడ రక్తస్రావము మూత్రరోగము వాహననష్టముగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టేసన్నిపాతజ్వరంభయం
అతికష్టంమానభంగంస్వస్థానచలనంతథా
శశినాసంయుతేదృష్టేమాతృకష్టంవినిర్దిశేత్
మనఃకష్టంచఖేదంచకలహంచభవిష్యతి॥

ఈరాహువురవితో కలిసినను చూడబడినను సన్నిపాతజ్వరము అతికష్టము మానభంగము స్థానచలనముగలుగును.

చంద్రునితో గలిసినయెడలను చూడబడినను మాతృకష్టము మనోవిచారము భేదముకలహామియివి గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టేరక్తస్రావాదిపీడనం
పశుక్షేత్రవినాశశ్చమహావ్యాధిర్భవిష్యతి
సౌమ్యేనసంయుతేదృష్టేబాంధవానాంసమాగమం
విష్ణుగాధాప్రసంగంచవస్త్రభూషణసంగ్రహః॥

ఈరాహువుకుజునితో కలిసినను చూడబడినను రక్తస్రావరోగము పశునాశనము భూనాశనము గొప్పవ్యాధిగలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములు గలిగినయెడల బంధుసమాగమము విష్ణుసంకీర్తనము వస్త్రభూషణాలంకారము గలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టేఅర్థసిద్ధిర్భవిష్యతి
దేవార్చనంవిష్ణుపూజాపుత్రదారాదిసౌఖ్యదం॥

శ్లో॥ శుక్రేణవస్త్రహేమాదిమణిమాణిక్యసంగ్రహం
అశ్వాద్యారోహణంచైవవిచిత్రగృహలాభకృత్॥

ఈరాహువునకు గురునియొక్క సంబంధవీక్షణములు గలిగినయెడల ధనలాభము దేవార్చన విష్ణుపూజదారాపుత్రాదిసౌఖ్యములుగలుగును.

శుక్రునియొక్క సంబంధవీక్షణములు గలిగినయెడల వస్త్రములు బంగారము మణిమాణిక్యములు గుర్రముస్వారి విచిత్రగృహలాభము యివిగలుగును.

శ్లో॥ శనినాపుత్రపీడాచవిదేశగమనంతథా
బంధుద్వేషంమనస్తాపంనృపమూలాద్ధనవ్యయం॥

శనియొక్క సంబంధవీక్షణములు గలిగినయెడల విదేశగమనము బంధువిరోధము మనస్తాపము రాజులవల్లనుంచిధనవ్యయముయివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాతృతీయే లాభగేపివా
శుభగ్రహాయుతేవాపి ధనలాభం తథైవచ
క్షేత్రపశ్వాదివృద్ధిశ్చ వస్త్రభూషణమాయతిం
తీర్థస్నానఫలప్రాప్తి దేవతాగురుదర్శనం॥

దశానాథుడైన చంద్రునిలగాయితు కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహసంబంధవీక్షణములు గలిగియుండిగాని యున్నయెడల ధనలాభము భూలాభము పశులాభము వస్త్రాలంకారప్రాప్తి తీర్థస్నానఫలప్రాప్తి దేవతాగురుదర్శనము యివి గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవావ్యయేవా పాపసంయుతే
భుక్త్యాదౌరుతుమాసేచ దేహకష్టం మహద్భయం
దారాపుత్రవినాశశ్చసమాన జననాశనం
బంధుక్రోధం స్త్రీవివాదం స్థాననాశం ధనక్షయం
ద్వితీయేసప్తమస్థేవ అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం మృత్యుంజయ జపంచరేత్
భాగాదిపంచకంచైవ దేహారోగ్యం మహత్సుఖం॥

దశానాథునకు షష్ఠాష్టమవ్యయములయందు పాపసంబంధముగలిగి రాహువున్నయెడల యీభుక్తియందు మొదట ఆరుమాసములలో శరీరకష్టము నిశేషభయము దారాపుత్రుల యొక్క మరణము సమానజనకష్టము బంధువిరోధము స్త్రీలతో వివాదము స్థానభ్రష్టత్వము ధనకష్టము గలుగును.

ఈరాహువు ద్వితీయసప్తమస్థానములయందున్నయెడల మరణము గలుగును. అట్టిదోషము పోవుటకై మృత్యుంజయజపము మేకలు మొదలగువానియొక్క దానమువలన సౌఖ్యము ఆయుర్వృద్ధి గలుగును.

చంద్రదశలో గురుభుక్తి మా 16

శ్లో॥ చంద్రస్యాంతర్గతేజీవే లగ్నాత్కేంద్రత్రికోణగే
తృతీయేలాభగేవాపి ఉచ్చేస్వక్షేశుభసంయుతే
తద్భుక్తౌద్రవ్యలాభశ్చనృపప్రీతిర్మహోత్సవం
మహారాజాశ్రియప్రాప్తిః ఇష్టసిద్ధిర్భవిష్యతి
పుత్రలాభం దేహసౌఖ్యం విద్యాప్రాప్తిస్సుకీర్తిదా
శివకేశభక్తిశ్చ యజ్ఞయాగాది చింతనం
వస్త్రాలంకారభూషాప్తిః చతుష్పాజ్జీవలాభకృత్॥

చంద్రమహాదశలో గురుభుక్తియందు గురుడు లగ్నములగాయతు కేంద్రత్రికోణములయందుగాని తృతీయలాభములయందుగాని ఉచ్చయందుగాని శుభులతోగూడియుండిగాని యున్నయెడల ద్రవ్యలాభము రాజసన్మానము మహో

త్సవము మహారాజులయొక్క దయగలుగుట ఇష్టసిద్ధి పుత్రి లాభము శరీరసుఖము విద్యాసుఖము గొప్పకీర్తి శివకేశవభక్తి యజ్ఞయాగాదిక్రతువులు చేయుటయందు చింతన వస్త్రములు వాహనములు అలంకారము మొదలగువాని సంపాదన గోవులు మొదలగు పశుసంపాదన యివిగలుగును.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయేజీవే నీచేవాస్తంగతేయది
పాపకర్మసమాయుక్తో గురుపుత్రాదినాశనం
స్థానభ్రష్టంమనోదుఃఖం అకస్మాత్కలహంతథా
గృహక్షేత్రాదినాశశ్చ వాహనాంబరనాశనం
దాయాదికలహంచైవ గర్భస్రావో భవిష్యతి॥

ఈగురుడు షష్ఠాష్టమవ్యయములయందుగాని నీచయందుగాని పాపగ్రహములతోగూడియుండినయెడల గురువు పుత్రులు మొదలగువారియొక్క నాశము స్థానభ్రష్టత్వము మనోవిచారము అకస్మాత్కలహము గృహక్షేత్రాదినాశనము వాహనములు వస్త్రములు వీట్లయొక్క నాశనము దాయాదులతో కలహము గర్భస్రావరోగము గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే సన్నిపాతజ్వరోద్భవం
వివాదయుద్ధకలహం సమరేశత్రువృద్ధిదం
శశినాసంయుతేదృష్టే కీర్తిలాభం మహోత్సవం॥
అర్థలాభం వస్త్రలాభం స్త్రీపుత్రాణాం శుభప్రదం॥

ఈగురుడు రవితోగలిసినను చూడబడినను సన్నిపాత

జ్వరము వివాదము యుద్ధము కలహము శత్రువృద్ధిగలుగును. చంద్రునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడల కీర్తిలాభము మనోజయము ధనలాభము వస్త్రలాభము స్త్రీపుత్రులయొక్క శుభము యివిగలుగును.

శ్లో॥ భౌమేనసంయుతేదృష్టే సమరే శత్రువృద్ధిదః
దాయాదికలహంచైవ క్షేత్రధాన్య వినాశనం
సౌమ్యేనసంయుతేదృష్టే వేదశాస్త్రాదిసంగ్రహః
విచిత్రగృహలాభశ్చ విష్ణుపూజాదితత్పరః॥

కుజునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడల యుద్ధమందు శత్రువృద్ధి జ్ఞాతికలహము భూనాశనము ధాన్యనాశనము గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడల వేదశాస్త్రములయందుప్రజ్ఞ విచిత్రగృహనిర్మాణము విష్ణుపూజ యివిగలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే స్త్రీసౌఖ్యం బంధువృద్ధిదం
వాహనాంబర సంప్రాప్తిః హేమభూషణ లబ్ధవాక్
శనినాసంయుతేదృష్టే పుత్రనాశం ధనక్షయం
స్థాననాశనం నృపాద్భీతిః భృత్యవర్గ విరోధకృత్॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడల స్త్రీసౌఖ్యము గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడల

పుత్రనాశనము ధననష్టము స్థానభ్రష్టత్వము రాజులవలన భయము సేవకులతో విరోధము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాదుశ్చిత్కేలాభగేపివా
కళత్రసుతసౌఖ్యంచ తీర్థయాత్రాది చింతనం
శివదీక్షాప్రసంగంచ సర్వకార్య సుసిద్ధదం
దూరాల్లేఖనసంప్రాప్తిః సమానప్రభుదర్శనం॥

దశానాథుడైన చంద్రునకు కోణమందుగాని తృతీయ లాభములయందుగాని గురుడున్న యెడల పుత్రసౌఖ్యము కళత్ర సౌఖ్యము తీర్థయాత్రాదులు సేవించుటయందిష్టము శివపూజ చేయుట సర్వకార్యములు సిద్ధించుట దూరదేశవార్తాశ్రవణము సమానమైన ప్రభువుయొక్క దర్శనము యివిగలుగును. గురు వారమునాడు రాజదర్శనము ధనప్రాప్తిగూడ గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠ రంధ్రేవావ్యయేవా పాపసంయుతే
తద్భుక్తౌధననాశశ్చ దేహబాధాభవిష్యతి
పుత్రదారవియోగశ్చ నీచస్త్రీకలహంతథా
ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుభయంవిష్యతి
తద్దోషపరిహారార్థం దుర్గాలక్ష్మీజపంచరేత్॥

దశానాథుడైన చంద్రునకు గురుడు షష్ఠాష్టమవ్యయ ములయందు పాపులతోగూడియున్న యెడల ఆభుక్తియందు ధననాశనము శరీరబాధ కళత్రపుత్ర వియోగము నీచస్త్రీ కల హము గలుగును!

ద్వితీయసప్తమములయందు గురుడున్న యెడల మరణ భయము గలుగును. అట్టిదోషము పోవుటకై దుర్గాజపము లక్ష్మీజపము చేసినయెడల సౌఖ్యముగలుగును.

చంద్రదశలో శనిభుక్తి మా॥ 19.

శ్లో॥ చంద్రస్యాంతర్గతేమందేలగ్నాత్కేంద్ర త్రికోణగే
తృతీయేలాభగేవాపి ఉచ్చక్షేత్రస్థితేపివా
తద్భుక్తౌ ప్రభుసన్మానం బాంధవాది సమాగమం
ధనవాహనసంప్రాప్తిర్యత్నకార్యార్థసిద్ధిదం
దేహారోగ్యం మహత్కీర్తిః తీర్థయాత్రాదిబంధనం
పశ్చిమాందిశమాశ్రిత్య ప్రయాణం రాజదర్శనం
స్వప్రభోస్తుమహాత్సౌఖ్యం శూద్రప్రభువశాత్సుఖం
గోమహిష్యాదివృద్ధిశ్చభృత్యవర్గవివృద్ధిదం॥

చంద్రదశలో శని భుక్తియందు శనిలగ్నములగాయతు కేంద్రకోణములయందుగాని తృతీయ లాభములయందుగాని ఉచ్చస్వక్షేత్రములయందుగాని ఉన్నయెడల ప్రభుసన్మానము బంధుసమాగమము ధనవాహనసంప్రాప్తి కార్యసిద్ధి శరీర సౌఖ్యము విశేషకీర్తి తీర్థయాత్రలుచేయుట పశ్చిమదిశ ప్రయాణము రాజదర్శనము తనయొక్క ప్రభువునలన సౌఖ్యము శూద్రప్రభువువల్ల నుంచిసౌఖ్యము గోవులు మొదలగు పశు వృద్ధి సేవకులయొక్క అభివృద్ధి యివిగలుగును.

శ్లో॥ లగ్నషష్టాష్టరాశిస్థే వ్యయేవా నీచరాశిగే
భుక్త్వాదౌశరమాసేషు దేహపీడాభవిష్యతి

సమానజననాశశ్చ చతుష్పాజ్జీవనాశనం
కలహంరాజనిష్ఠూరం బంధునాశం తథైవచ
భృత్యవర్గవిరోధశ్చ నీచానాంకలహంతథా
స్వస్థాన చలనచ్చైవ చింతితార్థస్యనాశనం॥

దశానాథుడైన చంద్రిదశలో శనిభుక్తియందు శనిల గ్నమందుగాని షష్ఠాష్టమ వ్యయములయందుగాని నీచరాశి యందుగాని యున్నయెడల భుక్తిలగాయతు అయిదుమాసముల వరకు శరీరపీడ సమానమనుజునియొక్క నాశనము జంతునాశనము కలహము రాజవిరోధము బంధునాశనము సేవకావిరోధము నీచజనులతో కలహము స్థానచలనము ప్రియత్నించిన ధన ము యొక్క నష్టము యిదిగలుగును.

శ్లో॥ సూర్యేణసంయుతేదృష్టే పితృబంధువినాశనం
భూపకోప్రిధంద్రివ్యనాశం ఉద్యోగంచ వినాశనం
చంద్రేణసంయుతేదృష్టే నృపాశ్రియ మహత్సుఖం
దుకూలవస్త్రసంప్రాప్తిః అపూర్వప్రియదర్శనం॥

ఈశనికిరవియొక్క సంబంధవీక్షణములు గలిగియున్న యెడల పితృనాశనము బంధునాశనము రాజవిరోధమువలన ద్రివ్యనష్టము ఉద్యోగవినాశము యివిగలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్న యెడల రాజులవలన సౌఖ్యము పట్టువస్త్రసంప్రాప్తి పూర్వస్నే హితునియొక్క దర్శనము యివిగలుగును.

శ్లో॥ భౌమేనఘాతపాతాది ఉన్నతాత్పతనంతథా
దాయాదివ్యవహారేణ కలహంన్నృపపీడనం
సౌమ్యేన వేదశాస్త్రాణి లిపివిద్యాదిసంగ్రహం
మాతులాదివివృద్ధిశ్చ వస్త్రభూషణసంగ్రహం॥

కుజునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడల ఉన్నతప్రదేశమునుంచి పడుటవలన దెబ్బతగులుట సోదరుల వ్యవహారములయందు కలహము రాజులవలన బాధ యివిగలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన వేదశాస్త్రములు చిత్రములు వ్రాయుటయందు నేర్పరితనము మేనమామలయొక్క సౌఖ్యము వస్త్రాలంకారప్రాప్తి యివిగలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే పుత్రనాశంతథైవచ
బుద్ధిభ్రంశం దేహబాధా స్వస్థానచలనంతథా
శుక్రేణసంయుతేదృష్టే స్త్రీసౌఖ్యం బంధుదర్శనం
వాహనంభూషణప్రాప్తి స్స్వాధికారపదస్థితిః

గురునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడల పుత్రనాశనము బుద్ధిమాంద్యము శరీరపీడ స్థానచలనము యివిగలుగును.

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన కళత్రసౌఖ్యము బంధుదర్శనము వాహనము అలంకారప్రాప్తి అధికారముగల ఉద్యోగము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా
దద్భుక్తౌధనలాభశ్చ పశుసంగ్రహణంతథా
నీలవస్త్రాదిలాభశ్చ దాసదాసీవివృద్ధిదం
శూద్రప్రభువశాత్సౌఖ్యం నీచసేవాభవిష్యతి॥

దశానాథుడైన చంద్రునిలగాయతు శని కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని యున్న యెడల యీశని భుక్తియందు ధనలాభము పశులాభము నల్లనివస్త్రసంప్రాప్తి దాసదాసీజనవృద్ధి శూద్రప్రభువువల్లనుంచి సౌఖ్యము నీచజనులయొక్క సేవ యివిగలుగును.

శ్లో॥ దాయేశాద్వ్యయగేరంధ్రే షష్ఠేవాపాపసంయుతే
తద్భుక్తౌజ్ఞాతికలహం పశుధాన్యక్షయంభవేత్
సమానజనకష్టంచ నృపక్రోధంభవిష్యతి
ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం మహిషీదానమేవచ
ఛాగదానంప్రకుర్వీత విష్ణుసాహస్రకంజపేత్॥

దశానాథుని లగాయతు శనివ్యయమందుగాని అష్టమమందుగాని షష్ఠమమందుగాని పాపులతోఁ గూడియున్నయెడల ఆభుక్తియందు జ్ఞాతికలహము పశుధాన్యనాశనము సమానమనుజునియొక్క కష్టము రాజవిరోధము గలుగును.

ద్వితీయసప్తమములయందు శనియున్నయెడల మృత్యుభయముగలుగును. అట్టిదోషము పోవుటకై గేదెదానము మేకదానము విష్ణుసహస్రజపమును చేయవలెను.

చంద్రదశలో బుధభుక్తి మా 17

శ్లో॥ చంద్రస్యాంతర్గతే సౌమ్యే లగ్నాత్కేంద్ర త్రికోణగే
స్వక్షేత్రస్వాంశగే సౌమ్యే తుంగేవా బలసంయుతే
క్షీరాన్నం రాజసన్మానం ప్రియవస్త్రాశ్వలాభకృత్
విద్యావివాదసద్గోష్ఠి ర్వాణిజ్యాద్ధనలాభకృత్
సంతానప్రాప్తిసంతోషం శౌర్యేణధననాశనం। జ్ఞానవృద్ధిశ్చ
సౌఖ్యంచ పాండిత్యం శాస్త్రవేదినాం
సాహాయ్యంఛత్రసంయుక్తం నానాలంకారభూషితం।

దశానాథుడైన చంద్రునియొక్క బుధాంతర్దశయందు బుధుడు లగ్నములగాయతు కేంద్రత్రికోణములయందుగాని స్వక్షేత్రమందుగాని స్వనవాంశయందుగాని ఉచ్ఛయందుగాని బలముగలవాడై యున్నయెడల క్షీరాన్నభోజనము రాజదర్శనము యిష్టమైన అశ్వములు వస్త్రములు మొదలగువానిలాభములు విద్యావాదము సద్గోష్ఠి వర్తకమువలన ధనలాభము సంతానప్రాప్తి సంతోషము కార్యములయందు ధనవ్యయము జ్ఞానవృద్ధి సౌఖ్యము పాండిత్యము శాస్త్రపరిశీలన ఛత్రచామరప్రాప్తి నానాలంకారప్రాప్తి యివిగలుగును॥

శ్లో॥ లగ్నషష్ఠాష్టరాశిస్థేవ్యయేవానీచరాశిగే
తద్భుక్తౌబంధునాశశ్చ మిత్రవర్గవిరోధకృత్
గృహభూమివినాశశ్చ జ్ఞాతీనాంకలహంతథా
స్వవారేరాజకోపశ్చదార పుత్రాధిపీడనం
దేశాంతరాదిగమనం పశునాశంభవిష్యతి.

దశానాథుని లగాయతు బుధుఁడు షష్టాష్ట మవ్యయములయందుగాని నీచయందుగాని యున్న యెడల అట్టిభుక్తియందు బంధునాశము స్నేహితులతో విరోధము గృహనాశనము భూనాశనము జ్ఞాతులతో విరోధము బుధవారమునాఁడు రాజవిరోధము దారాపుత్రపీడ పరదేశగమనము పశునష్టము గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే రాజప్రీతిర్ధనాప్తిశ్చ
ఉద్యోగంధనలాభశ్చ పితృవర్గవివృద్ధయః
శశినాసంయుతేదృష్టే సువస్త్రాభరణంతథా
ఇష్టసిద్ధిస్సుఖావాప్తిః గృహేకళ్యాణవృద్ధయః.

ఈబుధునకురవియొక్క సంబంధవీక్షణములుగలిగియున్న యెడల రాజసన్మానము ఉద్యోగము ధనలాభము పితృవర్గముయొక్కవృద్ధి యివిగలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములు గలిగినయెడల మంచివస్త్రాలంకారప్రాప్తి ఇష్టసిద్ధి సౌఖ్యము గృహమందు కళ్యాణము యివిగలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే కలహంస్థాననాశనం
జ్ఞాతిశత్రువివృద్ధిశ్చ సంతాపంగుల్మపీడనం
గురుణాసంయుతేదృష్టే గురుదేవద్విజార్చనం
ధనలాభంబంధువృద్ధిః నృపప్రీతిసమాగమం.

కుజునియొక్క సంబంధవీక్షణములుగలిగియున్న యెడల

కలహము స్థానానాశనము జ్ఞాతివృద్ధి శత్రువృద్ధి సంతాపము గుల్మవ్యాధి యివిగలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడల గురుపూజ, దేవార్చన ధనలాభము బంధువృద్ధి రాజసన్మానము గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేస్పృష్టే వాహనాంబరలబ్ధకృత్
గీతగానవినోదశ్చ విచిత్రగృహలాభకృత్
శనినాసంయుతేస్పృష్టే మాతులస్యవినాశనం
బంధోర్విరోధం స్వస్థాన చలనం భృత్య నాశనం

శుక్రునియొక్క సంబంధవీక్షణములు గలిగినయెడల వస్త్రములు వాహనములు గీతగానవినోదము విచిత్రగృహలాభము యివిగలుగును.

శనియొక్కసంబంధవీక్షణములు గలిగియున్నచో మేనమామలయొక్క నాశనము బంధువులతో విరోధము స్థానచలనము సేవకులయొక్కనాశనము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాదుశ్చిక్యే లాభగేపివా
శుభగ్రహయుతేవాపిధనలాభముదీరయేత్
తీర్థయాత్రాప్రసంగంచ కళ్యాణాదిమహోత్సవం
విష్ణుకథాప్రసంగశ్చ శాస్త్రాభ్యాసప్రసంగకృత్.

దశానాథుని లగాయతు బుధుడు కేంద్రకోణముల యందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహసంబంధ వీక్షణములు గలిగియున్నయెడల ధనలాభము గలుగును.

శ్లో॥ దాయేశాద్వ్యయగేరంధ్రేషష్ఠేవా పాపసంయుతే
మనస్తాపంబంధునాశం అతికష్టఫలంతథా
స్త్రీపుత్రజ్ఞాతికలహం మాతృవర్గవినాశనం
ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి.
తద్దోషపరిహారార్థం లక్ష్మీనారాయణంజపేత్.

దశానాథునిలగాయతు బుధుడు షష్ఠాష్టవ్యయముల యందు పాపసంబంధముగలిగినయెడల మనస్తాపము బంధునాశనము అతికష్టముగలుగును. స్త్రీలతోను పుత్రులతోను జ్ఞాతులతోనుకలహము మేనమామలుమొదలగువారియొక్క నష్టముగలుగును.

ద్వితీయసప్తమములయందు బుధుడున్నయెడల మరణభయముగలుగును. అట్టిదోషముపోవుటకై లక్ష్మీనారాయణ జపముచేయించవలెను.

చంద్రదశలోకేతుభుక్తిమా 7

శ్లో॥ చంద్రస్యాంతర్గతేకేతౌలగ్నాత్కేంద్రత్రికోణగే
తృతీయేలాభగేవాపి ఉచ్చరాశిస్థితేపివా
శుభగ్రహయుతే దృష్టేవాహానంభవతిధృవం
గృహక్షేత్రాభివృద్ధిశ్చవ్యవసాయాత్ఫలాధికం
మహారాజప్రసాదేనగ్రామభూమ్యాదిలాభకృత్
యత్నకార్యాదిసిద్ధిస్స్యాచ్చోరాణాంచసమాగమం
దారాత్మజాదిసౌఖ్యంచక్షేత్రధాన్యాదిసంభవం
వస్త్రాభరణసంప్రాప్తిఃసత్కర్మాదిసుబంతసం॥

చంద్రమహాదశలో కేతుభుక్తియందు కేతువులగ్నము లగాయతు కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని ఉచ్చరాశియందుగాని యుండిశుభగ్రహసంబంధవీక్షణములు గలిగియున్నయెడల వాహనయోగము గృహలాభము క్షేత్రవృద్ధి వ్యవసాయలాభము మహారాజానుగ్రహము వలన భూలాభము గృహలాభము యత్నకార్యసఫలముద్యోగులతో సహవాసము భార్యయొక్కయు సంతానముయొక్కయు సౌఖ్యము భూలాభము ధాన్యలాభము వస్త్రాభరణసంప్రాప్తి మంచికర్మలు చేయుట యందిష్టము యివిగలుగును.

శ్లో॥లగ్నాద్వ్యయషడష్టస్థే నీచక్షేత్ర స్థితేపివా
పాపయుక్తే ధవాదృష్టే ధననాశ కరోభవేత్
హితశతృత్వకార్యాణి అకస్మాత్కలహంధృవం .
కారాగృహప్రవేశశ్చ చోరాగ్ని నృపపీడనం
దారాపుత్ర విరోధశ్చనైషమ్యం శతృవర్ధనం
యత్నకార్యవినాశశ్చ విధవాకలహంతథా
స్వప్రభోస్తు మహాత్కష్టం సమానజననాశనం॥

లగ్నము లగాయతు షష్ఠాష్టమవ్యయములయందుగాని నీచయందుగాని పాపులయొక్క సంబంధవీక్షణములుగల కేతుభుక్తియందు ధననాశనము స్నేహితులతో విరోధము అకస్మాత్తుకలహము కారాగృహప్రవేశము చోరులవల్లనుంచి అగ్నివల్లనుంచి రాజులవల్లనుంచి భయము భార్యాపుత్రులతో కలహము శతృవృద్ధి కార్యనాశనము విధవావిరోధము తన

ప్రభువువల్లనుంచి మిక్కిలికష్టము సమానజనునియొక్క నాశ
నము యివిగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే విషశస్త్రాదిజంఫలం
స్వాధికార వినాశశ్చ నృపక్రోధం భవిష్యతి
శనినాసంయుతేదృష్టే మాతృవంశ వినాశనం
కుక్షి బాధామనః క్షేశం వ్యవసాయేషు నిష్ఫలం॥

రవియొక్క సంబంధవీక్షణములు గలిగినయెడల విషము
వల్లగాని శస్త్రమువల్లనుంచిగాని భయము ఉద్యోగభ్రష్టత్వ
ము రాజవిరోధము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్న
యెడల మాతృవంశనష్టము కుక్షిబాధ, మనోవ్యాకులత, వ్యవ
సాయనష్టము గలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే విషశస్త్రాగ్నిజంభయం
ఉష్ణజ్వరేణసంతాపః గృహక్షేత్రాదినాశనం
బుధేనసంయుతేదృష్టే బాంధవానాం సమాగమం
క్రియవిక్రియకౌశల్యం భిషగ్జనసమాగమం॥

కుజునియొక్క సంబంధవీక్షణములున్నయెడల విషము
వల్లనుంచి శస్త్రమువల్లనుంచి అగ్నివల్లనుంచి భయము ఉష్ణ
జ్వరమువల్లనుంచి సంతాపము గృహనాశనము భూనాశనము
గలుగును. బుధునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్న
యెడల బంధుసమాగమము అమ్ముకొనుటయందు నేర్పరి
తనము వైద్యులతో సహవాసము యివిగలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే వేదాభ్యాసాది తత్పరః
సమానజనమిత్రిత్వం మందిరేచోత్సవం తథా
శుక్రేణసంయుతేదృష్టే దారనాశం భవిష్యతి
వాహనం క్షేత్రినాశశ్చ ధాన్యనాశం తథైవచ॥

గురునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్న యెడల వేదాభ్యాసము గలవాఁడును సమానమైన మనుజునితో స్నేహము గృహమందు కళ్యాణమహోత్సవము గలుగును. శుక్రుని యొక్క సంబంధవీక్షణములు గలిగినయెడల కళత్రినష్టము వాహననష్టము భూనాశనము ధాన్యనాశనము గలుగును.

శ్లో॥ శనిదృష్టియుతేవాపి అతిసారజ్వరాన్వయం
స్వభృత్యకలహంచైవ నీచస్త్రీ సంగమంతథా॥

శనియొక్క సంబంధవీక్షణములవలన అతిసారరోగము జ్వరము సేవకులతో విరోధము నీచస్త్రీసంగమము గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రికోణేవాదుశ్చిక్యే లాభగేపివా
శుభగ్రిహయుతే వాపితత్పాకేచ మహోత్సవం
ప్రమాణేకార్యసిద్ధిస్స్యాన్మహారాజాశ్రియస్తథా
సర్వకార్యసుసిద్ధిస్స్యాచ్ఛివపూజాఫలంభవేత్॥
రాజసన్మానకీర్తిశ్చ వస్త్రాభరణానిచ॥

దశానాథుఁడైన చంద్రినిలగాయతు కేతువు కేంద్రికోణములయందుగానితృతీయలాభములయందుగానిశుభగ్రిహములతో గూడియున్నయెడల ఆభుక్తియందు మహోత్సవము

ప్రయాణమందు కార్యసాఫల్యము మహారాజులయొక్క సహవాసము సర్వకార్యసాఫల్యము శివపూజాఫలము యివి గలుగును.

శ్లో॥ దాయేశాద్రిప్పరంధ్రస్థే వ్యయేవాబలవర్జితే
భూతోపద్రవరోగశ్చ క్షుద్రభీతి స్తథైవచ
అకస్మాచ్ఛతృభీతిశ్చ నానారోగాదిజంభయం
మూత్రకృచ్ఛాదిరోగశ్చ వ్యవహారాద్భయం భవేత్
ద్వితీయద్యూనరాశిస్థే తద్భుక్తౌమరణం ధృవం
ఛాగదానం ప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకం॥

దశానాథునిలగాయతు షష్ఠాష్టమవ్యయములయందు కేతువు బలహీనుడై యున్నయెడల భూతభయము క్షుద్రరోగమువలన భయము అకస్మాత్తుగా శతృకలహము అనేకరోగములు గలుగుటవలన భయము మూత్రకృచ్ఛబాధ వర్తకనష్టము యివిగలుగును.

ద్వితీయసప్తమములయందు కేతువున్నయెడల యీభుక్తియందు మరణభయము గలుగును. అట్టిదోషము పోవుటకై మేకనుదానము చేయవలెను. అందువలన సర్వసంపదలు సౌఖ్యమును గలుగును.

చంద్రదశలో శుక్రభుక్తి మా 20

శ్లో॥ చంద్రస్యాంతర్గతే శుక్రే లగ్నాత్కేంద్ర త్రికోణగే
తృతీయేలాభగేవాపి శుభగ్రహయుతేపివా

కళ్యాణాది శుభప్రాప్తిః యానవాహన భోగకృత్
రత్నాభరణసంప్రాప్తిః బహుపశ్వాయుతంతథా
పుత్రోత్సవాది సంతోషం మహారాజాశ్రయంతథా
యిష్టకార్యార్థలాభశ్చస్వవారే రాజసఖ్యసం
సుగంధపుష్పశయ్యాది రమ్యస్త్రీ సౌఖ్యసంపదం
దశాధిపేనసంయుక్తే రాజ్యలాభం మహత్సుఖం
కళ్యాణంరాజపూజ్యంచ పుత్రపౌత్రప్రవర్ధనం

చంద్రదశలో శుక్రభుక్తియందు శుక్రుడులగ్నముల గాయతు కేంద్రకోణముల యందుగాని తృతీయలాభముల యందుగాని శుభగ్రహములతో గలిసియున్న యెడల కళ్యాణము మొదలగు శుభములు పల్లకీవాహనము మొదలగు భోగములు రత్నాభరణ లాభము విశేషద్రవ్యసంపాదన పుత్రోత్సవము సంతోషము మహారాజులతో స్నేహము ఇష్టకార్య సఫలము శుక్రవారమునందు రాజసఖ్యము గలుగుటసుగంధములు పుష్పశయ్య అందమైనస్త్రీసంపద మొదలగుసౌఖ్యములుగలుగుట యివిగలుగును.

దశానాథునియొక్క సంబంధమువలన రాజ్యలాభము మహాసుఖము కళ్యాణము రాజపూజ్యత పుత్రపౌత్రవర్ధనము గలుగును.

శ్లో॥ లగ్నాత్షష్ఠవ్యయేరంధ్రేనీచరాశిసమన్వితే
తద్భుక్తౌదేహతాపశ్చదారాపుత్రాదినాశనం

బాంధవానాంవిరోధశ్చస్వస్థానచలనంతథా
బంధుమిత్రవిరోధత్వంనీచస్త్రీకలహంతథా
గోనాశంభృత్యకలహంశత్రుబాధాభవిష్యతి॥

లగ్నములగాయతు షష్ఠాష్టమవ్యయములయందు శుక్రుడున్నను నీచయందున్నను అట్టిభుక్తియందు దేహతాపము కళత్రపుత్రనాశనము బంధువిరోధము స్థానచలనము మిత్రవిరోధము నీచస్త్రీతో కలహము గోనాశనము సేవకులతో విరోధము శత్రుబాధ యివిగలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టేభూపాలకలహంతథా
ఉద్యోగభంగమాలస్యంకలహంసర్వనాశకృత్
చంద్రేణసంయుతేదృష్టే శ్వేతాశ్వాదివిశేషకృత్
హేమాభరణవస్త్రాప్తిఃఇష్టసిద్ధిర్భవిష్యతి॥

శుక్రునకు రవియొక్క సంబంధవీక్షణములున్నయెడల రాజులతో విరోధము ఉద్యోగభంగము మందబుద్ధి కలహము సర్వవస్తునాశనముగలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములున్నయెడల తెల్లనిగుఱ్ఱములయొక్క విశేషసంపాదన సువర్ణవస్తువులు వస్త్రములుసంపాదించుట ఇష్టకార్యసిద్ధి యివిగలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టేకలహంధననాశనం
దాయాదికలహంచైవవ్యవహారాదిజంభయం
సౌమ్యేనసంయుతే దృష్టేఇష్టబంధుసమాగమం
స్వదారపుత్రసౌఖ్యంచవాహనప్రాప్తిరుచ్యతే॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన కలహముధన నాశనము జ్ఞాతులతో కలహస్వనహరము చిక్కులు యివి గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన ముఖ్యమైన బంధునర్శనము కళత్రపుత్రసౌఖ్యము వాహనప్రాప్తియివి గలుగును.

శ్లో॥ గురుణా సంయుతేదృష్టే దేహారోగ్యం మహత్సుఖం
పుత్రోత్పత్తిసుఖంస్థానయత్న కార్యసుసిద్ధిదం
శనినాసంయుతేదృష్టే స్వభృత్యకలహంతథా
గోమహిష్యాదినాశశ్చధననాశం భవిష్యతి॥

గురునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడల దేహారోగ్యము మహత్సుఖము యత్నకార్యసిద్ధి గలుగును. శనియొక్క సంబంధవీక్షణములవలన సేవకులతో కలహము ఆవులు గేదెలు మొదలగు పశునాశనము ధననష్టముయివి గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణవాదుశ్చిక్యేలాభగేపివా
శుభగ్రహాయుతేవాపితద్భుక్తౌద్రవ్యలాభకృత్
వాహనాందోళికప్రాప్తిఃమహారాజప్రసాదతః
స్వగృహేశోభనప్రాప్తిః స్త్రీసౌఖ్యంపుత్రసంపదః॥

దశానాథుని లగ్నాయత్తు శుక్రుడు కేంద్రకోణములయం దుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహములతోగూ

డియున్న యెడల వాహనము పల్లకీ మొదలగువాని యొక్కలాభము మహారాజానుగ్రహము గృహమందు శుభకార్యవృద్ధి స్త్రీసౌఖ్యము పుత్రసౌఖ్యము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవాన్యయేవాపాపసంయుతే
కళత్రదేహబాధాచపుత్రనాశంతథైవచ
స్త్రీవివాదంచకలహంగమనేకార్యనాశనం
కృషిధాన్యవినాశశ్చఅకస్మాత్కలహంతథా॥

దశానాథునకు షష్ఠాష్టమవ్యయములయందు శుక్రుడు పాపులతోగూడియున్న యెడల కళత్రదేహపీడ పుత్రనష్టము స్త్రీవివాదము కలహము ప్రయాణమందు కార్యభంగము వ్యవసాయనష్టము అకస్మాత్కలహము యివిగలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థేఅపమృత్యుభయంభవేత్
తద్దోషపరిహారార్థంరుద్రజప్యంతుకారయేత్
శ్వేతాంగాంమహిషీందద్యాచ్ఛాంతి మాప్నోత్యసంశయః॥

ద్వితీయమందుగాని సప్తమమందుగాని శుక్రుడున్నయెడల ఆట్టిభుక్తియందు మరణభయము గలుగును.

దానికిశాంతి తెల్లనిగోవును గేదెను దానముచేసినయెడలసౌఖ్యముగలుగును.

చంద్రదశలోరవిభుక్తిమా 6

శ్లో॥ చంద్రస్యాంతర్గతేసూర్యేస్వోచ్చస్వక్షేత్రసంయుతే
కేంద్రత్రికోణలాభేవాతృతీయేస్వాంశగేతథా

నష్టరాజ్యధనప్రాప్తిః గృహేకళ్యాణసంభ్రమః।
మిత్రరాజప్రసాదేనగ్రామభూమ్యర్థలాభకృత్
గర్భాదానఫలప్రాప్తిః గృహేలక్ష్మీ కటాక్షకృత్
భుక్త్యంతే దేహమాలిన్యం జ్వరపీడాభవిష్యతి
స్త్రీసౌఖ్యంపుత్రవృద్ధిశ్చ పితృబంధు వివృద్ధికం॥

చంద్రదశలో రవిభుక్తియందు రవిస్వోచ్ఛయందుగాని స్వక్షేత్రమందుగాని కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని స్వనవాంశయందుగాని వున్నయెడల పోయినరాజ్యము ధనము తిరిగిలభించుట గృహమందు కళ్యాణ మహోత్సవము మిత్రులయొక్కయు రాజులయొక్కయు అనుగ్రహముచేతను గ్రామములు భూములు ధనము వీట్లయొక్క ప్రాప్తి గర్భాదానమహోత్సవము గృహమందు లక్ష్మీవైభవము గలుగును. యీరవిభుక్త్యంతమందు శరీరమాలిన్యము జ్వరపీడ యివిగలుగును. మరియు స్త్రీసౌఖ్యము పుత్రవృద్ధి పితృసుఖము బంధువృద్ధి గలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టమేవాపి వ్యయేవా నీచరాశిగే
రాజక్రోధం స్థాననాశం పితృబంధు వినాశనం
ఆత్మపుత్ర విరోధశ్చ అధికారాదినాశనం
సమరేశత్రుబాధాచసంతాపజ్వరమేవచ
దుష్టరోగం మూత్రకృచ్ఛం గుల్మరోగస్తథాపివా
వాతపిత్తాధికంచైవ గోమహిష్యాదినాశనం
అంతేక్లేశకరంచైవ మాతృపిత్రాదినాశనం॥

లగ్నములగాయతు షష్ఠాష్టమవ్యయములయందుగాని నీచరాశియందుగాని రవియున్నయెడల రాజవిరోధము స్థానభ్రష్టత్వము పితృనష్టము బంధునష్టము కుమారునితో విరోధము ఉద్యోగభంగము యుద్ధమందు శత్రువులవల్లనుంచిభయము తాపజ్వరబాధ దుష్టరోగము యుద్ధమందు మూత్రకృచ్ఛ్ర గుల్మరోగము వాతపిత్తాధిక్యము పశునాశనము రవిభుక్త్యంతమందు దుఃఖము మాతృవిచారము గలుగును.

శ్లో॥ చంద్రేణసంయు తేదృష్టే మాతృవంశ వినాశనం
శిరోక్షికుక్షిబాధాచ బంధూనాం కలహంతథా
కుజేనసంయుతేదృష్టే జ్ఞాతీనాం కలహంతథా
క్షేత్రధాన్యవినాశశ్చ సమానజననాశనం॥

చంద్రునియొక్క సంబంధవీక్షణములున్నయెడల మాతృవంశముయొక్క నాశనము శిరస్సు నేత్రములు కుక్షి వీటియొక్కబాధ బంధువిరోధము గలుగును.

కుజునియొక్క సంబంధవీక్షణములున్నయెడల జ్ఞాతులతోకలహము భూనాశనము ధాన్యనాశనము సమానమైనమనుజునియొక్క నష్టము యివిగలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే బాంధవాది వివృద్ధిదం
విచిత్రగృహలాభశ్చ వేదాంతశ్రవణంతథా
గురుణాసుతసౌభాగ్యం సంపదంద్రవ్యలాభకృత్
దేహారోగ్యంచకీర్తిశ్చ విజయంచభవిష్యతి॥

బుధునియొక్క సంబంధవీక్షణములున్న యెడల బంధువృద్ధి విచిత్రగృహలాభము వేదాంతశ్రవణము గలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రసౌఖ్యము సంపద ద్రవ్యలాభము శరీరారోగ్యము కీర్తి విజయము గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే స్త్రీసౌఖ్యం పుత్రసంపదః
అశ్వాదివాహనప్రాప్తిః ద్రవ్యలాభంచవిందతి
శనినాసంయుతేదృష్టే మహత్కష్టం రిపోర్భయం
నృపక్రోధంస్థాననాశం జనానాంకలహంతథా॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములున్న యెడల స్త్రీసౌఖ్యము పుత్రసంపద అశ్వలాభము వాహనప్రాప్తి ద్రవ్యలాభము యివిగలుగును.

శనియొక్క సంబంధవీక్షణములున్న యెడల మహాకష్టము శతృభయము రాజవిరోధము స్థాననాశనము సముస్తజనులతోకలహము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాతృతీయే లాభగేపివా
దారసౌఖ్యం మహోత్సాహం వాహనాంబరభూషణం
పుత్రోత్సవాది సంతోషం గృహేగోధనసంకులం
వేదశాస్త్రార్థపాండిత్యం రాజసన్మానసంభ్రమః
వాహనాధిపసంయుక్తే గృహక్షేత్రాదివర్ధనం
నూతనగృహనిర్మాణం మాతృసౌఖ్యంమహత్సుఖం॥

దశానాథునిలగాయతు రవి కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని వున్నయెడల కళత్రసౌఖ్యము మహోత్సాహము వస్త్రవాహనాలంకారప్రాప్తి పుత్రోత్సవము గృహమందు పశుధనధాన్యవృద్ధి వేదశాస్త్రముల యందు పాండిత్యము రాజసన్మానముగలుగును.

చతుర్థస్థానాధిపతియొక్క సంబంధవీక్షణములవలన గృహము భూములు గలుగును నూతనగృహనిర్మాణము గలుగును. మాతృసౌఖ్యము మహాసౌఖ్యము గలుగును.

శ్లో॥ దాయేశాద్రంధ్రసంస్థే లాభేవా పాపసంయుతే
నృపచోరాగ్ని భీతిశ్చ జ్వరరోగాది సంభవః॥
గుల్మక్షయాదిరోగాశ్చ అతిసారాదిపీడనం
విదేశగమనం దుఃఖార్తింలభతేచ పరిభ్రమం॥
ద్వితీయంద్యూననాథేవజ్వరపీడాభవిష్యతి
తద్దోషపరిహారార్థం దుర్గాదానంచకారయేత్
దుర్గాదేవీజపంకుర్యాత్ గోదానంచ సమాచరేత్॥

దశానాథుని లగాయతు షష్ఠాష్టమలాభములయందు రవి పాపులతోగూడియుండినయెడల రాజులవల్లనుంచి అగ్నివల్లనుంచి దొంగలవల్లనుంచి భయము జ్వరరోగము గుల్మరోగము క్షయబాధ అతిసారము దూరదేశమునుంచి దుఃఖవార్త అందువలన పరిభ్రమము గలుగును.

ద్వితీయమందుగాని సప్తమమందుగాని రవియున్నయె

డల జ్వరబాధగలుగును. అట్టిదోషము హరించుటకై దుర్గా ప్రతిమదానము దుర్గాదేవిజపము గోదానమును చేసినయెడల సౌఖ్యముగలుగును.

కుజమహాదశలో కుజాంతర్దశ మా 4 రో 27

శ్లో॥ కుజస్యాంతర్గతే భౌమే స్వోచ్చేలాభత్రికోణగే
భూలాభంధనలాభంచ దారాపుత్రాభివర్ధనం
భ్రాతృసౌఖ్యంమనోత్సాహం కృషిమూలాద్ధనాగమం॥

కుజుడు లాభమందుగాని ఉచ్చయందుగాని కోణముల యందుగాని వున్నయెడల భూలాభము ధనలాభము దారాపుత్రాదిసౌఖ్యము సోదరసౌఖ్యము మనోత్సాహము వ్యవసాయ లాభము యివిగలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టరాశిస్థేవ్యయేవా పాపరాశిగే
నీచరాశిగతోవాపి మహావ్యాధి భయంతథా
జ్ఞాతిశతృవివృద్ధిశ్చక్షేత్రిధాన్యవినాశనం
చోరాగ్నినృపబాధాచ సమానజననాశనం
ఇష్టబంధువియోగశ్చ దారాపుత్రాది నాశనం॥

కుజుడు లగ్నమందుగాని షష్ఠాష్టమవ్యయములయందు గాని పాపరాశియందుగాని నీచయందుగాని వుండినయెడల రోగభయము జ్ఞాతివిరోధము భూనాశనము దొంగలవల్లను అగ్నివల్లను రాజులవలనను భయము సమానజనునియొక్క నష్టము ముఖ్యమైన బంధువునియొక్కనష్టము కళత్రనష్టము యివిగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే సంతాపజ్వరమేవచ
నృపక్రోధం మనస్తాపం స్వస్థాన చలనంతథా
శశినాసంయుతేదృష్టే మహోత్సాహంమహత్సుఖం
యత్నకార్యార్థ సిద్ధిశ్చ దారాపుత్రసమాగమం॥

కుజునకు రవియొక్క సంబంధవీక్షణములు గలిగియున్న యెడల తాపజ్వరము రాజవిరోధము మనోవ్యాకులత స్థానచలనము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్న యెడల విశేషఉత్సాహము సౌఖ్యము యత్నకార్యసిద్ధి దారాపుత్రులతో సుఖముగాకలిసియుండుట యివిగలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే వేదశాస్త్రాదిపాఠకృత్
ఆలేఖ్యగృహలాభశ్చ గణికాదిసమాగమం
గురుణాసంయుతేదృష్టే దేహారోగ్యంధనాప్తికృత్
శివదీక్షాప్రసంగశ్చయజ్ఞకర్మాదిసిద్ధిదం॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన వేదశాస్త్రాభ్యాసముచిత్రములు వ్రాయబడిన గృహలాభము వేశ్యాసంగమము యివిగలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన శరీరసౌఖ్యము ధనలాభము శివజపము యజ్ఞయాగాదిక్రతువులు చేయుటయు యివిగలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే వాహనక్షేత్రవృద్ధిదం
సమానజనసన్మానం మణివస్త్రాదిసంగ్రహం

శసినాసంయుతేదృష్టే వాతరోగాదిపీడనం
అకస్మాత్కలహంచైవ సమానజననాశనం॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడ ల వాహనలాభము క్షేత్రవృద్ధి సమానజనునియొక్క సౌఖ్యము మణులు వస్త్రములు మొదలగువానియొక్క సంపాదన మొదలగునవి గలుగును.

శ్లో॥ ద్వితీయద్యూననాథేవా దేహజాడ్యమనోరుజం
తద్దోషపరిహారార్థం సుబ్రహ్మణ్యజపంచరేత్॥

ద్వితీయమందుగాని సప్తమమందుగాని కుజుడున్నయెడల శరీరపీడ మనోవ్యాధిగలుగును. దాని నివారణార్థమై సుబ్రహ్మణ్యజపముచేసినయెడల సౌఖ్యముకలుగును.

కుజదశలో రాహుభుక్తి మా॥ 12 రో॥ 18

శ్లో॥ భౌమ్యస్యాంతర్గతే రాహౌలగ్నాత్కేంద్రత్రికోణగే
లాభేవాచలసంయుక్తే తృతీయేశుభసంయుతే
విధవాసంగమంచైవ దుర్గాసాధనతత్పరః
తత్కర్మసిద్ధిమాగాదీ పుణ్యతీర్థనిషేవణం
స్వప్రభోస్తుమహాసౌఖ్యం దారాసౌఖ్యంతథైవచ
భుక్త్యాదౌమధ్యమంప్రోక్తం పశ్చాత్సౌఖ్యంభవిష్యతి॥

కుజునిలో రాహుభుక్తియందు రాహువులగ్నములగాయతు కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహములతో గలిసియున్నయెడ విధవాసంగమము

దుర్గారాధనమంచికర్మలుచేయుట యాగములుచేయుట పుణ్యతీర్థములు సేవించుట స్వప్రభువువలన సౌఖ్యము కళత్రసౌఖ్యము జ్ఞాతిశత్రువులయొక్క నాశనము దేహారోగ్యముగలుగు. యీ భుక్తియొక్క ఆదియందును మధ్యమమందును సౌఖ్యము గలుగును.

శ్లో॥ కుజస్యాంతర్గతే రాహావ్యయేనీచారిసంయుతే
దశానాథాశ్చభౌమాశ్చ షష్ఠాష్టవ్యయసంస్థితే
గోమహిష్యాదినాశశ్చ స్త్రీనాశోగర్భపాతనం
అజ్ఞానమపవాదశ్చ క్షుద్రజంత్వరిచోరభీః
పతనంస్ఖలనంచాపి ప్రహారఃక్షుద్భయంతథా
భూతావేశోమేహరోగోని గళంబంధనంతథా

రాహువు వ్యయస్థానమందుగాని నీచయందుగాని శత్రుక్షేత్రమందుగాని దశానాథుడైన కుజునకు షష్ఠాష్టవ్యయములయందుగాని ఉన్నయెడల విషశస్త్రములవల్లను విదేశగమనమువల్లను మరణము గోమహిష్యాదినాశనము గర్భపాతమువలన స్త్రీనాశనము అజ్ఞానమువలన అపవాదము నీచజంతువులవల్లనుంచి శత్రువులవల్లనుంచి చోరులవల్లనుంచి భయము ఆకలిబాధయున్ను భూతావేశము మేహరోగమువలన బాధయున్ను నిగళబంధనము మొదలగు చెడుఫలములుగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే సంతాపంకలహంతథా
శిరోబాధాకుక్షిబాధా సన్నిపాతజ్వరంతథా

శశినాసంయుతేదృష్టే మాతృవంశవినాశనం
మనఃఖేదంమానభంగం కృషిక్షేత్రవినాశనం॥

రవియొక్క సంబంధవీక్షణములున్నయెడల సంతాపము కలహము శిరోబాధ కుక్షిబాధ సన్నిపాతజ్వరము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మాతృవంశవినాశనము మనోవ్యాకులత మానభంగము వ్యవసాయనష్టము భూనాశనముగలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే వ్రణరోగాదిపీడనం
కార్యనాశంమనస్తాపం కలహందుఃఖమేవచ
బుధేనసంయుతేదృష్టే పరస్త్రీషుసమాగమం
బంధూనాముపకారంచ సర్వకార్యార్థసిద్ధికృత్॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన వ్రణరోగమువలన బాధ కార్యనాశము మనోవ్యాకులత కలహము దుఃఖముగలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన పరస్త్రీగమనము బంధువులవలన నుపకారము సర్వకార్యసిద్ధి గలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే విద్యాభ్యాసాదిసంగ్రహం
అశ్వలాభంచగోలాభం గర్భిణీసంగమంతథా
శుక్రేణసంయుతేదృష్టే వాహనాంబరలాభకృత్
తద్దశాయాంమహాసౌఖ్యం కళ్యాణాదిమహోత్సవం॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన విద్యాభ్యాస

ము అశ్వలాభము గోలాభము గర్భిణీస్త్రీలతో సంగమము గలుగును. శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన మంచివస్త్రములువాహనములు మొదలగువాని లాభము కళ్యాణము విశేషసౌఖ్యము గలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే సోదరాణాంవినాశనం
బంధునాశందేహకష్టం స్థాననాశంనృపాద్భయం॥

శనియొక్క సంబంధవీక్షణములవలన సోదరనాశనము బంధునాశనము శరీరకష్టము స్థానభ్రష్టత్వము రాజులవలన భయము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రసంస్థస్య త్రికోణేలాభగేపివా
తృతీయస్థానగేవాపి రాహోరపకృతంభయం
ఆదౌకష్టంరిపుర్మాసే నృపాలాద్భూమినాశనం
అతఃపరంమహత్సౌఖ్యం నృపప్రీతిర్ధనాగమం
ప్రాచ్యాంప్రయాణం కురుతేయత్నకార్యార్థసిద్ధిదం॥

దశానాధునిలగాయతు రాహువు కోణములయందుగాని తృతీయలాభములయందుగాని వున్నయెడల మొదటఆరుమాసములవరకు, రాజులవలనభయము భూనాశనము తరువాత మహాసౌఖ్యము రాజులవలనప్రీతి ధనలాభము తూర్పుదిక్కునకు ప్రయాణముచేయుటవలన యత్నకార్యసిద్ధి యివి గలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం మృత్యుంజయజపం చరేత్।

ద్వితీయ సప్తమస్థానములయందు రాహువున్న యెడల మరణభయము గలుగును. అట్టిదోషము పోవుటకై మృత్యుంజయ జపమును తెల్లనిగోవును గేదెదానము చేయుట చే సౌఖ్యము గలుగును.

కుజదశాయాంగురుభుక్తి మా 11 రో 6

శ్లో॥ కుజస్యాంతర్గతేజీవే లగ్నాత్కేంద్రత్రికోణగే
ధనధాన్యసమృద్ధిశ్చ దాసీదాసవివర్ధనం
పుత్రలాభోన్నదానంచ వాహనోద్యోగవైభవం
రాజసన్మానకీర్తించ ధర్మమూలాద్ధనాగమం॥

గురుడుచ్చయందుగాని కేంద్రత్రికోణములయందుగానివున్నయెడల ధనధాన్యవృద్ధియును దాసదాసీజనవృద్ధియును పుత్రలాభము అన్నదానఫలము వాహనసౌఖ్యము ఉద్యోగాభివృద్ధి రాజసన్మానము యశోవృద్ధి ధర్మమూలకముగా ధనసంపాదనయు గలుగును.

శ్లో॥ షష్ఠాష్టమగతేజీవే పాపగ్రహయుతేక్షితే
నీచస్థేబలహీనేవా చోరాగ్నినృపపీడనం
విషప్రమాదరోగశ్చ మూత్రకృచ్ఛ్రాదిరోగకృత్॥
కుభోజనంకుత్సితవస్త్రధాన్యం స్వబంధునాశం
నృపచోరవహ్నేః। స్థానచ్యుతిర్భ్రాతృవియోగదుఃఖం
భౌమస్యదాయేచ గురోశ్చభుక్తౌ॥

గురుడుషష్ఠాష్టమ వ్యయములయందు పాపగ్రహము

లతో కలిసియున్న యెడల గాని నీచయందుండినగాని బలహీనుడై యుండినగాని చోరులవల్లను అగ్నివల్లను రాజులవల్లను భయముపున్న స్థానభ్రష్టత్వము విషయోగమువలన రోగభయము మూత్రకృచ్ఛ్రరోగము భోజనసౌఖ్యము లేకపోవుట వస్త్రహీనము ధాన్యనష్టము ముఖ్యబంధువునియొక్క మరణము సోదరనష్టము అందువలనవిశేషదుఃఖము యివిమొదలగు కష్టములుగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే అర్థలాభంతథైనచ
ఉద్యోగంరాజసన్మానం సుతజన్మోత్సవంతథా
శశినాసంయుతేదృష్టే దేహారోగ్యం మహత్సుఖం
కీర్తిలాభంమనోత్సాహం బాంధవానాంవివృద్ధినం
భౌమేనసంయుతేదృష్టే క్షేత్రధాన్యవినాశనం
రక్తపైత్యాదిరోగశ్చ స్వగృహేకలహంతథా॥

రవియొక్క సంబంధవీక్షణములవలన ధనలాభముఉద్యోగలాభము రాజసన్మానము పుత్రోత్సవము గలుగును. చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన శరీరసౌఖ్యము విశేషసౌఖ్యము కీర్తిలాభము మనోత్సాహము బంధుసౌఖ్యము గలుగును.

కుజునియొక్క సంబంధ వీక్షణములవలన భూనాశనము ధాన్యనాశనము రక్తపిత్తరోగము గృహమందు కలహము గలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే మాతులాదివివృద్ధిదం ।
నృపసన్మానమారోగ్యం అర్థసంగ్రహణంతథా ।
శుక్రేణసంయుతేదృష్టేపాకేభూషణసంగ్రహః ।
మణివస్త్రాదిలాభశ్చ వాహనాది వివృద్ధిదం ।
శనినాసంయుతేదృష్టే మహిష్యాది వినాశనం ।
వివాదంకలహంచైవ గురుపుత్రవినాశనం ॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన మేనమామల సౌఖ్యము రాజసన్మానము ఆరోగ్యము ధనలాభముగలుగును. శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన భూషణలాభము మణివస్త్రాదిలాభము వాహనసౌఖ్యము గలుగును. శనియొక్క సంబంధవీక్షణములవలన పశునష్టము వివాదము కలహము గురుపుత్రనాశనముగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిత్కేలాభగేపివా
పుత్రోత్సవాదిసంతోషం ప్రభుసన్మానమేవచ ।
అపూర్వవస్తు సంప్రాప్తిః కళ్యాణాది మహోత్సవం ।
గర్భిణీసంగమంచైవ మిత్రాదీనాం సమాగమం ॥

దశానాథుని లగాయతు గురుడు కేంద్రకోణముల యందుగాని తృతీయలాభములయందుగాని యున్నయెడల పుత్రోత్పత్తి సంతోషము రాజసన్మానము అపూర్వవస్తు సంప్రాప్తి కళ్యాణాదిమహోత్సవము గర్భిణీస్త్రీతోసంగమము స్నేహితులయొక్క దర్శనము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరాశిస్థే రంధ్రగేవ్యయగేపివా ।
పాపయుక్తేభవాదృష్టే పాపచింతామహద్భయం ।
క్రూరక్రూరంచ శత్రుత్వంమనశ్చాంచల్యమేవచ
భుక్త్యాదౌశోభనం ప్రోక్తంధనధాన్యసమృద్ధయః
మధ్యాంతేక్లేశమాప్నోతి మృతవార్తాగమంభవేత్
చతుష్పాజ్జీవహానిస్స్యాద్దేహబాధాభవిష్యతి Rh. 2/
రాహుయుక్తేపి చోరాగ్నిసర్పభీతివిషాద్భయం॥

దశానాథునిలగాయుషు షష్ఠాష్టమ వ్యయములయందు పాపగ్రహములతోగూడి యున్నయెడల ఆభుక్తియందు పాపచింత విశేషభయము క్రూరులతో శత్రుత్వము మనోవ్యాకులతగలుగును. యీభుక్తియొక్క మొదటియందు శోభనము ధనధాన్యవృద్ధిగలుగును. మధ్యయందును అంత్యమందును దుఃఖము మృతవార్తాశ్రవణము పశుహాని శరీరబాధగలుగును. రాహుసంబంధము గలిగినయెడల సర్పభీతి చోరవిషాగ్నివలన భయమును గలుగును. Acc. 1806.

శ్లో॥ ద్వితీయద్యూననాథేవా అపమృత్యుర్జ్వరాదికం
తద్దోషపరిహారార్థం శివసాహస్రకంజపేత్ 133.5
స్వర్ణదానంప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకం॥ VEN

ద్వితీయసప్తమములయందు గురువున్నయెడల జ్వరబాధవలన అపమృత్యుభయము గలుగును. అట్టిదోషము హరించుటకై శివసహస్రజపము స్వర్ణదానమును చేసినయెడలఆయురారోగ్యములుసంపద సౌఖ్యముగలుగును.

కుజదశలో శనిభుక్తి మా 13 రో 9

శ్లో॥ కుజస్యాంతర్గతేమందే స్వోచ్చేలాభేచకోణగే
ఉద్యోగాద్ధనలాభంచ సేవకావృత్తిజీవనం
అన్యాయార్జితవిత్తంచ పుత్రపౌత్రప్రవర్ధనం
క్షేత్రవాహనసౌఖ్యంచ నీచప్రభుసమాగమం॥

ఈశనిభుక్తియందుశనిఉచ్చయందుగానిలాభమందుగాని కోణమందుగాని ఉన్నయెడల ఉద్యోగమువలన ధనలాభము సేవకావృత్తివలనజీవనము అన్యాయముగా ధనసంపాదనము పుత్రపౌత్రాభివృద్ధియు భూలాభము వాహనసౌఖ్యము నీచ ప్రభువులతో సమాగమముగలుగును.

శ్లో॥ నీచారిక్షేత్రగేమందే షష్ఠాష్టవ్యయరాశిగే
ద్వితీయనవమేసంస్థే పాపయుక్తేమహద్భయం
మ్లేచ్ఛవర్గప్రభుభయం ధనధాన్యాదినాశనం
చోరాగ్నినృపపీడాచ సహోదరవినాశనం
బంధుద్వేషకరంచైవ జీవహానిశ్చజాయతే
అకస్మాచ్ఛతృభీతిశ్చ రాజదండేధనవ్యయం
పితృమాతృవియోగశ్చ ఆత్మబంధువినాశనం॥

ఈశనిభుక్తియందుశని నీచయందుగాని షష్ఠాష్టవ్యయ ములయందుగాని ద్వితీయనవమములయందుగానిపాపయుక్తుడై యున్నయెడల విశేషభయము తురకప్రభువులనుంచి భయ ము ధనధాన్యనాశనము చోరులవల్లనుంచి అగ్నివల్లనుంచిరా జులవల్లనుంచి భయమున్ను సోదరనష్టము బంధువిరోధము

జీవహాని అకస్మాచ్ఛత్రుభీతి రాజదండసనలన ధనవ్యయము పితృమాతృవియోగము పుత్రులయొక్కయు బంధువులయొక్కయునష్టము యివిగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే దేహతాపంత థైవచ
శిరోరోగంచకలహంచింతావ్యాధిభయంతథా॥

రవియొక్క సంబంధవీక్షణముల వలన శరీరతాపముశిరోరోగము కలహము చింత వ్యాధి భయముగలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టేవస్త్రభూషణసంగ్రహం
మాతృబంధువివృద్ధిశ్చసుఖదారాదిసంకులం॥
కుజేనసంయుతేదృష్టేనృపాత్త్రీతిర్ధనవ్యయం
తాపజ్వరాదిరోగాశ్చసమానజననాశనం॥

చంద్రునియొక్క సంబంధవీక్షణముల వలస వస్త్రలాభము భూషణలాభము మాతృసౌఖ్యము బంధుసౌఖ్యము కళత్రసౌఖ్యము పుత్రసౌఖ్యము గలుగును.

కుజునియొక్క సంబంధవీక్షణముల వలన రాజసన్మానము ధనవ్యయము తాపజ్వరము సమానజననాశనముగలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టేమహారాజాశ్రయ స్తథా
ఇష్టార్థంయత్నసిద్ధిశ్చకుమారాదివివృద్ధిదం
గురుణాసంయుతేదృష్టేసుతదారసమాగమం
క్షితీశమైత్రంగోలాభంవిప్రప్రభువశాత్సుఖం

బుధునియొక్క సంబంధవీక్షణములవలన మహారాజా

శ్రయము ధన ప్రాప్తి యత్నకార్యసిద్ధి సంతాన సౌఖ్యము గలుగును.

గురునియొక్క సంబంధవీక్షణముల వలన సంతానసౌఖ్యము కళత్రసౌఖ్యము రాజస్నేహము పశులాభము బ్రాహ్మణప్రభుసన్మానము గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టేవస్త్రాభరణవాహనం
అధికారాభివృద్ధిశ్చధాన్యసంగ్రహణంతథా॥

శుక్రునియొక్క సంబంధవీక్షణముల వలన వస్త్రములు భూషణములు ఉద్యోగాభివృద్ధి ధాన్యలాభము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాతృతీయేలాభగేపివా
శుభగ్రహాయుతేనాపిద్రవ్యసంగ్రహణంతథా
విద్యావినోదకుశలంసమరేశత్రునాశనం
గోమహిష్యాదిలాభశ్చశూద్రప్రభువశాత్సుఖం॥

దశానాథుని లగాయతు శని కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహయుక్తుడై యున్నయెడల ద్రవ్యలాభము విద్యావినోదము సౌఖ్యము యుద్ధమందుజయము పశులాభము శూద్రప్రభుసన్మానము గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవావ్యయేవాపాపసంయుతే
తద్భుక్తౌదేహహానిస్స్యాత్ మహావ్యాధిభయంతథా
ద్వితీయద్యూనరాశిస్థేఅపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థంమృత్యుంజయజపంచరేత్॥

దశానాథుడైన కుజునిలగాయతు శని షష్ఠాష్టమవ్యయ ములయందుండి పాపసంబంధము గలిగియున్నయెడల యీ భుక్తియందు శరీరపీడ విశేషభయముగలుగును. ద్వితీయసప్తమ ములయందు శనియున్నయెడల మరణభయము గలుగును. అట్టిదోషము పోవుటకై మృత్యుంజయజపముచేసిన సౌఖ్యము గలుగును.

కుజదశలో బుధాంతర్దశ మా॥ 11 రో॥ 27

శ్లో॥ కుజస్యాంతర్గతే సౌమ్యే స్వోచ్చ కేంద్ర త్రికోణగే
ద్రవ్యార్జనేతు కౌశల్యం లిపివిద్యాది సాహసైః
శిల్పివాణిజ్యకర్మభ్యాం భ్రాతృమిత్రసహాయతా
వివాదేవిజయశ్చైవ స్వవిద్యార్ధనజీవనం॥

కుజదశలో బుధుడు ఉచ్చయందుగాని స్వక్షేత్రమందు గాని కేంద్రత్రికోణములయందుగాని యున్నయెడల ద్రవ్యసం పాదనయందు కుశలము లిపివిద్యవల్లను వర్తకమువల్లను శిల్ప విద్యవల్లను మిక్కిలి నేర్పుగలవాడును సోదరులయొక్కయు మిత్రులయొక్కయు సహాయముగలవాడును వాదము లభించు నప్పుడు పూర్ణజయమును పొందువాడును స్వతంత్రవిద్యవలన ధనమార్జించువాడును విశేషఖ్యాతిగలవాడును అగును.

శ్లో॥ కుజస్యాంతర్గతే సౌమ్యే నీచేషష్ఠాష్టరిప్పగే
పిత్తరోగేణపీడాచ వ్యాపారేణ ధనవ్యయం
శత్రువృద్ధివిశేషేణ జ్ఞాతిపీడాచ నిశ్చయం
కుటుంబకలహంచైవ బంధుమిత్ర విరోధితా॥

బుధుఁడు నీచయందుగాని లగ్నములగాయతుగాని దశానాథుడైన కుజునిలగాయతుగాని షష్ఠాష్టమవ్యయములయందున్నయెడల పైత్యరోగబాధయు వ్యాపారములవలన ధననష్టము శత్రువృద్ధి జ్ఞాతిబాధ కుటుంబకలహము బంధుమిత్రవిరోధము యివిగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే భూపాలాత్సుఖ మాప్నుయాత్
చింతితార్థస్యసిద్ధిశ్చమణిమాణిక్యసంగ్రహం
శశినాసంయుతేదృష్టే మాతృవంశ వివృద్ధినం
ఆరోగ్యగృహావృద్ధిశ్చ విద్యాధన వివృద్ధినం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన రాజులవల్లనుంచి సౌఖ్యము ప్రయత్నించిన ధనముయొక్కసిద్ధి మణిమాణిక్య లాభము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మాతృవంశ వృద్ధి ఆరోగ్యము గృహలాభము విద్య ధనము మొదలగువాని లాభము యివిగలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే తనుతాపం భవిష్యతి
ఆదౌకష్టంచఖేదంచ సమానజననాశనం
గురుణాసంయుతేదృష్టేపుత్రప్రాప్తిర్నసంశయః
ఆత్మసంగ్రహా కౌశల్యం ద్విజదేవార్చనంతథా॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన శరీరతాపము గలుగును. ఆదియందు కష్టము విచారము సమానజనునియొక్క నాశనము గలుగును.

గురుని సంబంధవీక్షణములవలన పుత్రప్రాప్తి ఆత్మా నాత్మవివేకజ్ఞానము ద్విజదేవార్చనము గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే స్త్రీసౌఖ్యం మణిలాభకృత్
వాహనాదిషు సౌఖ్యంచ వస్త్రభూషణసంగ్రహః
శనినాసంయుతేదృష్టే క్షేత్రధాన్యాదినాశనం
అకస్మాత్కలహంచైవ సమానజనపీడనం॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన స్త్రీసౌఖ్యము మణిలాభము వాహనసౌఖ్యము వస్త్రలాభము భూషణ లాభము గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన భూనాశనము ధాన్యనాశనము అకస్మాత్కలహము సమానమైనవానియొక్క శరీరపీడ యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాతృతీయే లాభగేపివా
శుభగ్రహయుతేవాపిబంధుమిత్రసమాగమం
యత్నకార్యార్థసిద్ధిశ్చక్షేత్రవృద్ధిస్తథైవచ
హేమాభరణసంప్రాప్తిః అధికారాధిలాభతః॥

దశానాథునిలగాయతు బుధుడు కేంద్రకోణములయం దుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహములతో గూడియున్నయెడల బంధుమిత్రసమాగమము యత్నకార్య సిద్ధి భూలాభము సువర్ణవస్తుప్రాప్తి ఉద్యోగలాభము యివి గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా దేహబాధాభవిష్యతి
తద్దోషపరిహారార్థం సూర్యప్రార్థన మాచరేత్॥

ద్వితీయసప్తమములయందు బుధుడున్నయెడల దేహబాధగలుగును. ఆదోషము పోవుటకై సూర్యప్రార్థన చేసినయెడల మిక్కిలి సౌఖ్యము గలుగును.

శ్లో॥ కుజస్యాంతర్గతే కేతౌ కేంద్రలాభత్రికోణగే
ఉద్యోగాద్ధనలాభంచ నీచమూలాద్ధనాగమం
శరీరేరోగపీడాచ శీఘ్రమేవనివారణం
కుటుంబవిరహాంచైవ పురాణశ్రవణాదికం॥

కేతువు కేంద్రకోణములయందుగాని లాభమందుగాని వున్నయెడల ఉద్యోగమువలన ధనలాభము నీచులవలన ధనప్రాప్తి రోగమువలన బాధగలిగి శీఘ్రముగా నివారణయగుటయు సంసారమందు విరక్తి పురాణశ్రవణము ధర్మకార్యచింత యివిగలుగును.

శ్లో॥ కుజస్యాంతర్గతే కేతౌరంధ్రే రిష్ఫేబసంస్థితే
దశానాథకుజాశ్చైవషష్టే రంధ్రేచరిష్ఫగే
నీచైర్విరోధః కలహో దుర్వృత్తిశ్చధనక్షయః
వాగ్దోషః పాపవృద్ధిశ్చధర్మమూలాద్ధనవ్యయం
ఋణవృద్ధిర్విశేషంచ దారాపుత్రాదిపీడనం
శత్రువృద్ధిర్విశేషంచ ప్రభుమూలాచ్చబంధనం
స్ఫోటకవ్రణబాధైశ్చ మనోదుఃఖం ధనవ్యయం॥

కుజదశలో కేతువు లగ్నములగాయతుగాని దశానాథుని లగాయతుగాని షష్ఠాష్టవ్యయములయందు దుర్బలముగానున్న యెడల నీచులతో విరోధము దుష్టవ్యాపారము ధనసష్టము వాగ్దోషమువలన పాపవృద్ధియు ధర్మమూలకముగా ధనవ్యయము ఋణవృద్ధి దారాపుత్రాదిపీడ విశేషముగా శత్రువృద్ధి ప్రభులవలన బంధనయోగము మశూచికవ్రణము వీనివలన బాధయున్ను మనోదుఃఖము ధనవ్యయము గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే రాజదండోధనక్షయః
నృపతస్కరబాధాచ శిరోరోగంజ్వరంతథా
శశినాసంయుతేదృష్టే మాతృకష్టంమనోవ్యథా
అకాలభోజనప్రాప్తిః మిత్రబంధువిరోధతా॥

రవియొక్క సంబంధవీక్షణములవలన రాజదండన ధనవ్యయము రాజులవల్లనుంచి దొంగలవల్లనుంచి బాధయున్ను శిరోరోగము జ్వరబాధగలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మాతృకష్టము మనోవ్యాకులత అకాలభోజనము మిత్రులతోను బంధువులతోను విరోధము గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే దేహారోగ్యంమనోవ్యథా
సర్వత్రకలహాంశ్చైవ శత్రుఘాతాదిపీడనం
బుధేనసంయుతేదృష్టే శస్త్రాస్త్రకుశలీభవేత్॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన శరీరవ్యాధి

మనోవ్యాకులత సమస్తమైనవారితో కలహము శత్రువులవలన దెబ్బతగలడమువల్లనుంచి బాధయున్ను గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన శస్త్రాస్త్రవిద్యలయందు నేర్పరితనము వ్రాయుటయందు చదువుటయందు లేఖలయందు నేర్పు మొదలగునవి గలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే పుత్రప్రాప్తిర్మహత్సుఖం
ధనవృద్ధిః నృపప్రీతిః యత్నకార్యసుసిద్ధదం
శుక్రేణసంయుతేదృష్టే స్త్రీనాశంకలహంతథా
వాహనంక్షేత్రనాశశ్చ బంధునాశంమతిభ్రమం
శనినాసంయుతేదృష్టే భృత్యవర్గవినాశనం
నీచసేవాచకలహంనీచ స్త్రీకలహంతథా॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రప్రాప్తి విశేషసౌఖ్యము ధనలాభము రాజప్రీతి యత్నకార్యసిద్ధి యివి గలుగును.

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన స్త్రీనాశనము కలహము వాహననాశనము భూనాశనము మతిభ్రమ యివి గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన సేవకులయొక్క నష్టము నీచసేవ నీచులతో విరోధము నీచస్త్రీలతో కలహము గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యేలాభగేపివా

శుభగ్రహవశాత్సౌఖ్యం యిష్టసిద్ధిర్మనోజయం
మహారాజప్రసాదేన ధనధాన్యాదిసంపదః॥

దశానాధునిలగాయతు కేతువు కేంద్రకోణములయం దుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహసంబంధము గలిగియున్న యెడల సౌఖ్యము యిష్టకార్యసిద్ధి మనోజయము మహారాజానుగ్రహమునుంచి ధనధాన్యసంపదలు యివి గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం శ్రీరుద్రజపమాచరేత్॥

ద్వితీయసప్తమ స్థానములయందు కేతువున్న యెడల అపమృత్యుభయముగలుగును. దానిదోషముపోవుటకై శ్రీరుద్ర జపమును మేకనుదానమును చేసినయెడల సౌఖ్యముగలుగును.

కుజదశలో శుక్రభుక్తి మా 14

శ్లో॥ కుజస్యాంతర్గతే శుక్రే స్వోచ్చ కేంద్రత్రికోణగే।
హేమమౌక్తికలాభశ్చ సద్యుక్తిర్బుద్ధికౌశలం।
స్త్రీభోగోధనలాభశ్చ రాజమూలాద్ధనాగమం।
సమ్మాన్యపభుసన్మానందారాపుత్రాభివర్ధనం॥

కుజమహాదశలో శుక్రుడు కేంద్రకోణముల యందు గాని ఉచ్చయందుగాని ఉన్న యెడల యీఅంతర్దశలో బంగారము ముత్యములు దొరకును. మంచియుక్తియు బుద్ధి కుశలతయు గలుగును. స్త్రీసంభోగము ధనలాభము రాజమూలకముగా ధన

లాభముగొప్పప్రభువులయొక్క సన్మానము దారాపుత్రాభివృద్ధియు మొదలగు శుభ ఫలములు గలుగును.

శ్లో॥ కుజస్యాంతర్గతే శుక్రేనీచషష్ఠాష్టరిప్ఫగే।
పరదేశనివాసంచ శరీరేవ్యాధి పీడనం।
దారాపుత్రవిరోధంచ కృషిమూలాద్ధనవ్యయం।
స్థానభ్రంశంచదుఃఖంచ నీచవృత్త్యాను జీవనం॥

శుక్రుడు నీచయందుగాని షష్ఠాష్టమవ్యయములయందు గాని ఉన్నయెడల పరదేశనివాసము రోగవృద్ధియు భార్యాపుత్రులతో విరోధము వ్యవసాయమువలన ధననష్టము స్థానభ్రష్టత్వము దుఃఖము నీచవృత్తివలన జీవనముగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే బాహుజాద్దండమాప్నుయాత్।
స్వపత్నీదేహనాశశ్చ పరస్పర విరోధకృత్।
శశినాసంయుతేదృష్టే గంధద్రవ్యాదిలాభకృత్
అపూర్వవస్తుసంప్రాప్తిః మాతృవంశవి వృద్ధిదం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన రాజువలనశిక్ష పడుటయు భార్యావియోగముగాని పరస్పరవిరోధముగాని గలుగును. చంద్రునియొక్క సంబంధవీక్షణములవలనసుగంధ పరిమళద్రవ్యములయొక్కలాభము అపూర్వవస్తు సంప్రాప్తి మాతృవంశవృద్ధి యివిగలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే పత్నీగర్భస్యనాశనం।
ఆప్తబంధువినాశశ్చ సర్వశత్రు వివృద్ధిదః॥

బుధేనసంయుతేదృష్టే విద్యాభ్యాసాది సంగ్రహః।
బంధూనాముపకారత్వం వాక్పాండిత్యం సభాసుచ॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన భార్యకుగర్భస్రావముగలుగుట ముఖ్యబంధునియొక్క మరణము సమస్తజనులతో కలహాము యివిగలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన విద్యాభ్యాసము బంధువుల కుపకారము సభలయందు వాగ్ధాటీగలుగుట యివిగలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే దేహారోగ్యం ధనాగమం।
పండితానాంచ సంసర్గః విప్రప్రభువశాత్సుఖం॥
శనినాస్థానచలనం ఉద్యోగస్యవినాశనం।
నానావిధాని చింతాని సంప్రాప్తిర్భవతి ధృవం॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన శరీరసౌఖ్యము ధనలాభము పండితస్నేహము బ్రాహ్మణ ప్రభువుల్లనుంచి సౌఖ్యముగలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన స్థానచలనము ఉద్యోగభంగము అనేకవిధములగు విచారము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా।
శుభగ్రహయుతేవాపి దేహసౌఖ్యం వినిర్దిశేత్।
స్త్రీసౌఖ్యంపుత్రసంపత్తిః స్వప్రభోస్తు మహత్సుఖం॥

దశానాథునకు కేంద్రకోణములయందుగాని తృతీయ

లాభములయందుగాని శుభగ్రహయుతుడై శుక్రుడున్న యెడల ఈభుక్తియందు దేహసౌఖ్యము స్త్రీసౌఖ్యము పుత్రసంపత్తి స్వప్రభువువల్లనుంచి సౌఖ్యమును గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే ।
తద్భుక్తౌ వ్యాధిదుఃఖంచ కలహం ప్రాణపీడనం ।
యత్నకార్యవినాశశ్చ నృపక్రోధంధ నక్షయం ।
శత్రుపీడాపుత్రపీడాదార పీడా భవిష్యతి ॥

దశానాథుని లగాయతు షష్ఠాష్ట వ్యయములయందు పాపగ్రహయుక్తుడై శుక్రుడున్న యెడల అట్టిభుక్తియందు వ్యాధియు దుఃఖమును కలహము ప్రాణభయము యత్నకార్య నష్టము రాజవిరోధము ధననష్టము శత్రుపీడ పుత్రపీడ కళత్ర పీడ యివిగలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే దేహపీడాభవిష్యతి ।
తద్దోషపరిహారార్థం వనదుర్గాజపంచరేత్ ।
దుర్గాదానంప్రకుర్వీతదానే నారోగ్యమావిశేత్ ॥

ద్వితీయసప్తమములయందు శుక్రుడున్న యెడల దేహ పీడగలుగు. అట్టిదోషముపోవుటకై వనదుర్గాజపమును దుర్గా ప్రతిమదానమును చేసినయెడల సౌఖ్యమునుబొందును.

కుజదశలోరవిభుక్తి మా 4 రో 6

శ్లో॥ కుజస్యాంతర్గతేభానౌ స్వోచ్చకేంద్రత్రికోణగే ।
ఉద్యోగాద్వాహనాప్తిశ్చరాజసన్మానవైభవం ।

దారాపుత్రాది సౌఖ్యంచ బంధుమిత్ర సమాగమం ।
గృహక్షేత్రాభి వృద్ధిశ్చ పశుధాన్యాభివర్ధనం ॥

కుజమహాదశలో రవి ఉచ్చయందుగాని కేంద్రకోణములయందుగాని ఉన్నయెడల ఈరవ్యంతర్దశలో ఉద్యోగలాభము వాహనసౌఖ్యము రాజసన్మానమువలన సంతోషము దారాపుత్రాదిసౌఖ్యము బంధుమిత్రులతో సమాగమము గృహలాభము భూలాభము పశువృద్ధి మొదలగునవిగలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్ట రాశిస్థే వ్యయేవానీచరాశిగే
తద్భుక్తౌ క్రోధకలహం స్థాననాశంనృపాద్భయం
పితృర్మృతిర్మనోదుఃఖ మా ప్తబంధువినాశనం
సమానజనవిద్వేషం పైత్యరోగాదిసంభవం
తాపజ్వరాదిపీడాచ ఆలస్యంకార్యనాశనం

లగ్నషష్ఠాష్టవ్యయములయందుగాని నీచరాశియందుగాని రవియున్నయెడల ఈభుక్తియందు విరోధము కలహము స్థానభ్రష్టత్వము రాజులవలన భయము తండ్రియొక్కమరణము మనోదుఃఖము ముఖ్యమయిన బంధువునియొక్కమరణము సమానజనులతో వైరము పైత్యరోగము తాపజ్వరము మందబుద్ధి కార్యభంగము గలుగును.

శ్లో॥ చంద్రేణసంయుతేదృష్టే ద్రవ్యలాభంమహత్సుఖం
అతిప్రతాపమారోగ్యం యత్నకార్యార్థసిద్ధిదం

కుజేనసంయుతేదృష్టే యుద్ధేఘాతాదిపీడనం
స్త్రీపుత్రజనపీడాచ జ్ఞాతిశత్రువివృద్ధిదం॥

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన ద్రవ్యలాభము విశేషసౌఖ్యము మిక్కిలిశౌర్యము ఆరోగ్యము యత్నకార్యసిద్ధి గలుగును.

కుజునియొక్క సంబంధవీక్షణములవలన యుద్ధమందు దెబ్బతగులుటవలన బాధయు స్త్రీపుత్రజనపీడ జ్ఞాతివిరోధము యివిగలుగును.

బుధేనసంయుతేదృష్టే ఉత్తమాయుధలబ్ధవాన్।
బంధూనాముపకారత్వం సభాపూజ్యత్వమేవచ ।
గురుణాసంయుతేదృష్టే పుత్రప్రాప్తిర్నసంశయః ।
స్త్రీసౌఖ్యంధనలాభశ్చ మిత్రప్రభువశాత్సుఖం ॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన గొప్పదైన ఆయుధమును ధరించుటయు బంధూపకారము సభాపూజ్యత యివిగలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రసంతానప్రాప్తి స్త్రీసౌఖ్యము ధనలాభము మిత్రప్రభువులవలన సౌఖ్యము గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే వాహనాశ్వాది సంగ్రహం ।
అపూర్వవస్తుసంప్రాప్తిర్మణిభూషణసంగ్రహం ।

శనినాసంయుతేదృష్టే గజాశ్వపశునాశనం ।
భృత్యవర్గవినాశశ్చదారాత్క్లేశంభవిష్యతి ॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన వాహనములు గుఱ్ఱములు అపూర్వవస్తువులు లభించుట మణులు భూషణము యివిగలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన గజములు గుఱ్ఱములు పశువులు వీనియొక్కనాశనము సేవకనాశనము భార్యవల్లనుంచి దుఃఖము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యేలాభగేపివా ।
శుభగ్రహయుతేవాపిశుభశోభనసంయుతం।
వస్త్రాభరణసంప్రాప్తిః మహారాజాశ్రయస్తథా।
ప్రాచ్యాంప్రయాణంకురుతే యత్నకార్యార్థసిద్ధిదం ।
సుగంధచందనద్రవ్యంలభతేనాత్రసంశయః॥

దశానాథుని లగాయతు రవి కేంద్రకోణములయందు గాని తృతీయలాభములయందుగాని శుభగ్రహయుక్తుడైయున్నయెడల అట్టిరవిభుక్తియందు శుభశోభనములు వస్త్రాభరణసంప్రాప్తి మహారాజానుగ్రహము పూర్వదిక్కునకు ప్రయాణము యత్నకార్యసిద్ధి సుగంధములు చందనము ద్రవ్యము మొదలగు వానిలాభమును నిస్సంశయముగా బొందును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవావ్యయేవాపాపసంయుతే
సమరేశత్రువృద్ధిశ్చపితృవర్గవినాశనం
క్షితీశకోపకలహంసంతాపజ్వరమేవచ.

శ్లో॥ ద్వితీయ్యస ప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థంపద్మదానంచకారయేత్ ॥

దశానాథునకు రవిషష్ఠాష్టవ్యయములయందు పాపసంబంధము గలగియున్నయెడల యుద్ధమందు శత్రువృద్ధిపితృవర్గనాశనము రాజవిరోధము కలహము సంతాపజ్వరము యివి గలుగును.

ద్వితీయస ప్తమములయందు రవియున్నయెడల అపమృత్యుభయముగలుగును. అదిపోవుటకై పద్మదానమును చేయవలెను.

కుజదశలోచంద్రభుక్తి మా 7

శ్లో॥ కుజస్యాంతర్గతేచంద్రేస్వోచ్చే కేంద్రత్రికోణగే
వస్త్రాభరణలాభశ్చ స్త్రీసహాయోధికారితా
జలాగ్నిధనలాభశ్చ పుత్రదారాభివర్ధనం
గంగాస్నానఫలప్రాప్తిః పురాణశ్రవణాదికం॥

కుజదశలో చంద్రభుక్తియందు చంద్రుడు ఉచ్చయందుగాని కేంద్రకోణములయందుగాని ఉన్నయెడల వస్త్రాభరణలాభము మంచివస్త్రములును మంచిఅలంకారములును స్త్రీసహాయమువలన ఉద్యోగము జలమువల్లను అగ్నివల్లను లాభము పుత్రదారాభివృద్ధియు గంగాస్నానఫలప్రాప్తి పురాణశ్రవణము మొదలగు శుభఫలములు గలుగును.

శ్లో॥ కుజస్యాంతర్గతేచంద్రేనీచేషష్ఠాష్టరిష్ఫగే
జలగండాద్భయంచాపిమాతారిష్టంతథైవచ

దేశాంతరేనివాసంచశతౄమూలాద్ధనవ్యయం
ఋణవృద్ధిర్విశేషంచవ్యాపారేణవినాశనం
శరీరేరోగపీడాచవాతరోగేణబాధ్యతే
బంధుమిత్రవిరోధంచమనోదుఃఖంవిశేషతః

కుజమహాదశలో చంద్రుడు నీచయందుగాని లగ్నము లగాయతుగాని కుజునిలగాయతుగాని షష్ఠాష్టవ్యయములయం దున్నను యీచంద్రాంతర్దశలో జలగండమువలన భయము మాతృపీడ. పరదేశనివాసము శత్రుమూలముగా ధనవ్యయము ఋణవృద్ధి వ్యాపారమువలననష్టము శరీరమందు రోగవృద్ధి వాతరోగమువలన బాధ మొదలగు చెడుఫలములుగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టేప్రభుమూలాత్సుఖంభవేత్
అపూర్వవస్తుసంప్రాప్తిఃపత్నీబంధువినాశనం॥
కుజేనసంయుతేదృష్టేతాపజ్వరమరేర్భయం
వివాదయుద్ధకలహంభూమినాశంనసంశయః॥

రవియొక్క సంబంధవీక్షణములవలన రాజులవలనసౌ ఖ్యము అపూర్వవస్తుసంపాదన భార్యయొక్కయు బంధువుల యొక్కయు నాశనములు గలుగును.

కుజునియొక్క సంబంధవీక్షణములవలన తాపజ్వరబా ధవివాదము యుద్ధము కలహము భూనాశనమును గలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే గృహలాభం విచిత్రకం ।
భాంధవాదివివృద్ధిశ్చ సన్మానం నృపపూజనం॥

గురుణాసంయుతేదృష్టే స్వపుత్రాణాంవివృద్ధిదం ।
అర్థలాభంమహత్సౌఖ్యం విద్యాకీర్తిర్ధనాగమం ॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన విచిత్రమైన గృహలాభము బంధువృద్ధి సన్మానము రాజపూజ్యతగలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రవృద్ధిధన లాభము విశేషసౌఖ్యము విద్యాలాభము యశస్సు యివి గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే స్త్రీపుత్రాణాంతు సౌఖ్యదం ।
సమరేవిజయంచైవ వస్త్రభూషణలబ్ధవాన్ ।
శనినాసంయుతేదృష్టే భృత్యనాశంతథైవచ ।
స్థాననాశంక్షేత్రనాశం సమానజననాశనం ।

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన స్త్రీపుత్రుల యొక్కసౌఖ్యము యుద్ధమందుజయము వస్త్రలాభముభూషణ లాభము గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన సేవకనాశనము స్థానభ్రష్టత్వము భూనాశనము సమానజనునియొక్క నాశనము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవాపాపసంయుతే ।
దేహతాపంమనస్తాపంబుద్ధిజాడ్యంతథైవచ ।
క్షితీశకలహంచైవ యాత్రాయాంనిష్ఫలంలభేత్ ॥

దశానాధుని లగ్నాయుతుషష్ఠాష్ట వ్యయములయందు

చంద్రుడు పాపులతో కలిసియున్నయెడల శరీరతాపముమనస్తాపము బుద్ధిజాడ్యము రాజవిరోధము యాంత్రినిష్ఫలము గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా ।
శుభగ్రహాయుతేవాపి ధనలాభముదీరయేత్ ॥
మణివస్త్రాదిలాభశ్చ పుత్రికాసంభవంతథా ।
స్త్రీప్రీతిమానసవృద్ధిశ్చ విజయంచభవిష్యతి ॥

దశానాథునిలగాయతు చంద్రుడు తృతీయలాభముల యందుగాని కేంద్రకోణములయందుగాని శుభగ్రహాయుక్తుడై యున్నయెడల ధనలాభము మణులువస్త్రములు మొదలగు వానిలాభము స్త్రీగర్భముధరించుట విజయము యివిగలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యుర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం దుర్గాదానంచశాంతిదం ॥

ద్వితీయసప్తమములయందు చంద్రుడున్నయెడలమరణ భయముగలుగును. అట్టిదోషముపోవుటకై దుర్గాప్రతిమదానము చేసినయెడల శాంతిగలుగును.

రాహుదశలో రాహుభుక్తి మా 32 రో 12

శ్లో॥ రాహోరంతర్గతేరాహౌ లగ్నాత్కేంద్రత్రికోణగే।
తృతీయేలాభగేవాపి శుభగ్రహాయుతేపివా ।
క్షితీశత్వంద్రవ్యలాభం బంధుసన్మానపూజనం ।
తీర్థయాత్రాప్రసంగంచ దేవతానాంచదర్శనం ।

అపూర్వవస్తు సంప్రాప్తిః దారాపుత్రాదిసౌఖ్యదం।
కృషిక్షేత్రాభివృద్ధిశ్చ స్వప్రభోస్తు మహత్సుఖం।
కళ్యాణాదిశుభప్రాప్తిః గ్రామనాథత్వమాప్నుయాత్ ॥
స్త్రీమూలాది ప్రసంగాప్తిః విధవాదిసమాగమం ॥

రాహుమహాదశలో రాహ్వంతరమందు రాహువులగ్నములగాయతు కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహాయుతుఁడై యున్న యెడల భూపాలయోగము ద్రవ్యలాభము బంధుపూజ్యత తీర్థయాత్రలు సేవించుట దేవతాదర్శనము అపూర్వవస్తు సంపాదన కళత్రసౌఖ్యము పుత్రసౌఖ్యము వ్యవసాయసౌఖ్యము భూలాభము తనయొక్క ప్రభువువల్లనుంచి విశేషసౌఖ్యము కళ్యాణాదిశుభము గ్రామాధికారము స్త్రీమూలకముగా ప్రసంగము విధవాసంగమము యివిగలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్టగేవాపి వ్యయేవాపాపసంయుతే ।
తద్భుక్తౌ స్త్రీవిరోధశ్చ విధవాకలహంతథా ।
దారాపుత్రాదిపీడాచ క్షేత్రనాశంతథైవచ ।
యత్నకార్యవినాశశ్చ జ్ఞాతీనాంకలహంతథా ॥

లగ్నమందుగాని షష్ఠాష్టవ్యయములయందుగాని పాపయుక్తుఁడైరాహువున్న యెడల స్త్రీలతోవిరోధము విధవలతో కలహము దారాపుత్రాదిపీడ భూనాశనము కార్యనాశనము జ్ఞాతివిరోధము యివి యీరాహుభుక్తియందుగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే సన్నిపాతజ్వరాదికం ।
చతుష్పాజ్జీవనాశశ్చ సర్వత్రకలహంతథా।
శశినాసంయుతేదృష్టే మాతృకష్టంవినిర్దిశేత్ ।
మనఃక్లేశంమానభంగం యుద్ధేశతృభయంభవేత్ ॥

రవియొక్క సంబంధవీక్షణముల వలన సన్నిపాతజ్వరము పశునష్టము సమస్తమైన వారితో కలహము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మాతృకష్టము మనోవ్యాధి మానభంగము యుద్ధమందుశతృభయము గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే అకస్మాత్కలహంతథా ।
చోరాదివిషభీతిశ్చ సమానజననాశనం ।
బుధేనసంయుతేదృష్టే స్వజనాద్భీతిమాప్నుయాత్ ।
అపవాదభయప్రాప్తిః అకస్మాత్కలహంతథా ।

కుజునియొక్క సంబంధవీక్షణములవలన అకస్మాత్తుగా కలహము దొంగలవల్లనుంచి అగ్నివల్లనుంచి విషమువల్లనుంచి భయముసమానజన నాశనముగలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణమువలన స్వజనులవలన భయము అపవాదము అకస్మాత్తుగా కలహముగలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే విప్రాణాంకలహంతథా ।
సమానజనకోపశ్చ పుత్రపీడాభవిష్యతి ।

శుక్రేణసంయుతేదృష్టేనస్త్రీవ్యాధిభయంతథా ।
వాహనాదివినాశశ్చ ధనధాన్యవినాశనం ॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన బ్రాహ్మణుల తో కలహము సమానజనునితో క్రోధము పుత్రపీడ యివి గలుగును.

శుక్రునితోకలిసినను చూడబడినను కళత్రపీడ వాహననష్టము ధనధాన్యనష్టము గలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టేస్వభృత్యకలహంతథా
ధాన్యాదినాశనప్రాప్తిఃసమానజననాశనం
ద్వితీయద్యూనరాశిస్థేఅపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థంనాగదానంచకారయేత్
దుర్గాజపంచకుర్వీతరాహుప్రీతికరంభవేత్ ॥

శనియొక్కసంబంధవీక్షణములవలన సేవకులతోకలహము ధాన్యనాశనము సమానమనుజునియొక్క నాశనముగలుగును.

ద్వితీయసప్తమములయందు రాహువున్నయెడల అపమృత్యుభయముగలుగును. దానికి సర్పదానమును దుర్గాజపమును రాహుప్రీతియగు దానమునుచేసినయెడల సౌఖ్యముగలుగును.

రాహుదశలోగురుభుక్తి మా 28 రో 24

శ్లో॥ రాహోరంతర్గతేజీవేస్వోచ్చకేంద్రత్రికోణగే
మిత్రస్థానేథవేలాభేశుభగ్రహయుతేక్షితే

ఉత్తమైస్సహసంవాసః స్త్రీపుత్రసుఖమేవచ
తీర్థస్నానంసాహసంచస్వర్ణరత్నాదిభూషణం
ఉద్యోగంవాహనంచైవధనలాభంవిశేషతః॥

యీగుర్వంతర్దశలో గురుడు ఉచ్ఛయందుగాని కేంద్ర కోణములయందుగాని మిత్రస్థానమందుగాని ధనలాభస్థానములయందుగాని శుభగ్రహసంబంధవీక్షణములు గలిగియున్నయెడల ఉత్తమపురుషులతో సహవాసము స్త్రీపుత్రసౌఖ్యము తీర్థస్నానఫలము ఔదార్యసాహసములు స్వర్ణరత్నభూషణప్రాప్తి ఉద్యోగలాభము వాహనసౌఖ్యము విశేషధనలాభముగలుగును.

శ్లో॥ రాహోరంతర్గతేజీవే నీచేషష్ఠాష్టరిష్ఫగే
కుటుంబేకలహంచైవబంధుమిత్రవిరోధితా
ఋణవృద్ధిర్విశేషంచశుభమూలాద్ధనవ్యయం
క్వచిద్దుఃఖంక్వచిత్సౌఖ్యంపుణ్యపాపఫలప్రదం॥

గురుడు నీచయందుగాని షష్ఠాష్టవ్యయములయందుగానియున్నయెడల కుటుంబకలహము బంధుమిత్రులతో విరోధము శుభకార్యములవలన ధనవ్యయము ఋణవృద్ధి కొంచెము దుఃఖము కొంచెముసౌఖ్యము పుణ్యపాపమిశ్రమఫలము యివిగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టేక్షితీశాత్కలహంతథా
ధనవ్యయంమనస్తాపంస్థాననాశమవాప్నుయాత్

శశినాసంయుతేదృష్టేవస్త్రాభరణలాభవాన్
శ్వేతాశ్వాదిమహాలాభఃమహారాజప్రసాదతః॥

రవియొక్క సంబంధవీక్షణములవలన రాజులతో కలహము ధనవ్యయము మనస్తాపము స్థానభ్రష్టత్వము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన వస్త్రాభరణలాభము మహారాజానుగ్రహమువల్లనుంచి శ్వేతాశ్వ లాభము యివిగలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే పైత్యవ్యాధికృతంతథా
ఉన్నతాత్పతనంచైవవ్రణశస్త్రాదిపీడనం
బుధేనసంయుతేదృష్టేవిద్యాభ్యాసాదిసంగ్రహః
విచిత్రగృహలాభశ్చవిష్ణుభక్తిపరాయణః

కుజునియొక్క సంబంధవీక్షణములవలన పిత్తవ్యాధి ఉన్నతప్రదేశమునుండి క్రిందపడుట వ్రణబాధ శస్త్రపీడ యివి గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన విద్యాభ్యాసము విచిత్రగృహలాభము విష్ణుభక్తి యివి గల్గును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే వస్త్రాభరణలాభవాన్
వాహనాందోళికప్రాప్తిః ఇష్టసిద్ధిర్భవిష్యతి
శశినాసంయుతేదృష్టే దాసీదాస ధనక్షయం
శత్రువృద్ధిర్మనస్తాపం దాయాది జనవిద్వరం॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన వస్త్రాభరణ

ప్రాప్తి వాహనము పల్లకిమొదలగువాని లాభము ఇష్టకార్య సఫలము యివిగలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన దాసదాసీ జనములయొక్క నష్టము ధననష్టము శతృవద్ధి మనోవ్యాకులత బంధునష్టము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్ర కోణేవాతృతీయే లాభగేపివా
శుభగ్రహయుతేవాపివిత్తలాభముదీరయేత్
పుత్రోత్సవాది సంతోషం స్వప్రభోస్తుమహత్సుఖం
క్షేత్రధాన్యాభివృద్ధిశ్చ శివభక్తిర్భవిష్యతి॥

దశానాధునిలగాయతు గురుడు కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహయుక్తుడై యున్నయెడల ధనలాభము పుత్రోత్సవము సంతోషము స్వప్రభువువల్లనుంచి సౌఖ్యము భూలాభము ధాన్యాభివృద్ధి శివభక్తి గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రే వా వ్యయేవా పాపసంయుతే
బుద్ధివైకల్యమాప్నోతి పుత్రదారాదిపీడనం
యత్నకార్యవినాశశ్చ సర్వత్రకలహంతధా
నృపక్రోధం ద్రవ్యనాశం విప్రాణాం కలహంతధా॥

దశానాధునిలగాయతు గురుడు షష్ఠాష్టమవ్యయముల యందు పాపగ్రహయుక్తుడై యున్నయెడల బుద్ధిమాంద్యము కళత్రపీడ సంతానపీడ కార్యవిఘ్నము సకలజనులతో కలహ

ము రాజవిరోధము ధననాశనము బ్రాహ్మణవిరోధము గలుగును.

శ్లో॥ ద్వితీయద్యూననాథేనయుక్తే తద్భుక్తిమృత్యుదా
తద్దోషపరిహారార్థం శతరుద్ర జపంచరేత్
స్వర్ణదానం ప్రకుర్వీత అపమృత్యు నివారణం॥

ద్వితీయసప్తమ స్థానములయందు గురువున్నయెడల యీగురుభుక్తియందు మరణభయము గలుగును. అట్టిదోషము పోవుటకై రుద్రజపమును స్వర్ణదానమును చేసినయెడల సౌఖ్యము గలుగును.

రాహుదశలో శనిభుక్తి మా 34 రో 6

శ్లో॥ రాహోరంతర్గతే మందే స్వోచ్చలాభత్రికోణగే
షష్టేసహజభావస్థే శుభదృష్టియుతేక్షితే
అధికోద్యోగసన్మానం శూద్రమూలాద్ధనాగమం
ఆందోళికాది సౌఖ్యంచ దారాపుత్ర వివర్ధనం
కృషిగోభూమిపుత్రాదిభ్రాతృమాతృ సుఖంభవేత్॥

రాహుదశలో శన్యంతర్దశయందు శని లగ్నములగా యతు ఉచ్చయందుగాని కేంద్రకోణములయందుగాని లాభమందుగాని తృతీయషష్టములయందుగాని శుభగ్రహయుక్తుడై యున్నయెడలను చూచినను గొప్పఉద్యోగము విశేషగౌరవము శూద్రమూలకముగా ధనలాభము ఆందోళికాది వాహనసౌఖ్యము దారాపుత్రవృద్ధి దేహారోగ్యము మనస్సంతో

షము యశోవృద్ధి వ్యవసాయాభివృద్ధి పశువృద్ధి భూలాభము సంతానలాభము భాతృమాతృసౌఖ్యము యివిగలుగును.

శ్లో॥ రాహోరంతర్గతే మందే నీచే కేంద్రాష్టరిప్ఫగే
రోదనం మానభంగశ్చ వృక్షాత్పతనజంభయం
దుస్సంగ త్విష్టకృత్యం పరయోషిత్పరిగ్రిహః
పత్నీత్యాగః కుక్షిరోగో నేత్రిరోగో జలాద్భయం॥

రాహువులో శని నీచయందుగాని కేంద్రమందుగాని అష్టమవ్యయములయందుగాని యున్నయెడల రోదనము మానభంగము వృక్షములమీదనుంచి పడుటవలన భయమున్ను దుస్సాంగత్యము దుష్టకార్యములు చేయుటయు పరస్త్రీసంభోగము భార్యావియోగము కుక్షిరోగము నేత్రిరోగము జలగండము యివిగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే పితృవర్గవినాశనం
స్థానవాశం బంధుకోపం ధననాశం పదచ్యుతిం
శశినాసంయుతేదృష్టే మాతృవర్గవినాశనం
మనఃక్లేశం మానభంగం స్త్రీకోపం బంధువిగ్రహం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన పితృవర్గనాశనము స్థాననాశనము బంధువిరోధము ధనవ్యయము పదభ్రిష్టత్వము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మాతృవర్గనాశనము మనోవ్యాకులత మానభంగము స్త్రీలతో విరోధము బంధువిరోధము యివిగలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే జ్ఞాతివర్గవినాశనం
సమానజనహానిస్స్యాత్ స్వస్యనాధస్యవిగ్రహం
బుధేనసంయుతేదృష్టే విద్యాలాబాధ్ధనాగమం
సత్కధాశ్రవణంచైనతీర్ధస్నానాదిజం ఫలం॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలనజ్ఞాతివర్గనాశనము సమానజనహాని దారాపుత్ర హానిగలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన విద్యవల్లనుం చి ధనలాభము సత్కాలక్షేపము తీర్ధస్నానఫలము యివి గలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే పుత్రపీడాభవిష్యతి
గురుస్వామి విరోధత్వంధననాశం తథైవచ
శుక్రేణసంయుతేదృష్టే భూమిధాన్యవివృద్ధిదం
అశ్వాదివాహనప్రాప్తిః యత్నకార్యార్ధసిద్ధిదం॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రపీడ గురు విరోధము ధననాశనము గలుగును.

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన భూలాభము ధాన్యవృద్ధి అశ్వాదివాహనప్రాప్తి యత్నకార్యసిద్ధి యివి గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణే వాతృతీయే లాభగేపివా
శుభగ్రహాయుతేవాపిధనలాభంవినిర్దిశేత్
అవనీపతిసన్మానం గృహేకళ్యాణ సంభవం

దారాపుత్రాదిసౌఖ్యంచ దాసీదాసాది సంగ్రహం
గోమహిష్యాదివృద్ధిశ్చ నీలవస్త్రాది సంగ్రహం॥

దశానాథునిలగాయతు శని కేంద్రకోణములయందుగాని తృతీయలాభములందుగాని శుభగ్రహయుక్తుడైయున్నయెడల ధనలాభము రాజసన్మానము గృహమందు కళ్యాణము కళత్రసౌఖ్యము పుత్రసౌఖ్యము దాసదాసీజనవృద్ధి పశువృద్ధి నల్లనివస్తువులయొక్క సంపాదనయు యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవావ్యయేవాపాపసంయుతే
తద్భుక్తౌస్థాననాశంచ అపకీర్తిభయంతథా
స్వబంధుజనవైషమ్యం సమానజననాశనం
నీచసేవాతికలహం స్థానభ్రంశం పశుక్షయం
హృద్రోగం మానహానిస్స్యాద్విషాగ్నినృపపీడనం
ప్రమేహం క్షయగుల్మాది శూలాహృద్రోగికో భవేత్
కుభోజనం కుత్సితరాజసేవామనోవిచార స్వజనైశ్చకోపః॥

దశానాథునిలగాయతు శని షష్ఠాష్టమ వ్యయములయందు పాపయుక్తుడైయున్నయెడల అట్టి భుక్తియందు స్థానభ్రష్టత్వము అపకీర్తి భయము బంధువిరోధము సమానజననాశనము నీచసేవ కలహము స్థానభ్రష్టత్వము పశుహాని హృద్రోగము మానహాని విషమువల్లనుంచి అగ్నివల్లనుంచి రాజులవల్లనుంచి భయము ప్రమేహవ్యాధి క్షయవ్యాధి గుల్మరోగము శూలవ్యాధి యివిగలుగును. భోజ

నసౌఖ్యము లేకపోవుట దుష్టప్రభువు దగ్గిర కొలువు యివి గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం విష్ణుసాహస్రకంజపేత్
ఛాగదానంప్రకుర్వీత శాంతిమాప్నోత్య సంశయః॥

ద్వితీయసప్తమ స్థానములయందు శనియున్నయెడల అపమృత్యుభయము గలుగును. అట్టిదోషముపోవుటకై విష్ణుసహస్రజపమును మేకదానమును చేయవలెను. అందువలన శాంతి సౌఖ్యము కలుగును.

రాహుదశలో బుధభుక్తి మా 30 రో 18

శ్లో॥ రాహోరంతర్గతేసౌమ్యే కేంద్రలాభత్రికోణగే
వివాహాదిసుఖంయానం పుత్రలాభేధనాగమః
కుటుంబబంధుసౌఖ్యంచ వేశ్యాదిషుమహారతిః
అనాచారోతిడంబత్వం వ్యాపారేధనసంభవః
ఋణబాధాద్విముక్తిశ్చ జ్ఞాతిమూలాద్ధనాగమః

రాహుదశలో బుధభుక్తియందు బుధుడు కేంద్రకోణములయందున్నయెడల వివాహసౌఖ్యము వాహనసౌఖ్యము పుత్రలాభము ధనలాభము కుటుంబసౌఖ్యము బంధుసౌఖ్యము వేశ్యాసంభోగము అనాచారము డాంబికము వ్యాపారమువలన ధనలాభము ఋణవిముక్తియు జ్ఞాతులవలన ధనలాభము మొదలగు మంచిఫలములు గలుగును.

శ్లో॥ రాహోరంతర్గతేసౌమ్యే నీచేషష్ఠాష్టరిష్ఫగే
జ్ఞాతివృద్ధిర్విశేషంచ వ్యాపారేణధనవ్యయం
కృషివాణిజ్యనాశంచ బంధునాశమథాపివా
పదభ్రష్టంమహాద్వేషం బంధుద్వేషంలభేన్నరః

రాహువులో బుధుడు నీచయందున్నను షష్ఠాష్టమ వ్యయములయందున్నను జ్ఞాతివృద్ధి విశేషము గాను వ్యాపారములయందు ధననష్టము వ్యవసాయనష్టము బంధునాశనము వర్తకనష్టము పదభ్రష్టత్వము మహాద్వేషము మొదలగు నష్టములు గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే సంతాపజ్వరసంభవం
స్థాననాశంనృపాద్భీతిః యుద్ధేశత్రుభయంతథా
శశినాసంయుతేదృష్టే మాతృసౌఖ్యంమహత్సుఖం
నటగాయకసంసర్గః యత్నకార్యార్థసిద్ధిదః॥

రవియొక్క సంబంధవీక్షణములవలన సంతాపజ్వరము స్థానభ్రష్టత్వము రాజభయము యుద్ధమందు శత్రుభయము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మాతృసౌఖ్యము విశేషసౌఖ్యము గణికాదులతో స్నేహము యత్నకార్యసిద్ధి గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే శస్త్రఘాతాదిపీడనం
ఉన్మాదచిత్తవైకల్యం స్వస్త్రీవ్యాధిభగవిస్మృతి

గురుణాసంయుతేదృష్టే స్త్రీపుత్రాణాంచసౌఖ్యదం
అర్థసిద్ధిర్మహాసౌఖ్యం క్షేత్రగోధనవర్ధనం॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన ఆయుధముల వల్లనుంచి దెబ్బతగులుటవలన భయమున్నూ ఉన్మాదము చిత్తచాంచల్యము భార్యకు మహావ్యాధిగలుగుట యివి గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే ధనధాన్యాభివృద్ధిదం
వాహనాంబరసంప్రాప్తిః బహుద్రవ్యాయతింతథా
శనినాసంయుతేదృష్టే దాసీదాసాదినాశనం
క్షేత్రధాన్యవినాశశ్చ సర్వత్రకలహంతథా

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన ధనధాన్యము వీట్లయొక్కవృద్ధి వస్త్రలాభము వాహనలాభము విశేషద్రవ్యలాభము గలుగును.

౧ చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన దాసదాసీజననాశనము భూనాశనము ధాన్యనాశనము సమస్తజనులతో కలహముగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా
శుభగ్రహాయుతేవాపి తద్భుక్తౌద్రవ్యలాభకృత్
స్త్రీపుత్రజ్ఞాతివృద్ధిశ్చ శత్రునాశంతథైవచ
పశుధాన్యవివృద్ధిశ్చ పుత్రవృద్ధిసుఖంభవేత్॥

దశానాథునిలగాయతు బుధుడు కేంద్రకోణములయం

దుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహయుతుఁడై యున్నయెడల యీబుధభుక్తియందు ద్రవ్యలాభము స్త్రీపుత్రజ్ఞాతివృద్ధి శత్రునష్టము పశులాభము ధాన్యలాభము పుత్రవృద్ధి సుఖము గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవాపాపసంయుతే
నీచగ్రహయుతేవాపి పాపచింతామనోవ్యథా
ఉద్యోగభంగమాలస్యం స్థాననాశం మహద్భయం
కాలమృత్యుభయంచైవ హింసాదారిద్రపీడనం॥

దశానాథునికిఁగాయతు బుధుఁడు షష్ఠాష్టమవ్యయములయందు పాపులతోఁగూడియున్నను నీచగ్రహములతోఁగూడియున్నను పాపకార్యచింతనము మనోవ్యాకులత ఉద్యోగభంగము మందబుద్ధి స్థానభ్రష్టత్వము విశేషభయము అకాలమృత్యుభయము హింస దరిద్రదోషము యివిగలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం విష్ణుసాహస్రకంజపేత్॥
శ్రీమూర్తిదానంకుర్వీత శాంతిమాప్నోత్యసంశయః॥

ద్వితీయసప్తమములయందు బుధుఁడున్నయెడల అపమృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై విష్ణుసహస్రనామమును జపించుటయు శ్రీమూర్తిప్రతిమాదానమును చేయుటయు గలుగుటవలన శాంతిసౌఖ్యము గలుగును.

రాహు మహాదశలో కేతుభుక్తి మా 12 రో 18

శ్లో॥ రాహోరంతర్గతే కేతౌలాభేకోణేచ సంస్థితే
తృతీయేషష్టగేవాపి స్వబంధుజనపూజ్యతాం
వాహనం భూమిలాభంచ గంధమాల్యాదిలేపనం
కృషిగో భూమిలాభంచ విద్యాబంధుసమాగమం॥

రాహువులో కేతువు లాభమందుగాని కోణములయందుగాని తృతీయషష్టలాభములయందుగాని వున్నయెడల బంధుపూజ్యత వాహనము భూలాభము సుగంధవస్తువులయొక్క లేపనము భూలాభము వ్యవసాయలాభము బంధుసమాగమము విద్యాలాభము గలుగును.

శ్లో॥ రాహోరంతర్గతే కేతౌరిప్ఫేరంధ్రేశసంస్థితే
ధనేచసప్తమస్థానే పాపగ్రహయుతేక్షితే
పుత్రమిత్రకళత్రాణాం నాశనం మహదాపదం
రాజ్ఞాచోరేణవావిత్తం హ్రీయతే బంధునాశనం
విశేషరోగపీడాచ శిరోక్షి గుదపీడనం
ఉద్యోగభంగం చలనమకస్మాత్కలహంతథా

రాహువులో కేతుభుక్తియందు కేతువు అష్టమమందుగాని వ్యయమందుగాని ధనసప్తమస్థానములయందుగాని ఉండి పాపగ్రహములతో కలిసినను చూడబడినను సంతానవిచారము మిత్రనష్టము కళత్రపీడ గొప్పఆపత్తు రాజులవల్లనుంచిగాని దొంగలవల్లనుంచిగాని ధననాశనము బంధునష్టము వ్యాధియు శిరోరోగము నేత్రరోగము మూలవ్యాధి ఉద్యో

గభంగము స్థానచలనము అకస్మాత్తుగా కలహము యివి గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టె విషమజ్వరసంభవః
రాజపీడా స్థాననాశం బుద్ధివిభ్రమకారణం
శశినాసంయుతేదృష్టె మనస్తాపం భవిష్యతి
నీచానాం కలహంచ్చైవ విధవాకలహంతథా॥

రవియొక్క సంబంధవీక్షణములవలన విషమజ్వరబాధ రాజులవలన భయము స్థానభ్రష్టత్వము బుద్ధిచాంచల్యము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మనోవ్యాకులత కలహము విధవస్త్రీతో కలహము యివిగలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టె గృహిణ్యాఃక్షయసంభవః
అపస్మారజనత్కష్టం దాయాదిజనపీడనం
బుధేనసంయుతే దృష్టే మాతులాది వినాశనం
బాంధవాదివిరోధంచ మిత్రప్రభు విరోధకృత్॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన భార్యావియోగము అపస్మారవ్యాధి జనులవలన కష్టము జ్ఞాతివిరోధము గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన మేనమామలయొక్క నష్టము బంధువిరోధము మిత్రప్రభువిరోధము యివిగలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే పుత్రదారాదిపీడనం
ధననాశం దేహపీడా బ్రాహ్మణాద్భయమాప్నుయాత్
శుక్రేణసంయుతేదృష్టే స్వస్త్రీవ్యాధిభయంతథా
స్త్రీమూలాత్కలహంచైవ వస్త్రనాశం ధనక్షయం

గురునియొక్క సంబంధవీక్షణములవలన ధననాశనము దారాపుత్రాదిపీడ దేహపీడ బ్రాహ్మణులవల్లనుంచి భయము గలుగును.

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన తనయొక్క భార్యవలనభయము స్త్రీలతోకలహముధనవ్యయముగలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే స్త్రీపుత్రాదివినాశనం
సమానజనకోపంచనీచసేవామహద్భయం॥

శనియొక్క సంబంధవీక్షణములవలన స్త్రీపుత్రనాశనము సమానజనునియొక్క కష్టము నీచసేవవిశేషభయముగలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థేఅపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థంనాగదానంచకారయేత్ ॥

ద్వితీయసప్తమములయందు కేతువున్నయెడల అపమృత్యుభయముగలుగును. అట్టిదోషము పోవుటకై నాగదానము నుచేసిన సౌఖ్యముగలుగును.

రాహుదశలోశుక్రభుక్తి మా 36

శ్లో॥ రాహోరంతర్గతేశుక్రే కేంద్రలాభత్రికోణగే
భూలాభఃపుత్రలాభశ్చగృహేకళ్యాణవైభవం

విశేషోద్యోగమాప్నోతితస్మాద్వాహనవైభవం
గోమహిష్యాదివృద్ధిశ్చధనధాన్యాభివర్ధనం॥

రాహుదశలో శుక్రభుక్తియందు శుక్రుడు కేంద్రమందుగాని కోణమందుగాని లాభమందుగాని బలముగానున్న యెడల గృహమందు శుభకార్యములు జరుగుటయు పుత్రలాభము ధనధాన్యాభివృద్ధియు భూలాభము పశులాభము గొప్పఉద్యోగప్రాప్తియుగలుగును.

శ్లో॥ రాహోరంతర్గతేశుక్రేనీచేషష్ఠాష్టరిప్ఫగే
అనారోగ్యమపుర్యాదంస్రుపచోరాగ్నిపీడనం
ఉద్యోగభంగంక్లేశంచదారాపుత్రవినాశనం
ఋణవృద్ధిర్విశేషంచశత్రురోగవివర్ధనం

రాహువులో శుక్రుడు నీచయందుగాని లగ్నములగాయతుగాని రాహువు లగాయతుగాని షష్ఠాష్టవ్యయస్థానములయందున్నను యీశుక్రాంతర్దశలో అనారోగ్యము అమర్యాదయున్ను రాజులవల్లను చోరులవల్లను అగ్నివల్లను బాధయు ఉద్యోగభంగము దుఃఖము కళత్రపుత్రవిచారము విశేషముగా శత్రువృద్ధి ఋణవృద్ధి రోగవృద్ధి గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టేశ్రీమూలాద్ధననాశనం
స్వపరిభోస్తువిరోధశ్చసర్వత్రకలహంతథా
శశినాసంయుతేదృష్టేనిత్యంసూపాన్నభోజనం
మాతృవంశవివృద్ధిశ్చయుద్ధేశత్రువినాశనం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన స్త్రీమూలకము గా ధనవ్యయము తనప్రభువువలన విరోధము సమస్తజనుల తోకలహము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన యెల్లప్పుడు సూపాన్నభోజనము మాతృవంశవృద్ధి యుద్ధమందుజయము గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే వాదశాస్త్రాదిచింతనం
మహాప్రభువిరోధశ్చయత్నకార్యవినాశనం
బుధేనసంయుతేదృష్టే వేదశాస్త్రాదిచింతనం
అతీవసౌఖ్యంకళ్యాణంబంధూనాంహితకారకం॥

కుజునియొక్కసంబంధవీక్షణములవలన శాస్త్రవాదచింతన రాజవిరోధము యత్నకార్య నాశనము గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన వేదశాస్త్రాది విచారణ స్త్రీసౌఖ్యము కళ్యాణము బంధూపకారము యివి గలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టేసుతజనోత్సవంతథా
గృహేకళ్యాణసంపత్తిః దేహారోగ్యంమహత్సుఖం
శనినాసంయుతేదృష్టేదాసదాసీవిరోధకృత్
మిత్రప్రభువిరోధశ్చ దేశాద్దేశాంతరంయయుః

గురునియొక్క సంబంధవీక్షణమువలన పుత్రోత్సవము గృహమందు శుభకార్యములు జరుగుటయు శరీరసౌఖ్యముమహా సుఖముగలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన దాసదాసీజనులతో విరోధము మిత్రవిరోధము అనేకదేశములను తిరుగుటగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాతృతీయేలాభగేపివా
శుభగ్రహాయుతేవాపిఆరామక్షేత్రవృద్ధిసం
ప్రియవస్తుషుసంప్రాప్తిఃవారస్త్రీసంగమంతధా
స్వగృహేధాన్యవృద్ధిశ్చహేమరత్నాదిసంగ్రహం॥

దశానాథుని లగాయతు శుక్రుడు కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహయుతుడై యున్నయెడల తోటలు భూములు వీనియొక్క సంపాదనతోను ఇష్టవస్తువులభించుటయు జారకాంతాసంభోగము ధాన్యవృద్ధి బంగారమురత్నములు మొదలగువానిసంపాదన యివిగలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనాధేవా అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థందుర్గాదానంజపంచరేత్
పయస్వినీంచగాందద్యాత్సర్వారిష్టవినాశనం॥

ద్వితీయసప్తమములయందు శుక్రుడున్నయెడల అపమృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై దుర్గాప్రతిమదానమును జపమును చేసి బాగుగా పాలనిచ్చుగోవును దానముచేసినయెడల అన్నిదోషములును నశించును.

రాహుదశలో రవిభుక్తి మా 10 రో 24

శ్లో॥ రాహోరంతర్గతేభానౌ కేంద్రలాభత్రికోణగే
దారాపుత్రాదిసౌఖ్యంచ రాజమూలాద్ధనాగమం

కరోతివిపులంరాజ్యం కీర్తిమాచంద్రతారకం
విద్యాలాభంన్నపాత్ప్రీతిం వస్త్రవాహనభూషణం

రాహుమహాదశలో రవ్యంతర్దశయందు రవి కేంద్రకోణములయందుగానిలాభమందుగాని యున్న యెడల దారాపుత్రాది సౌఖ్యము రాజమూలకముగా ధనలాభము రాజానుగ్రహము వస్త్రవాహనాలంకారప్రాప్తియును గలుగును.

శ్లో॥ రాహోరంతర్గతేభానో నీచేరిష్ఫేచరంధ్రగే
రాహోశ్చైవంచాష్టమేవా షష్ఠేవావ్యయగేపివా
ఉష్ణజ్వరాతిసంతాప శ్శిరోభ్రమణమేవచ
భయంజనవిరోధశ్చ నేత్రరోగంమహద్భయం
స్థానచ్యుతింప్రవాసంచ గురుపిత్రాదినాశనం
శత్రువృద్ధిర్విశేషంచ శత్రుమూలాద్ధనవ్యయం॥

రాహువులో రవి నీచయందుగాని లగ్నములగాయతుగాని దశానాథునిలగాయతుగాని షష్ఠాష్టవ్యయ స్థానములయందున్నను ఉష్ణజ్వరమువలన సంతాపము శిరోభ్రమణ భయము జనవిరోధము నేత్రరోగము మహాభయము స్థానభ్రష్టత్వము పరదేశనివాసము గురునాశము పితృనాశము విశేష శత్రువృద్ధియు వారివలనధననష్టము గలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే అన్నదానపరోభవేత్
సమానప్రభుసన్మానం వస్త్రాభరణవృద్ధిదం
కుజేనసంయుతేదృష్టే పరస్త్రీకలహంతథా
విషశస్త్రాగ్ని బాధాచ సహోదరవినాశనం॥

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన అన్నదాన పరుఁడును సమానప్రభువుయొక్క అనుగ్రహము వస్త్రాభరణ వృద్ధిగలుగును.

కుజునియొక్క సంబంధవీక్షణములవలన యితరస్త్రీల శోకలహము విషమువల్లను శస్త్రమువల్లను అగ్నివల్లను బాధ యున్నా సోదరనష్టము గలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే హేమవస్త్రవిభూషణం
బంధూపకారంసతతం పశుధాన్యాదివృద్ధిదం
గురుణాసంయుతేదృష్టే వేదశాస్త్రాదిసంగ్రహం
యజ్ఞదీక్షాపరిసంగశ్చ గురుదేవద్విజార్చనం॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన బంగారము వస్త్రములు అలంకారములు బంధూపకారము పశువులు ధాన్యము మొదలగునవిగలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన వేదశాస్త్రాది సంగ్రహము యజ్ఞదీక్ష పరిసంగము గురుదేవద్విజులయొక్క పూజ యివిగలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే మణిమాణిక్యసంగ్రహః
అపూర్వవస్తుసంప్రాప్తిః మిత్రప్రభువశాత్సుఖం॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన మణులుమాణిక్యములు మొదలగువానియొక్క సంపాదన అపూర్వవస్తు సంపాదన మిత్రప్రభువువల్లనుంచి సౌఖ్యముయివిగలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే దాసీదాసాదిసంగ్రహః
క్షేత్రార్థపశునాశస్య నీచసేవాభవిష్యతి॥

శనియొక్క సంబంధవీక్షణములవలన దాసీదాసాది భూనాశనము పశునాశనము నీచసేవ యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిత్కేలాభగేపివా
శుభగ్రహాయుతేవాపి ధనలాభముదీరయేత్
మహారాజప్రసాదేన వాహనాదిలభేద్ధ్రువం
విద్యావినోదవిజయం కీర్తిలబ్ధంసుఖావహం
పితృవర్గవివృద్ధిశ్చ ప్రభావబలవర్ధనం
వస్త్రాద్యాయుధసంప్రాప్తిః అధికారాదిలబ్ధవాన్॥

దశానాథునిలగాయతు రవి కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహ యుక్తుడై యున్నయెడల ధనలాభము గలుగును. మహారాజానుగ్రహము వల్లనుంచి వాహనప్రాప్తి విద్యాకౌశల్యము విజయము కీర్తి సౌఖ్యము గలుగును. పితృవర్గవృద్ధి ప్రభావము బలము వస్త్రములు ఆయుధములు యివిగలుగుట అధికారప్రాప్తి మొదలగు మంచిఫలములు గలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం సూర్యప్రార్థనమాచరేత్
తిలపద్మప్రదానేన సర్వారిష్టవినాశనం

ద్వితీయసప్తమములయందు రవియున్నయెడల మృత్యు

భయముగలుగును. అట్టిదోషముపోవుటకై సూర్యప్రార్థనయు తిలపద్మదానములును చేసినయెడల సర్వారిష్టములు హరించును.

రాహుదశలో చంద్రభుక్తి మా 18

శ్లో॥ రాహోరంతర్గతేచంద్రే స్వోచ్ఛకేంద్రత్రికోణగే
జలయానధనాప్తిశ్చ క్షేత్రవాహనసంభవః
కళత్రపుత్రసంపత్తిం రాజ్యశ్రీధనసంపదః
స్వకర్మనిరతంశాంతం దానధర్మపరాయణం॥

రాహువులో చంద్రుడు స్వోచ్ఛయందుగాని కేంద్రకోణములయందుగాని యున్నయెడల జలముమీాద ప్రయాణమువల్లనుంచి ధనలాభము క్షేత్రవృద్ధి వాహనసౌఖ్యము కళత్రసౌఖ్యము సంతానవృద్ధి రాజ్యలాభము స్వకులోచితకర్మచేయుటయు శాంతము దానధర్మములు చేయుటయు మొదలగుశుభములు గలుగును.

శ్లో॥ రాహోరంతర్గతేచంద్రే నీచేషష్ఠాష్టరిష్ఫగే
రాహోశ్చైవంచాష్టమేవా షష్ఠేవావ్యయగేపివా
కృషినాశంఋణగ్రస్తం వ్యాపారేణధనవ్యయం
దారాపుత్రాదిపీడాచ కృషిగోభూమినాశనం॥

రాహువులో చంద్రాంతర్దశయందు చంద్రుడు నీచయందుగాని లగ్నాదిగాని దశానాథుని లగాయతుగాని షష్ఠాష్టవ్యయములయందున్నయెడల వ్యవసాయనష్టము ఋణవృద్ధి

వర్తకనష్టము దారాపుత్రులకు శరీరపీడ భూనాశనము పశునష్ట
ము మొదలగునవి గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే నృపాన్నాశం భవిష్యతి
తాపజ్వరాగ్నిసంప్రాప్తిః స్థాననాశం మనోవ్యథా
కుజేనసంయుతేదృష్టే శస్త్రఘాతాదిపీడనం
సమానజనశోకశ్చ అపమృత్యుభయంతథా॥

రవియొక్క సంబంధవీక్షణములవలన రాజులవలన
భయము తాపజ్వరము అగ్నిభయము స్థానభ్రష్టత్వము
మనోవ్యాకులత యివిగలుగును.

కుజునియొక్క సంబంధవీక్షణములవలన శస్త్రములవల్ల
నుంచి దెబ్బతగులుటవలన బాధయున్ను సమానజనునియొక్క
విచారము అపమృత్యుభయము గలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే విద్యాకీర్తిజయప్రదం
ప్రియవస్తుషులాభశ్చ యత్నకార్యసుసిద్ధిదం
గురుణాసంయుతేదృష్టే పుత్రస్త్రీభాగ్యసంపదః
గజగోవాజిలాభశ్చ వస్త్రాభరణసంగ్రహం॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన విద్యకీర్తి
జయము ప్రియవస్తులాభము యత్నకార్యసిద్ధి యివిగలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన మంచిగుణము
లుకల భార్యయు మంచికుమారులు భాగ్యము సంపదలు గలు
గుటయు ఏనుగులు గుఱ్ఱములు ఆవులు విశేషముగా నుండు

టయు వస్త్రంబులు ఆభరణములు లభించుట మొదలగునవి గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే స్త్రీసౌఖ్యంబంధువైభవం
మిత్రప్రభువశాదిష్టం యత్నకార్యార్థసిద్ధిదం
శనినాసంయుతేదృష్టే గోమహిష్యాదినాశనం
ఇష్టప్రభువిరోధశ్చ నానామూలాద్ధనవ్యయం॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన స్త్రీసౌఖ్యము బంధుసౌఖ్యము మిత్రప్రభువువల్లనుంచి కార్యసిద్ధిగలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన పశునష్టము ఇష్టప్రభువుతో విరోధము ధనవ్యయము గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాతృతీయే లాభగేపివా
శుభగ్రహయుతేవాపి హేమవస్త్రాదిసంగ్రహః
విచిత్రవస్త్రలాభశ్చ నానామూలాద్ధనాగమః

దశానాథునిలగాయతు చంద్రుడు కేంద్రకోణముల యందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహములతో గూడియున్నయెడల బంగారము మంచివస్త్రములు మొదలగు వాని సంపాదనయు చిత్రమైన వస్త్రములు అనేకవిధములుగా ధనసంపాదనయు గలుగును.

శ్లో॥ ద్వితీయ ద్యూనసనాథేవా అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం మృత్యుంజయజపంచరేత్
వహ్నిదానం చకుర్వీత ఇష్టసిద్ధిర్భవిష్యతి॥

ద్వితీయసప్తమములయందు చంద్రుడున్నయెడల మృత్యుభయముగలుగును. అట్టిదోషము పోవుటకై మృత్యుంజయార్చనయు వహ్నిదానమును చేసినయెడల సౌఖ్యము గలుగును.

రాహుదశలో కుజభుక్తి మా॥ 12 రో 18

శ్లో॥ రాహోరంతర్గతే భౌమేస్వోచ్చే లాభత్రికోణగే
షష్ఠస్థానే తృతీయేవా శుభగ్రహయుతేక్షితే
రాజపూజ్యంసుతావాప్తి ర్విద్యావాహన భూషణం
భూలాభంధనలాభంచ రాజానుగ్రహకాంక్షయా
భోజనాంబరసౌఖ్యంచ కృషిమూలాద్ధనాగమం॥

రాహుదశలో కుజభుక్తియందు కుజుడు ఉచ్చయందుగాని లాభమందుగాని కోణములయందుగాని శుభగ్రహసంబంధవీక్షణములు గలిగినయెడల రాజపూజ్యతయు పుత్రసంతానలాభము విద్యాభివృద్ధి వాహనసౌఖ్యము అలంకారప్రాప్తి భోజనసౌఖ్యము వస్త్రలాభము వ్యవసాయమువలన ధనలాభము గలుగును.

శ్లో॥ రాహోరంతర్గతే భౌమేనీచేషష్ఠాష్టరిఃఫగే
రాహోశ్చైవంచాష్టమేవా షష్ఠేవావ్యయగేపివా
గృహక్షేత్రవినాశంచ నృపచోరాగ్నిపీడనం
మనోవైకల్య మాప్నోతి భ్రాతృవర్గవినాశనం
శత్రువృద్ధిర్విశేషం చరాజమూలాచ్చ బంధనం

స్ఫోటకక్షయపీడాచ శరీరే రోగపీడనం
కళత్రపుత్రపీడాచ కారాగృహనివేశనం॥

రాహువులో కుజుడు నీచయందుగాని లగ్నములగా యతుగాని దశానాథుని లగాయతుగాని షష్ఠాష్టవ్యయముల యందు పాపసంబంధము గలిగియున్నయెడల గృహక్షేత్ర నాశనము అగ్నివల్లను రాజులవల్లను భయము మనోవికలత్వ ము సోదరనష్టము స్ఫోటకక్షయబాధయున్ను విశేషశరీరపీ డయున్ను శత్రుపీడయు రాజులవలన బంధనము కారాగృహ ప్రాప్తి కళత్రపుత్రవిచారము మొదలగు చెడుఫలములు కుజాంతర్దశలో గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే తాపజ్వర భయంతథా
యుద్ధేశత్రుభయంచైవ సమానజననాశనం
శశినాసంయుతేదృష్టే మహాప్రభువశాత్సుఖం
కళ్యాణాదిశుభప్రాప్తిః క్షేత్రవృద్ధిర్భవిష్యతి॥

రవియొక్క సంబంధవీక్షణములవలన తాపజ్వరబాధ యుద్ధమందు శత్రుభయము సమానజననాశనము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన గొప్పరాజు లవల్లనుంచి సౌఖ్యము కళ్యాణాదిశుభములు భూసంపాదన గలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే మాతులాదివినాశనం
వ్యవహారేచభయంచైవ బంధూనాంచ ప్రియంతథా

గురుణాసంయుతేదృష్టే పుత్రనాశం ధనక్షయం
నిస్సత్వం కాంతిహీనశ్చ సర్వకార్య వినాశనం॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన మేనమామలు నశించుట వ్యవహారనష్టము బంధుప్రియము గలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రనాశనము ధననాశనము నిస్సత్తువ కాంతిహీనము సర్వకార్యనాశనము గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే అశ్వాందోళాదిలబ్ధవాన్
పుత్రదారాదిసౌఖ్యంచ గృహేకళ్యాణమేవచ
శనినాసంయుతేదృష్టే పశుక్షేత్రవినాశనం
సమానజననాశశ్చ చతుష్పాజ్జీవనాశనం॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన అశ్వములు వాహనములు పల్లకీమొదలగువాని సంపాదన పుత్రసౌఖ్యము కళత్రసౌఖ్యము గృహమందు కళ్యాణవైభవము గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన పశువులు భూమి మొదలగువాని నాశనము సమానమనుజునియొక్క నాశనము గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాదుశ్చిత్కేలాభగేపివా
పశువృద్ధిర్ధాన్యవృద్ధిరశ్వాద్యారోహణంతథా
పుత్రీపుత్రవివృద్ధిశ్చ చతుష్పాజ్జీవలాభకృత్
సువస్త్రాభరణసంప్రాప్తి స్సుకీర్తివిజయంతథా॥

దశానాథునిలగాయతు కుజుడు కేంద్రకోణములయం
దుగాని తృతీయమందుగాని యున్నయెడల పశువృద్ధి ధాన్యవృ
ద్ధిగుర్రములనెక్కి సంచరించుట స్త్రీపుత్రసంతానవృద్ధి పశులా
భము యివిగలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం సుబ్రహ్మణ్యంచ పూజయేత్
నాగదానం ప్రకుర్వీత సర్వారిష్టవినాశనం॥

ద్వితీయసప్తమములయందు కుజుడున్నయెడల మృత్యు
భయము గలుగును. అట్టిదోషము పోవుటకై సుబ్రహ్మణ్య
పూజయు నాగప్రతిమాదానమును చేసినయెడల సౌఖ్యము
గలుగును.

గురుమహాదశలో గురుభుక్తి మా 26 రో 18

శ్లో॥ జీవస్యాంతర్గతే జీవే కేంద్ర లాభత్రికోణగే
స్వోచ్చేద్వితీయరాశిస్థే శుభగ్రహయుతేక్షితే
రాజ్యలాభం మనోత్సాహం వస్త్రవాహనభూషణం
విదేశయానాదర్థాప్తిం యశోవిద్యాజయంసుఖం
దారాపుత్రాది సౌఖ్యంచ రాజసన్మానవైభవం॥

గురుమహాదశలో గురుభుక్తియందు గురుడు కేంద్రకో
ణములయందుగాని లాభమందుగాని ఉచ్ఛయందుగాని ద్వితీ
యమందుగాని శుభగ్రహయుక్తుడై యున్నయెడల రాజ్యలా
భము మహోత్సవము వస్త్రములు వాహనములు అలంకార

ములు మొదలగువాని సంపాదనయు విదేశగమనమువలన ధన సంపాదనయు యశోవృద్ధి విద్యయందు జయము సౌఖ్యము దారాపుత్రాదిసౌఖ్యము రాజసన్మానము గలుగును.

శ్లో॥ గురోరంతర్గతే జీవేనీచే షష్ఠాష్టరిఫ్ఫగే
కరోతిదుఃఖబాహుళ్యం రాజ్ఞాంహృతధనంతథా
ఉద్యోగభంగం దుఃఖంచ ధనధాన్య వినాశనం
కుటుంబకలహంచైవ దారాపుత్రాదిపీడనం॥

గురుదశలో గురుభుక్తియందు గురుడు నీచయందుగాని షష్ఠాష్టవ్యయములయందుగాని దుర్బలుడై యున్న యెడల విశేషదుఃఖము రాజులవలన ధననష్టము ఉద్యోగభంగము ధనధాన్యనాశనము కుటుంబకలహము దారాపుత్రాదులకు శరీరపీడ యున్ను గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే రాజవిద్వేషమేవచ
కలహాయాసదుఃఖంచ స్థాననాశం తథైవచ
చంద్రేణసంయుతేదృష్టే గజాశ్వాంబరలబ్ధవాన్
మాతృవంశవివృద్ధిశ్చ ఇష్టప్రభువశాత్సుఖం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన రాజవిరోధము కలహము ఆయాసము స్థాననాశనము గలుగును. చంద్రుని యొక్క సంబంధవీక్షణములవలన యేనుగులు గుఱ్ఱములు మంచివస్త్రములు మాతృవంశవృద్ధి ఇష్టప్రభువువల్లనుంచి సౌఖ్యము గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే శత్రువృద్ధిర్ధనక్షయః
యుద్ధేప్యపజయశ్చైవ జ్ఞాతీనాం కలహ స్తథా
బుధేనసంయుతేదృష్టే విద్యాభ్యాసాది సంగ్రహః
బంధూనాముపకారశ్చ యత్నకార్యార్థసిద్ధిదః॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన శత్రువృద్ధి ధనక్షయము యుద్ధమందు అపజయము జ్ఞాతులతో విరోధము గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన విద్యాభ్యాసము బంధూపకారము యత్నకార్యసఫలము గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే దారాపుత్రాది సౌఖ్యదం
మణివస్త్రాదిలాభశ్చ గృహేకళ్యాణ శోభనం
శశినాసంయుతేదృష్టే నానామూలాద్ధనవ్యయః
స్వభృత్యకలహశ్చైవ గురుపుత్రాదినాశనం॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన కళత్రసౌఖ్యము పుత్రసౌఖ్యము మణివస్త్రాదిలాభము గృహమందు కళ్యాణవైభవము గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన అనేకవిధములుగా ధననాశనము సేవకులతో విరోధము గురుపుత్రాదినాశనము గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భయంతథా
సువర్ణప్రతిమాదానం కుర్యాచ్ఛాంతిమవాప్నుయాత్॥

ద్వితీయసప్తమములయందు గురుడున్న యెడల అపమృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై శ్రీరుద్రజపమును సువర్ణప్రతిమాదానమును చేయవలెను.

గురుదశలో శనిభుక్తి మా 30 రో 12

శ్లో॥ జీవస్యాంతర్గతే మందే లగ్నాత్కేంద్ర త్రికోణగే
తృతీయే లాభగేవాపి ఉచ్చరాశిస్థితేపివా
తద్భుక్తౌకార్యసిద్ధిశ్చ మహారాజాశ్రయ స్తథా
కృషిపశ్వాదివృద్ధిశ్చ క్షేత్రధాన్యాది సంగ్రహః
నీలవస్త్రానిలాభశ్చ శూద్రప్రభువ శాత్సుఖం
పుత్రబంధువివృద్ధిశ్చ వాహనాది సులబ్ధకృత్
భుక్తంతేస్థానచలనం స్వజనేకలహ స్తదా
ఏవంఫలం పంచమాసాత్పరం సౌఖ్యకరంశుభం
స్త్రీసౌఖ్యం విజయశ్చైవ యత్నకార్యాణి సిద్ధినః॥

గురుదశలో శని భుక్తియందు శనిలగ్నములగాయతు కేంద్రకోణములయందుగాని తృతీయ లాభములయందుగాని ఉచ్చయందుగానియున్న యెడలకార్యానుకూలము భూలాభము మహారాజానుగ్రహము వ్యవసాయలాభము పశువృద్ధి ధాన్య లాభము నల్లనివస్తుసంపాదన శూద్రప్రభువల్లనుంచి సౌఖ్యము పుత్రలాభము బంధులాభము వాహనసౌఖ్యము గలుగును. యీభుక్తియొక్క అంత్యమందు స్థానచలనము స్వజనవిరోధ

ము అయిదుమాసములవరకు గలుగును. తర్వాత సౌఖ్యము శుభము స్త్రీసౌఖ్యము విజయము యత్నకార్య సిద్ధి గలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్ట మేవాపివ్యయేవా నీచరాశిగే
స్వస్త్రీవియోగం కలహం సుతబంధువినాశనం
ధాన్యాధిపశునాశశ్చ సర్వత్రకలహ స్తథా
స్వప్రభో స్స్వపమృత్యుశ్చ శూద్రస్త్రీకలహ స్తథా
దుష్కీర్తిమానభంగంచ నీచసేవాభవిష్యతి
వాహనాదివినాశశ్చ అర్థనాశ స్తథైవచ॥

లగ్నషష్ఠాష్టవ్యయములయందుగాని నీచయందుగాని శనియున్నయెడల భార్యావియోగము కలహము పుత్రనాశనము బంధునాశనము ధాన్యనాశనము పశునాశనము సకలజనులతో కలహము తనయొక్క ప్రభువువల్లనుంచి మరణభయము శూద్రస్త్రీతో కలహము దుష్కీర్తి మానభంగము నీచసేవ వాహననష్టము ధనవ్యయము యివిగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే శిరోరోగ స్తథైవచ
అధికార వినాశశ్చ స్వసృపాద్ధననాశనం
శశినాసంయుతేదృష్టే వాతరోగాదిపీడనం
మాతృవంశవినాశశ్చ పుత్రనాశ స్తథైవచ॥

రవియొక్క సంబంధవీక్షణములవలన శిరోరోగము ఉద్యోగభంగము రాజులవల్లనుంచి ధనవ్యయము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన వాతరోగ

ము మొదలగువానివలన బాధయు తల్లియొక్క వంశమునకు నష్టము పుత్రమరణము గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే యాత్రాయాంయుద్ధమాప్నుయాత్
బుధేనసంయుతేదృష్టే ఇష్టమిత్రసమాగమః
ఆలేఖ్యగృహవాసశ్చ గాయకాది సమాగమః

కుజునియొక్క సంబంధవీక్షణములవలన యాత్రయందు యుద్ధము గలుగుట యివిగలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన ఇష్టబంధువులు స్నేహితులు మొదలగువారి దర్శనము చిత్రములు వ్రాయబడిన గృహమందు వాసస్థానము గాయకాదిసమాగమము యివిగలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే పుత్రశోకోభవిష్యతి
దేహాయాసోస్థాననాశః మతిభ్రంశస్తథైవచ
శుక్రేణసంయుతేదృష్టే స్త్రీసౌఖ్యం యాగలాభకృత్
మహారాజాశ్రయప్రాప్తిః ఇష్టసిద్ధిర్భవిష్యతి॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రశోకము శరీరాయాసము స్థానభ్రష్టత్వము మతిభ్రమణము గలుగును.

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన స్త్రీసౌఖ్యము యాగాదిక్రతులాభము రాజసన్మానముఇష్టకార్యసిద్ధి గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాదుశ్చిక్యేలాభగేపివా
శుభగ్రహాయుతేవాపి ధనలాభము దీరయేత్

స్వస్త్రీసౌఖ్యం సుతప్రాప్తిః హేమవస్త్రాదిలాభకృత్
శూద్రప్రభువశాత్సౌఖ్యంయుద్ధేశత్రువినాశనం॥

దశానాథునిలగాయతు శని కేంద్రకోణములయందు గాని తృతీయలాభములయందుగాని శుభగ్రహయుతుఁడై యున్నయెడల ధనలాభము కళత్రసౌఖ్యము సంతానప్రాప్తి బంగారము వస్త్రములు మొదలగు వానిసంపాదన శూద్రప్రభువల్లనుంచి సౌఖ్యము యుద్ధమునందు శత్రునాశనము యివి గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రే వా వ్యయే వా పాపసంయుతే
నీచారికలహాశ్చైవ బంధుపీడాతథైవచ
స్త్రీపుత్రకలహాశ్చైవ నృపమూలాద్ధనవ్యయః॥

దశానాథుని లగాయతు శని షష్ఠాష్టవ్యయములయందు పాపసంబంధము గలిగియున్నయెడల నీచులతోను శత్రువులతోను కలహము బంధుపీడ స్త్రీలతోను పుత్రులతోను కలహము రాజులవల్లనుంచి భయము కార్యనాశనము అనేకవిధములగా ధనవ్యయము గలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం దానంకృష్ణమృగంతథా
మృత్యుసూక్తంపఠేద్యస్తు అపమృత్యు నివారణం॥

ద్వితీయసప్తమములయందు శనియున్నయెడల మృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై నల్లనిమృగదా-

సమున మృత్యుసూక్తపఠనము చేసినయెడల ఆరోగ్యము గలుగును.

గురుదశలో బుధభుక్తి మా 27 రో 6

శ్లో॥ గురోరంతర్గతే సౌమ్యే స్వోచ్చే కేంద్రత్రికోణగే
కుసుమశయనవస్త్రా లంకృతిః క్షేత్రలాభః
స్వజనసుఖముదారం గేహకళ్యాణవృద్ధిః
వివిధకుశలవిద్యా వైభవంవాగ్విలాసో
గణితకృషిఫలాప్తిర్వైశ్య విత్తాప్తిభోగః
బహుపరిజనయోగో వాహనం గౌరవానాం॥

గురుమహాదశలో బుధుడు ఉచ్చయందుగాని కేంద్ర త్రికోణములయందుగాని బలముగానున్న యెడల కుసుమశయనము వస్త్రాలంకారము భూలాభము కుటుంబసౌఖ్యము ఔదార్యము కుటుంబమందు శుభకార్యవృద్ధి సమస్తవిద్యలయందు నేర్పరితనము గణితమువల్లను వ్యవసాయమువల్లను ధనలాభము వైశ్యులయొక్క ధనమువలన భోగము అనేకమంది జనులతో స్నేహము వాహనము గౌరవము గలుగును.

శ్లో॥ గురోరంతర్గతే సౌమ్యే నీచేషష్ఠాష్టరిష్ఫగే
గురోస్తథైవాషష్ఠేవా నీచేవాష్టమసంస్థితే
ఉత్సాహభంగంగోభూమి హిరణ్యాంబరనాశనం
స్థానచ్యుతింమహాద్వేషం విద్యానాశంలభేత్సదా
కృషివాణిజ్యనాశంచ బంధునాశమథాపివా
స్వబంధుమరణంక్లేశం భృత్యస్త్రీపుత్రపీడనం॥

బుధుడు లగ్నమునకుగాయుతుగాని గురునికిగాయుతుగాని షష్ఠాష్టమ వ్యయములయందుగాని నీచయందుగాని వున్నయెడల ఉత్సాహభంగము పశునాశనము భూనాశనము సువర్ణములు వస్త్రములు వీనియొక్క నాశనము స్థానచలనముగొప్ప వైరము విద్యానాశనము వ్యవసాయము నర్తకము బంధువులు వీర్యనాశనము ముఖ్యబంధువునియొక్క మరణము దుఃఖము సేవకులు స్త్రీలు పుత్రులు వీరియొక్క నాశనమును గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే బంధునసమ్మానమేవచ
దేశాంతరాదిగమనం శిరోరోగం మహాభయం
చంద్రేణసంయుతేదృష్టే మనోల్లాసంమహత్సుఖం
వస్త్రాభరణసంప్రాప్తి ర్యత్నకార్యార్థసిద్ధిదః
కుజేనసంయుతేదృష్టే శస్త్రఘాతభవిష్యతి
యుద్ధేష్వపజయశ్చైవ మృష్టాన్నభోజనం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన బంధువులవలన గౌరవము దేశాంతరమునకు పోవుట శిరోరోగము గొప్ప భయము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మనోల్లాసము విశేషసౌఖ్యము వస్త్రాభరణసంప్రాప్తి యత్నకార్య సిద్ధిగలుగును.

కుజునియొక్క సంబంధవీక్షణములవలన శస్త్రఘాత యుద్ధమందు అపజయము భోజనసౌఖ్యములేకపోవుటగలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే వేదశాస్త్రాదిచింతనం
యజ్ఞదీక్షాప్రసంగశ్చ శివకేశవచింతనం
శుక్రేణసంయుతేదృష్టే కావ్యాలంకారసంగ్రహః
వాహనాదివివృద్ధిశ్చ వారస్త్రీసంగమ స్తథా॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన వేదశాస్త్రాది పఠనము యజ్ఞదీక్ష శివకేశవులయొక్క స్మరణయుఁగలుగును.

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన కావ్యాలంకారపఠనము వాహనసౌఖ్యము వారస్త్రీసంగమముగలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే పశుదాసవినాశనం
క్షేత్రధాన్య వినాశశ్చ యత్నకార్యవినాశనం

శనియొక్క సంబంధవీక్షణముల వలన పశువులు సేవకులు వీనియొక్కనాశనము భూమి ధాన్యము వీనినాశనము కార్యభంగము యుఁగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాత్రుతీయేలాభగేపివా
శుభగ్రహాయుతేవాపివిత్తలాభముదీరయేత్
సర్వకార్యసుసిద్ధిస్స్యాద్బంధవానాంప్రియంతథా
దారాపుత్రాదిసౌఖ్యంచకృషివృద్ధిర్భవిష్యతి॥

దశానాధుని లగ్నాయతుబుధుసు కేంద్రకోణములయందుగాని తృతీయలాభముల యందుగాని శుభగ్రహయుక్తుఁడైయున్నయెడల ధనలాభము సర్వకార్యసిద్ధి బంధుప్రియము దారాపుత్రసౌఖ్యము వ్యవసాయవృద్ధి గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవాఅపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థంమకరందానముచ్యతే॥

ద్వితీయసప్తమస్థానములయందు బుధుడున్నయెడలఅ పమృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై మొసలిదానమును చేయవలెను.

గురుదశలో కేతుభుక్తిమా 11 రో 6

శ్లో॥ గురోరంతర్గతేకేతౌషష్ఠలాభతృతీయగే
కృషిగోభూమిలాభంచవిద్యాబంధుసమాగమం
భోజనాంబరసౌఖ్యంచస్వబంధుజనపూజ్యతాం
దారాపుత్రాదిసౌఖ్యంచపుణ్యకర్మవివర్ధనం॥

గురుమహాదశలో కేతువు తృతీయలాభములయందు గాని షష్ఠమమందుగాని వున్నయెడల వ్యవసాయము పశువులు భూమి విద్య బంధువులు వీనియొక్క సౌఖ్యము భోజనసౌఖ్యము వస్త్రసౌఖ్యము తనయొక్క బంధువులవలన పూజ్యతకళత్రసౌఖ్యము పుత్రసౌఖ్యము పుణ్యకర్మలుచేయుట యివి గలుగును.

శ్లో॥ గురోరంతర్గతేకేతౌవ్యయేవాష్టమసంస్థితే
స్థానచ్యుతింప్రవాసంచరాజపీడాక్షినాశనం
గురోర్విపదందుఃఖంచశుభకర్మవినాశనం
ఋణవృద్ధిర్విశేషంచధర్మమూలాద్ధనవ్యయం

గురునిలో కేతువు అష్టమమందుగాని వ్యయస్థానమం

డుగాని యున్నయెడల యీభుక్తియందు స్థానభ్రష్టత్వము పర దేశనివాసము రాజులవలనబాధ నేత్రరోగము గురునివలన ఆపత్తు, పుణ్యకార్యవిఘ్నము ధర్మమూలకముగాధనవ్యయము ఋణవృద్ధి గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టేనానామూలాద్ధనవ్యయం
శిరోరోగంచకురుతేపితృవర్గవినాశనం॥
శశినాసంయుతేదృష్టేమాతృకష్టంమతిభ్రమం
స్వస్థాననాశనంచైవఅపమృత్యుభయంతథా॥

రవియొక్క సంబంధవీక్షణములవలన అనేకవిధములు గా ధననష్టము శిరోరోగము పితృవర్గనాశనము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మాతృకష్ట ము మతిచాంచల్యము స్థానభ్రష్టత్వము అపమృత్యుభయము గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టేయుద్ధేశస్త్రభయంతథా
కలహంమానహానిశ్చదాయాదైర్జనవిగ్రహం
బుధేనసంయుతేదృష్టేబంధువృద్ధిర్భవిష్యతి
వ్యవహారేజయశ్చైవక్రయవిక్రయకౌశలం॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన యుద్ధమందు శస్త్రభయము కలహము మానహాని దాయాదులతోవిరోధ ము గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన బంధువృద్ధివ్య వహారమందు జయము క్రయవిక్రయకౌశలము గలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే గురుపీడాభవిష్యతి
మతిభ్రంశం దేహబాధాపుత్రపీడాభవిష్యతి॥
శుక్రేణసంయుతేదృష్టే స్త్రీమూలాత్కలహాస్తథా
వాహనాదివినాశశ్చ నాయకాదిసమాగమః॥
శనినా సంయుతేదృష్టే అతిసారాదిరోగజం
సమానజననాశశ్చ ఇష్టబంధువినాశనం॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన స్త్రీమూలక ముగా కలహము వాహననాశనము వేశ్యాసంగమముగలుగును

శనియొక్క సంబంధవీక్షణములవలన అతిసారరోగము సమానజననాశనము ఇష్టబంధునాశనమును గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాత్రుతీయేలాభగేపివా
శుభగ్రహయుతేవాపిఉచ్చరాశిసమన్వితే
యత్నకార్యసుసిద్ధిస్స్యాత్ స్వప్రభోస్తుమహత్సుఖం
పుత్రీపుత్రవివాహశ్చగృహేచధనవృద్ధిదః॥

దశానాథుని లగాయతు కేంద్రకోణ తృతీయలాభముల యందుగాని శుభగ్రహయుతుడై యున్నయెడలగాని ఉచ్చయం దుండినగాని కార్యసిద్ధి తన ప్రభువులవలన సౌఖ్యము పుత్రుల యొక్కయు పుత్రికలయొక్కయు వివాహములు గృహమందు ధనవృద్ధియుగలుగును.

శ్లో॥ ఛాయేశాత్షష్ఠరంధ్రేవాన్వ్యయేవా పాపసంయుతే
పుత్రమిత్రవినాశశ్చస్థాననాశంనృపాద్భయం
విధవాకలహాశ్చైవనీచస్త్రీసంగమంతథా॥

యీ కేతువు షష్ఠాష్టమవ్యయస్థానములయందున్న యెడలను పాపసంబంధములు గలిగినను పుత్రనాశనము మిత్రనాశనము స్థానభ్రష్టత్వము రాజులవలన భయము విధవాకలహము నీచస్త్రీసంగమను యివిగలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థేఅపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థంశివలింగార్చనంతధా
మేషదానంప్రకుర్వీతశాంతిమాప్నోత్యసంశయః॥

ద్వితీయ సప్తమస్థానములయందు కేతువున్న యెడల అపమృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై శివలింగార్చనయు మేకదానమును చేసిన సౌఖ్యము గలుగును.

గురుదశలో శుక్రభుక్తి మా 32.

శ్లో॥ గురోరంతర్గతే శుక్రేస్వోచ్చ కేంద్ర త్రికోణగే
ద్వితీయే లాభరాశిస్థే శుభగ్రహయుతేక్షితే
రాజ్యాప్తిం రాజసన్మానం యానాంబర విభూషణం
భాగ్యోత్తరం మనోధైర్యం రాజద్వారాధిపత్యకం॥

గురుదశలో శుక్రుడు ఉచ్చయందుగాని కేంద్రకోణములయందుగాని ద్వితీయలాభములయందుగాని శుభగ్రహయుక్తుడై యున్నయెడల రాజ్యలాభము రాజసన్మానము వస్త్ర

వాహనాలంకారప్రాప్తి సంతోషము యశోవృద్ధి స్త్రీపుత్ర ధనసంపత్తు ఉత్తరఖండమందు భాగ్యము మనోధైర్యము రాజానుగ్రహమువలన మంచిఉద్యోగప్రాప్తి గలుగును.

శ్లో॥ గురోరంతర్గతే శుక్రే నీచేషష్ఠాష్టరిష్ఫగే
ఉద్యోగభంగం క్లేశంచ ధనధాన్యవినాశనం
భూమివాదం స్వబంధూనాం నాశనం స్వపదచ్యుతిః
దారాపుత్రాః పీడాచ ఋణరోగ వివర్ధనం॥

యీశుక్రుడు నీచయందుగాని షష్ఠాష్టవ్యయములయందుగాని దుర్బలముగా నున్నయెడల ఉద్యోగభంగము దుఃఖము ధనధాన్యనాశనము స్థానభ్రష్టత్వము కళత్రశరీరపీడ భూమికొరకు వివాదము బంధునష్టము పుత్రవిచారము రోగవృద్ధి ఋణవృద్ధియు గలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే దుర్గారణ్య విచారణం
సర్వకార్యవినాశశ్చ వాహనాశ్వాదినాశనం
శశినాసంయుతే దృష్టే యుద్ధేశత్రుభయంతథా
చోరాగ్ని విషభీతిశ్చ సమానజననాశనం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన పర్వతములయందు అరణ్యములయందు విచారమునుబొందుట సర్వకార్యనాశనము వాహనము అశ్వములు పనియొక్క నాశనము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన వాహనలా

భము మణులు స్వర్ణము వస్త్రములు వీనియొక్క లాభము సమస్తకార్యానుకూలమును గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే యుద్ధేశతృభయంతథా
చోరాగ్ని విషభీతిశ్చ సమానజననాశనం
బుధేశాస్త్రప్రశంగాది యజ్ఞ దీక్షాదిచింతనం
విచిత్రగృహలాభశ్చ బాంధవాది సమాగమం॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన యుద్ధమందు శతృభయమును చోరులవల్లనుంచిగాని అగ్నివల్లనుంచిగాని దొంగలవల్లనుంచిగాని భయము సమానమనుజునియొక్క నాశనము గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన శాస్త్రప్రసంగము యజ్ఞదీక్ష విచిత్రగృహలాభము బంధుసమాగమము యివిగలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే ఘ్రరభూసురచింతనం
అన్నదాన పరోనిత్యం సభాయాం పూజ్యతాభవేత్
శనినాసంయుతేదృష్టే చింతాస్థాన వినాశనం
సమానజననాశశ్చ చతుష్పాజ్జీవనాశనం॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన గ్రామబ్రాహ్మణశ్రేష్ఠులయొక్క విచారణయు నిత్యాన్నదానపరుడును సభాపూజ్యుడును అగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన విచారము స్థానభ్రష్టత్వము సమానజననాశనము పశునాశనము యివి గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాతృతీయే లాభగేపివా
శుభగ్రహాయుతేవాపి ధనలాభము దీరయేత్
కళ్యాణ శుభసౌఖ్యాది వాహనం ధనవృద్ధిదం
అపూర్వవస్తుసంప్రాప్తిః తీర్థయాత్రాతథైవచ
పశుధాన్యాదివృద్ధిశ్చ క్షేత్రవృద్ధిశ్చజాయతే॥

దశానాథుని లగాయతు శుక్రుడు కేంద్రకోణముల యందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహసంబంధములు గలిగినయెడల ధనలాభము కళ్యాణము శుభములు సౌఖ్యము వాహనము ధనము అపూర్వవస్తువులు లభించుట తీర్థయాత్రలు సేవించుట పశువృద్ధి ధాన్యవృద్ధి క్షేత్రవృద్ధి యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠ రంధ్రేవాన్వయేవా పాపసంయుతే
క్షేత్రనాశం మానభంగం స్త్రీపుత్రాణాంతుపీడనం
యత్నకార్య వినాశశ్చ రక్తస్రావాదిపీడనం
ప్రాణహానిం ప్రకుర్వతే చతుష్పాజ్జీవనాశనం॥

దశానాధునిలగాయతు శుక్రుడు షష్ఠాష్టవ్యయముల యందు పాపసంబంధవీక్షణములు గలిగినయెడల భూనాశనము మానభంగము స్త్రీపుత్రపీడ కార్యనాశనము రక్తస్రావముచే బాధయు ప్రాణహాని పశునాశనమును గలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యు భయంతథా
లక్ష్మీనారాయణం దానంకుర్యాచ్ఛాంతిమవాప్నుయాత్

ద్వితీయసప్తమస్థానములయందు శుక్రుడున్నయెడల అపమృత్యుదోషము గలుగును. అట్టిదోషము పోవుటకై లక్ష్మీనారాయణ ప్రతిమాదానమును చేసినయెడల శాంతియు సౌఖ్యము గలుగును.

గురుదశలో రవిభుక్తి మా 9 రో 18.

శ్లో॥ జీవస్యాంతర్గతే భానోస్స్వోచ్చ కేంద్ర త్రికోణగే
లాభేవాశుభరాశిస్థే శుభగ్రహయుతేక్షితే
ధనాప్తిం రాజసన్మానం దారాపుత్ర నృపాత్ప్రియం
జయేదరీ౯ ప్రయాణేన చిరాద్భోగ మవాప్నుయాత్॥

గురుదశలో రవి ఉచ్చయందుగాని కేంద్రకోణముల యందుగాని లాభమందుగాని యున్నను శుభమిత్రరాశియందున్నను శుభగ్రహములతో గలిసినను చూడబడినను ధనలాభము రాజసన్మానము దారాపుత్రాదులవల్లనుంచి ప్రేమయు కలుగును. ప్రయాణముచే శత్రువులను జయించును. చిరకాల భోగము గలుగును.

శ్లో॥ జీవస్యాంతర్గతే భానోనీచే షష్ఠాష్టరిష్ఫగే
రాజశతృభయం దుఃఖం ధనహానిఃపితుర్భయం
పితృజ్వరశ్శిరోరోగః నేత్రరోగ ప్రవర్ధనం
పరదేశేనివాసంచ స్థానభ్రంశమవాప్నుయాత్॥

గురుదశలో రవి నీచయందుగాని షష్ఠాష్టవ్యయముల యందుగాని ఉన్నయెడల రాజులవల్లను శత్రువులవల్లను భయ

మున్ను దుఃఖము ధనహాని పితృభయము పైత్యజ్వరము శిరోరోగము నేత్రరోగము పరదేశనివాసము స్థానభ్రష్టత్వము గలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే. అపూర్వవస్తుసంగ్రహః
మనోల్లాసం మహత్సౌఖ్యం మిత్రప్రభునశాత్సుఖం
కుజేనసంయుతేదృష్టే. శస్త్రఘాతాద్భయంతథా
సమానజననాశశ్చ విషూచీ గుల్మపీడనం॥

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన అపూర్వవస్తులాభము మనోల్లాసము మిత్రప్రభువుల్లనుంచి సౌఖ్యమున్నూ గలుగును.

కుజునియొక్క సంబంధ వీక్షణములవలన శస్త్రముయొక్క దెబ్బతగులుటవల్లనుంచి బాధయున్నూ సమానమనుజునియొక్క నాశనము విషూచియు గుల్మవ్యాధియు గలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే శాస్త్రాభ్యాసాది సంగ్రహః
బంధుప్రియోస్వాధికార ప్రాప్తిర్భూపాత్సుఖంభవేత్
గురుణాసంయుతేదృష్టే. దైవపూజాదిచింతనం
సత్కథాశ్రవణంచైవ స్వగేరాజదర్శనం॥

బుధునియొక్క సంబంధవీక్షణములు గలిగియున్నయెడల శాస్త్రాభ్యాసము బంధుసన్మానము ఉద్యోగప్రాప్తి రాజానుగ్రహము సౌఖ్యము గలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన యీశ్వరపూజ

సత్కథాకాలక్షేపము గురువారమందు రాజదర్శనమును గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే ముక్తాలాభో భవేద్ధ్రువం
హేమాభరణసంప్రాప్తిర్వాహనాది వివృద్ధిదః
శనినాసంయుతేదృష్టే అర్థనాశం మనోవ్యథా
స్వస్థానినాశనంచైవ అపమృత్యు భయంతథా॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన ముత్యములు హారలాభము బంగారము మొదలగు వస్తులాభము వాహనలాభము గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన ధననాశనము మనోవ్యాకులత స్థానభ్రష్టత్వము అపమృత్యుభయము గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్ర కోణేవాత్రృతీయే లాభ గేపివా
ధననాశంమనోదుఃఖం బంధుద్వేషం మనోరుజం
కుక్షిరోగం భూమినాశం విరుద్ధం బంధుభిస్సహ
ఉత్సాహో బంధుకళ్యాణం భుక్త్యంతేశుభదం భవేత్॥

దశానాథునిలగాయను రవి కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని యున్నయెడల ధననాశనము మనోదుఃఖము బంధువిరోధము మనోవ్యాధి కుక్షిరోగము భూనాశనమును భుక్త్యంతమందు ఉత్సాహము బంధుకళ్యాణము శుభప్రదములు గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవావ్యయేవా పాపసంయుతే
అతికష్టంస్థానహాని స్వమానజననాశనం

స్వపుత్రకలహాశ్చైవ కార్యనాశం మనోవ్యథా
పితుఃపిత్రసమానశ్చ మరణం నాత్రిసంశయః
వాహనాదివినాశశ్చ స్వభృత్య కలహ స్తదా॥

దశానాథునికిఁగాయత్రు రవి షష్టాష్టవ్యయములయం దు పాపయుక్తుఁడైయున్న యెడల విశేషకష్టము స్థాననాశనము సమానజనునియొక్క నష్టము తనకుమారునితో కలహము కార్యభంగము మనోవ్యాకులత తండ్రిగాని తండ్రితో సమానమనుజునియొక్కగాని మరణము వాహనసష్టము సేవకులతో కలహమున్నూ గలుగును.

శ్లో॥ ద్వితీయస ప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం భాస్కరప్రార్థనం చరేత్
ఛాగదానం ప్రకుర్వీతహ్యాయురారోగ్యవర్ధనం॥

ద్వితీయస ప్తమస్థానములయందు రవియున్న యెడల అపమృత్యుభయము గలుగును. దాని నివృ త్తికై సూర్యనారాయణ ప్రార్థనయు మేకదానమును చేసినయెడల ఆయురారోగ్యాభివృద్ధిగలుగును.

గురుదశలో చంద్రభు క్తి మా 16

శ్లో॥ జీవస్యాంతర్గతేచంద్రేస్వోచ్చే కేంద్రత్రికోణగే
సురతంచో త్తమస్త్రీషు సువస్త్రంచసుభోజనం
వ్యాపారేధనలాభంచ స్త్రీప్రజావృద్ధిమేవచ
ఆరోగ్యంధనసంప త్తి ర్భూషణంవాహనంతథా॥
మాతృసౌఖ్యంమనస్సౌఖ్యం దారాపుత్రాభివర్ధనం॥

గురుమహాదశలో చంద్రాంతర్దశయందు చంద్రుడు ఉచ్చయందుగాని కేంద్రకోణములయందుగాని బలముగానున్న యెడల ఉత్తమస్త్రీలతో భోగము మంచివస్త్రానుభవము భోజనసౌఖ్యము వ్యాపారమువలన ధనలాభము స్త్రీసంతానవృద్ధియు శరీరారోగ్యము ధనవృద్ధి వాహనసౌఖ్యము అలంకారప్రాప్తి మాతృసౌఖ్యము మనస్సంతోషము దారాపుత్రులయొక్క అభివృద్ధి యివిగలుగును.

శ్లో॥ జీవస్యాంతర్గతేచంద్రే నీచేషష్ఠాష్టరిఃఫగే
కృషిభంగోధాన్యహానిర్మాతృ నష్టంధనవ్యయం
త్వగ్దోషరోగసంప్రాప్తి ర్విషచోరభయంతథా
పుత్రమిత్రార్థహానిశ్చ భార్యాబంధువిరోధితా॥

ఈచంద్రుడు నీచయందుగాని షష్ఠాష్టవ్యయములయందుగాని బలహీనుడై యున్నయెడల వ్యవసాయనష్టము ధాన్యనష్టము మాతృకష్టము ధనవ్యయము చర్మవ్యాధి విషమువల్లను దొంగలవల్లను భయము పుత్రనష్టము మిత్రనష్టము భార్యాబంధువులతో విరోధము యివిగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే కలహంస్థాననాశనం
రాజద్వేషంకార్యనాశం వ్యాయామజ్వరపీడనం
కుజేనసంయుతేదృష్టే యుద్ధేశత్రుభయంతథా
అగ్నిబాధామనస్తాపం సమానజననాశనం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన కలహము స్థాన

భ్రష్టత్వము రాజవిరోధము కార్యనాశనము వ్యాయామజ్వర బాధయుగలుగును.

కుజునియొక్క సంబంధవీక్షణములవలన యుద్ధమందు శత్రుభయము అగ్నిబాధ మనస్తాపము సమానజననాశనము గలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే క్రియవిక్రియవృద్ధిసం
వణిగ్జనానసంసర్గం వ్యవహారేజయంతథా
గురుణాసంయుతేదృష్టే గురుదేవద్విజార్చనం
శివదీక్షాపరిసంగంచ నానామూలాద్ధనాగమం॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన అమ్ముట కొనుటయందలి నేర్పరితనము వర్తకులయొక్క సమాగమము వ్యాపారములయందు జయముగలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన గురునియొక్క దేవతలయొక్క బ్రాహ్మణులయొక్కయు పూజ శివసహస్రనామమును జపించుట అనేక విధములుగా ధనలాభము గలుగుట యివి మొదలగునవి గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే వస్త్రభూషణలాభవాన్
యానాదివాహనప్రాప్తిః కార్యసిద్ధిర్భవిష్యతి
శనినాసంయుతేదృష్టే సమానజననాశనం
చతుష్పాజ్జీవనాశంచ పిశాచాదిభయంతథా॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన వస్త్రనగలు

భూషణములు మొదలగువానిలాభము వాహనము పల్లకీమొ
దలగువానిలాభము కార్యసిద్ధి యివిగలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన సమానమనుజుని
యొక్క నాశనము పశునాశనము పిశాచాదిభయముగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యేలాభగేపివా
శుభగ్రహాయుతేవాపి కార్యసిద్ధిర్భవిష్యతి
విజయం దేహమారోగ్యం దారాపుత్రాదిసౌఖ్యదం
కృషిక్షేత్రధనప్రాప్తిః బాంధవైస్సహభోజనం
సమరేశత్రునాశశ్చ చింతాశోకవినాశనం

దశానాథునిలగాయుతు చంద్రుడు కేంద్రకోణముల
యందుగాని తృతీయలాభములయందుగాని శుభసంబంధవీక్ష
ణములుగలిగియున్నయెడల కార్యసిద్ధి జయము శరీరసౌఖ్యము
దారాపుత్రాదిసౌఖ్యము వ్యవసాయము భూమిధనము మొ
దలగువానిలాభము బంధుసన్మానము భోజనసౌఖ్యము యుద్ధ
మందుజయము చింతశోకము యివిలేకపోవుట గలుగుట.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవా పాపసంయుతే
తద్భుక్తౌకార్యహానిశ్చ మానహానిశ్చజాయతే
ఉద్యోగభంగంచలనం స్థాననాశంతథైవచ
బాంధవానాంవినాశశ్చ చింతితార్థంచనాశనం॥

దశానాథునిలగాయతు చంద్రుడు షష్ఠాష్టవ్యయముల
యందున్నయెడల కార్యహాని మానభంగము ఉద్యోగభంగ

ముస్థానభ్రష్టత్వము బంధునష్టము అర్థనాశనమును గలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం ఛాగదానంసమాచరేత్॥

ద్వితీయసప్తమస్థానములయందు చంద్రుడున్న యెడల మృత్యుభయముగలుగును. అట్టిదోషముపోవుటకై మేకదానము చేయవలెను.

గురుదశలో కుజభుక్తి మా 11 రో 6

శ్లో॥ జీవస్యాంతర్గతే భౌమే తృతీయే షష్ఠలాభగే
స్వోచ్ఛేవాశుభసంయుక్తే కృషిగో భూమివర్ధనం
దేవస్థానాద్గురుస్థానా ద్రాజసంస్థానతోపివా
గజాశ్వఛత్ర భృత్యాది బిరుదాప్తిశ్చవైభవం
ప్రాభవంజనపూజ్యత్వం శౌర్యంసాహసమేవచ
అర్థైస్యైనధనాప్తిశ్చ భ్రాతృసౌఖ్యాభివర్ధనం॥

గురుమహాదశలో కుజాంతర్దశలో కుజుడు తృతీయ షష్టలాభములయందుగాని ఉచ్ఛయందుగాని శుభగ్రహసంబంధవీక్షణములు గలిగియున్న యెడల వ్యవసాయము భూమి మొదలగువాని లాభము దేవస్థానమువల్లనుంచిగాని గురుస్థానమువల్లనుంచిగాని రాజసంస్థానమువల్లనుంచిగానిగజముఛత్రము అశ్వములు దాసదాసీజనములు మొదలగు బిరుదాంకితములు లభించును. ప్రభుత్వమువలన జనులవలన సన్మానము శౌర్యము సాహసము నుంచి స్ఫూర్తివలన ధనలాభము సోదరసౌఖ్యము గలుగును.

శ్లో॥ జీవస్యాంతర్గతే భౌమే నీచే వాష్టమరిష్ఫగే
కేంద్రే వా కోణరాశిస్థే భ్రాతృవర్గవినాశనం
గృహక్షేత్రవినాశంచ స్ఫోటకవ్రణపీడనం
ఉద్యోగభంగం క్లేశంచ కృషిమూలాద్ధనవ్యయం
దారపుత్ర వినాశంచ కారాగృహనివేశనం॥

గురుదశలో కుజుడు నీచయందుగాని అష్టమవ్యయముల యందుగాని కేంద్రకోణములయందుగాని ఉన్న యెడల సోదర నష్టము గృహనష్టము భూవ్యయము స్ఫోటకము వ్రణమువలన బాధయు ఉద్యోగభంగము దుఃఖము వ్యవసాయమువలన ధన వ్యయము భార్యాపుత్రులయొక్క నష్టము కారాగృహప్రాప్తి యివిగలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే రాజద్వేషం ధనవ్యయం
ఉద్యోగచలనం హానిస్స్వ సర్వత్ర కలహాం తథా
శశినాసంయుతే దృష్టే మహత్సౌఖ్యం ధనాగమం
మనోవిలాసం విజయం ఉద్యోగం కార్యసిద్ధిదం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన రాజద్వేషము ధనవ్యయము ఉద్యోగభంగము సమస్తజనులతో కలహము న్నూ గలుగును. చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన విశేషసౌఖ్యము ధనాగమము మనోవిలాసము జయము ఉద్యోగసౌఖ్యము కార్యసిద్ధి యివిగలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే గృహలాభం విచిత్రకం
వాక్కౌశలం బంధువృద్ధిః వ్యవహారే జయంభవేత్

గురుణాసంయుతేదృష్టే. పుత్రప్రాప్తిర్ధనాగమం
వస్త్రభూషణ లాభశ్చ కళ్యాణాదివివృద్ధిదః॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన విచిత్రమైన గృహలాభము వాక్చాతుర్యత బంధువృద్ధి వ్యవహారమందు జయము గలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రసౌఖ్యము ధనలాభము వస్త్రలాభము అలంకారప్రాప్తి కళ్యాణవైభవము గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే వాహనాది లభేద్ధ్రువం
ముక్తామణి విశేషశ్చ ధనలాభంభవేద్ధ్రువం
శనినాసంయుతేదృష్టే వాహనాది పశుక్షయః
నీచాదికలహాశ్చైవ గురుపుత్రవినాశనం॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన వాహనసౌఖ్యము ముత్యములు మణులు ధనము వీనియొక్క సంపాదన యుకిగలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన వాహనము పశువులు వీనినాశనము నీచులతో కలహము గురుపుత్రనాశనము గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్ర కోణేవాదుశ్చిత్కే. లాభగేపివా
శుభగ్రహాయుతేవాపి ధనలాభము దీరయేత్
విద్యావిలాసంపాండిత్యం సమానప్రభుదర్శనం

మహారాజాశ్రియప్రాప్తి రిష్టసిద్ధిర్భవిష్యతి
భూలాభం పుత్రలాభంచ క్షేత్రధాన్య వివృద్ధిదం॥

దశానాథుని లగాయతు కుజుడు కేంద్రకోణములయం దుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహసంబంధములు గలిగియున్నయెడల ధనలాభము గలుగును. విద్యయందు జయము పాండిత్యము సమానప్రభువుయొక్క దర్శనము మహారాజానుగ్రహము ఇష్టసిద్ధి భూలాభము పుత్రలాభము క్షేత్రలాభము ధాన్యవృద్ధి గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవావ్యయేవా పాపసంయుతే
స్థాననాశం బంధునాశం నానామూలాద్ధనవ్యయం
కృషిక్షేత్రవినాశశ్చ చింతితార్థస్యనాశనం
సమానజనశోకశ్చ జ్ఞాతిశత్రువివృద్ధిదః॥

దశానాథునిలగాయతు కుజుడు షష్ఠాష్టవ్యయములయందు పాపయుక్తుడై యున్నయెడల వ్యవసాయము భూమి ధనము వీని నాశనమున్ను సమానమనుజునియొక్క శోకము జ్ఞాతులతో విరోధమున్ను గలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం స్వర్ణదానం సమాచరేత్॥

ద్వితీయ సప్తమములయందు కుజుడున్నయెడల మృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై స్వర్ణదానమును చేయవలెను.

గురుదశలో రాహుభుక్తి సం 2 మా 4 రో 24

శ్లో॥ జీవస్యాంతర్గతే రాహౌతృతీయేషష్ఠలాభగే।
స్వోచ్చేశుభయుతేదృష్టే గృహక్షేత్రాభివర్ధనం।
రాజసన్మానసంపత్తిర్దారాపుత్రాభివర్ధనం।
ఉద్యోగాద్ధనలాభంచ మిత్రబంధుసమాగమం॥

గురుదశలో రాహువు తృతీయమందుగాని షష్ఠమమందుగాని ఉచ్చయందుగాని శుభగ్రహసంబంధ వీక్షణములు గలిగియున్నయెడల గృహలాభము క్షేత్రవృద్ధి రాజసన్మానము దారాపుత్రాభివర్ధనము ఉద్యోగాభివృద్ధి ధనలాభము మిత్రులయొక్కయు బంధువులయొక్కయు దర్శనము యివి మొదలగు ఫలములు గలుగును.

శ్లో॥ జీవస్యాంతర్గతేరాహౌ కేంద్రేవాకోణసంస్థితే॥
రంధ్రేవారిష్ఫరాశిస్థే పాపగ్రహయుతేక్షితే।
కుభోజనం కువస్త్రంచ స్థాననాశం నృపాద్భయం।
కృషిగో భూమివస్త్రాది బంధుపుత్రార్థనాశనం।
అకస్మాత్కలహంచైవ నిజాచారవినాశనం।
ఋణవృద్ధిర్విశేషంచ శత్రురోగ వివర్ధనం॥

గురుదశలో రాహ్వాంతర్దశయందు రాహువు కేంద్రకోణములయందుగాని అష్టమమందుగాని వ్యయస్థానమందుగాని వుండి పాపగ్రహములతో గలిసినను చూడబడినను సౌఖ్యములేని భోజనము జీర్ణవస్త్రముస్థానభ్రష్టత్వము రాజుల

వలన భయము కృషి పశువులు భూమివస్త్రములు బంధువులు సంతానము ధనము వీనియొక్క నాశనము ఋణావృద్ధి శత్రు వృద్ధి శరీరపీడ మొదలగు చెడుఫలములు గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే చోరాగ్ని నృపపీడనం ।
ఉద్యోగచలనంచైవ స్వస్థానచలనంభవేత్ ।
శశినాసంయుతేదృష్టే మాతృవంశ వినాశనం ।
అపకీర్తిభయప్రాప్తిః శిరోకుక్ష్యక్షిపీడనం ॥

రవియొక్క సంబంధ వీక్షణములవలన. దొంగలవలనను అగ్నివలనను రాజులవలనను భయము ఉద్యోగభంగము స్థాన చలనము గలుగును.

చంద్రునియొక్క సంబంధ వీక్షణములవలన అపకీర్తి భయము శిరోరోగము కుక్షిరోగము నేత్రరోగమును గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే యుద్ధేశతృభయంతథా ।
జ్ఞాతిభిః కలహంవ్యాధిః మహదాపదసంభవః ।
బుధేనసంయుతేదృష్టే మాతులాది వివృద్ధిదం ।
బంధుసన్మాన మాధిక్యం యత్నకార్యసుసిద్ధిదం ॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన యుద్ధమందు శతృభయము జ్ఞాతులతో విరోధము గొప్పవ్యాధి అందువలన దుఃఖమును గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన మేనమామల

యొక్క సౌఖ్యము బంధుసన్మానము కార్యసిద్ధి యివి గలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే పుత్రదారాది పీడనం ।
బుద్ధినాశోహ్యర్థహానిస్స్వమాన జననాశనం ॥
శుక్రేణసంయుతే దృష్టే దారావర్గ వినాశనం ।
శనినాసంయుతే దృష్టే భృత్యవర్గవినాశనం ॥

గురునియొక్క సంబంధవీక్షణములవలనపుత్రులయొక్క కళత్రముయొక్కయు పీడయు బుద్ధిమాంద్యము ధనహానిస్వమానజననాశనమును గలుగును.

శుక్రునియొక్క సంబంధమువలన దారావర్గ నాశనము గలుగును. శనియొక్క సంబంధమువలన సేవకవర్గనాశనము గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యేలాభ గేపివా।
శుభగ్రహయుతేవాపి తద్భుక్తౌ శుభదంభవేత్ ।
కృషిక్షేత్రధనాప్తిశ్చ మిత్రప్రభువశాత్సుఖం ।
అపూర్వవస్తు సంప్రాప్తి రిష్టసిద్ధిర్భవిష్యతి ॥

దశానాథునిలగాయతు రాహువు కేంద్రకోణముల యందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహయుక్తుడై యున్న యెడల శుభముగలుగును. వ్యవసాయము భూమి ధనము మిత్రప్రభువుల్లనుంచి సౌఖ్యమును అపూర్వవస్తు సంపాదనయు ఇష్టసిద్ధిగలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవానీచసంయుతే ।
సమానజనశోకశ్చ స్థాననాశంభవిష్యతి ।

అత్యంతపాపచింతాచ కలహః క్షితిపాద్భయం ।
యత్న కార్యవినాశశ్చ గురుద్వేషోభ విష్యతి॥

దశానాథుని లగాయతు రాహువు షష్ఠాష్టవ్యయము లయందున్నను నీచయందున్నను సమాన మనుజునియొక్క శోకము స్థానభ్రష్ఠత్వము గలుగును భుక్త్యంతమందు పాప చింతయు కలహము రాజులవలన భయము కార్యవినాశనము గురుద్వేషమును గలుగును.

శ్లో॥ ద్వితీయ ద్యూనరాశిస్థే అపమృత్యుర్భయం వదేత్ ।
తద్దోషపరిహారార్థం తిలహోమం సమాచరేత్ ।
రజతంమహిషందద్యాత్సౌఖ్యారోగ్య వర్ధనం ॥

ద్వితీయసప్తమములయందు రాహువున్నయెడల అప మృత్యుభయముగలుగును. అట్టిదోషముబోవుటకై తిలహో మమును రజతమహిషిదానమును చేసినయెడల సౌఖ్యము గలుగును.

శనిదశలో శనిభుక్తిసం 3. మా 0. రో 3

శ్లో॥ శనేరంతర్గతే మందేత్రితీయేషష్ఠలాభగే
స్వోచ్ఛేశుభయుతేదృష్టే రాజపూజ్యోభవేన్నరః
పరోపకారం నృపలబ్ధభాగ్యంకృష్యానిధాన్యాని కృషించలా
భం। జనాధిపత్యంసుఖభోజనంచకళత్రమిత్రాత్మజసౌఖ్య
మేతి॥

శన్యంతర్దశలో శని ఉచ్ఛయందుగాని షష్ఠమమందుగాని యున్నయెడల పరోపకారము రాజసన్మానము రాజులవలన

పొందబడిన భాగ్యమున్న సల్లధాన్యము వ్యవసాయమువలన లాభము నరాధిపత్యము సుఖభోజనము మిత్రులయొక్కయు దారాపుత్రులయొక్కయు సౌఖ్యమునుగలుగును.

శ్లో॥ శనేరంతర్గతేమందే వ్యయేవాష్టమసంస్థితే
నీచేవా కేంద్రకోణస్థే పాపగ్రహాయుతేక్షితే
స్థానచ్యుతింప్రవాసంచ మాతృతస్వర్గనాశనం
కళత్రపుత్రహానిశ్చ పితృమాతృవిరోధితా
శరీరేవ్యాధి పీడాచనీచస్త్రీసంగమంలభేత్॥

శన్యంతర్దశయందు శనివ్యయమందుగాని అష్టమమందుగాని నీచయందుగాని కేంద్రకోణములయందుగాని పాపగ్రహయుతుడైయున్న యెడల స్థానచలనము పరదేశనివాసము మాతృనష్టము కళత్రనష్టము సంతాననష్టము తలిదండ్రులతో విరోధము పరస్త్రీసంగమము గొప్పరోగమును, సంభవించును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే శిరోరోగమతిభ్రమం
ఉద్యోగభంగంచలనం నృపక్రోధంభవిష్యతి
శశినాసంయుతేదృష్టే మాతృనంశవినాశనం
మనోవిచారఖేదంచ సర్వకార్యవినాశనం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన శిరోరోగము మతిభ్రమణముఉద్యోగభంగము రాజులతో విరోధము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మాతృవంశనష్టము మనోవ్యాకులతఖేదము సర్వకార్యవినాశనమును గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే యుద్ధేష్వపజయంతథా
జ్వరాతిసారగ్రహణీ రోగబాధానసంశయః
బుధేనసంయుతేదృష్టే విద్యామూలాద్ధనాగమం
బంధుప్రీతిజయం చైవయత్నకార్యానుసిద్ధినం॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన యుద్ధమందు అపజయము గలుగుట జ్వరాతిసారరోగముగ్రహణీరోగమును గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన విద్యామూలముగా ధనలాభముచు బంధుసన్మానము జయము కార్యసిద్ధి గలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే పుత్రదారాదినాశనం
ధననాశం దేహబాధా బుద్ధిభ్రంశోభవిష్యతి
శుక్రేణసంయుతేదృష్టే స్వకళత్రస్యనాశనం
గర్భస్రావంవ్యాధిపీడా పరస్త్రీకలహంతథా॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రనాశనము భార్యావియోగము ధననాశనము శరీరబాధ బుద్ధిభ్రంశము యివిగలుగును.

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన కళత్రనష్టము గర్భస్రావరోగమువలన బాధ పరస్త్రీకలహము యివిగలుగును.

శ్లో॥ చంద్రాధిపేనసంయుక్తో చంద్రస్థానగతోపివా
ద్వితీయంసప్తమస్థోవా అపమృత్యుర్భవిష్యతి

తద్దోషపరిహారార్థం మృత్యుంజయజపంచరేత్
తిలదానంప్రకుర్వీత కృష్ణధేనుం ప్రదాపయేత్ ॥

అష్టమాధిపతియొక్క సంబంధము గలది గాని అష్టమస్థానమందుండుటవలనగాని ద్వితీయసప్తమస్థానములయందుండుటవలన గాని అపమృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై మృత్యుంజయ జపమును తిలదానమును చేసినయెడల సౌఖ్యము గలుగును.

శనిదశలో బుధభుక్తి సం 2 మా 8 ది 9 ॥

శ్లో॥ శనేరంతర్గతే సౌమ్యే కేంద్రే లాభత్రికోణగే
స్వోచ్చేవాశుభరాశిస్థే శుభగ్రహయుతేక్షితే
స్థిరాణిపుణ్యకర్మాణి కృషిగోభూమిసంస్థితం
మనోధైర్యంచసంతోషం విదేశాద్వస్తుసంచయం
యజ్ఞంద్వైవాహికం కర్మపుత్రశ్రవణాదికం
బంధుపూజ్యంయశోవృద్ధిస్స్యాత్ జ్ఞేనధనాగమం॥

శనిమహాదశలో బుధభుక్తియందు బుధుడు కేంద్రకోణములయందుగాని ఉచ్చయందుగాని లాభమందుగాని శుభగ్రహసంబంధవీక్షణములుగలిగి యున్నయెడల శాశ్వతములైనపుణ్యకర్మలుచేయుటయు పశువృద్ధి వ్యవసాయమూలకవృద్ధి భూలాభము మనోధైర్యము సంతోషము విదేశవస్తులాభము యజ్ఞముచేయుట వివాహము పుత్రశ్రవణము బంధుపూజ్యత ధనసంపాదన మొదలగుమంచిఫలములు గలుగును.

శ్లో॥ శనేరంతర్గతేసౌమ్యేనీచేషష్ఠాష్టరిప్పగే
చోరారివహ్నిభీతించకుస్త్రీభవనసేవనం
కర్మహీనంకృషేర్నాశంవ్యాపారేణధనవ్యయం
శతృవృద్ధిర్విశేషంచఋణరోగైశ్చబాధతే॥

బుధాంతర్దశలోబుధుడు నీచయందుగాని షష్ఠాష్టవ్య యములయందుగాని వున్నయెడల చోరులువలనను అగ్నివల్ల ను శతృవులవలనను భయము నీచస్త్రీలయొక్క గృహామందు నివాసము కులోచితకర్మలు విడిచిపెట్టుట వ్యవసాయమునలన నష్టము వ్యాపారమువలన ధనవ్యయము విశేషముగాశతృవృద్ధి ఋణముర్రోగము మొదలగునట్టి ఫలములుగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టేబంధుప్రీతిఃప్రజాయతే
వివాహకార్యయత్నానిభూపాలాత్సుఖమశ్నుతే॥

రవియొక్క సంబంధవీక్షణములవలన బంధుసన్మానము వివాహాదిశుభకార్యములు చేయుటయందు ప్రయత్నము రాజు లవల్లనుంచి సౌఖ్యమునుగలుగును.

శ్లో॥ చంద్రేణసంయుతేదృష్టేముక్తామణిసుసంగ్రహః
అపూర్వవస్తుసంప్రాప్తిరిష్టసిద్ధిర్భవిష్యతి॥

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మంచిము త్యములు మణులు మొదలగువాని సంపాదనయు అపూర్వవ స్తులాభము ఇష్టకార్యసిద్ధియునిగలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టేయుద్ధేశతృవివర్ధనం
పాకశాలాధికారశ్చసోదరాణాంవివర్ధనం॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన యుద్ధమందు శత్రువృద్ధి సోదరవృద్ధి యివిగలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే వేదశాస్త్రప్రసంగతిః
ప్రకారాధీశమిత్రత్వంపుత్రప్రాప్తిర్న సంశయః॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన వేదశాస్త్ర ప్రావీణ్యము పుత్రప్రాప్తి గొప్పరాజుతో స్నేహము యివి గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టేవస్త్రవాహానసంగ్రహః
మహారాజాశ్రయప్రాప్తిఃఅమూలాత్సుఖమాప్నుయాత్॥

శుక్రునియొక్క సంబంధ వీక్షణముల వలన వస్త్రములు వాహనములు అలంకారములు మొదలగువాని సంగ్రహము రాజానుగ్రహమువలన విశేషసౌఖ్యము యివి మొదలగు మంచిఫలములు గలుగును.

శ్లో॥ శనినాదేహబాధాచసర్వత్రకలహాస్తథా
అపకీర్తిస్సభీతిశ్చస్వభృత్యకలహాస్తథా॥

శనియొక్క సంబంధవీక్షణములవలన దేహబాధయు సకలమైనవారితో కలహము అపకీర్తి భయము భృత్యులతో కలహమున్ను గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాదుశ్చిత్కేలాభగేపివా
శుభగ్రహయుతేవాపితద్భుక్తౌశుభసంపదః
హేమాభరణసంప్రాప్తిరపూర్వప్రియదర్శనం

గోమహిష్యాదివృద్ధిశ్చనిత్యం బ్రాహ్మణభోజనం
శుభశోభనసంప్రాప్తిస్స్యాద్రప్రభువశాత్సుఖం॥

దశానాథుని లగాయతు బుధుడు కేంద్రకోణములయం దుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహయుక్తుడై యున్నయెడల శుభములు సంపదయు సువర్ణవస్తుసంప్రాప్తి అపూర్వప్రియదర్శనము పశువులయొక్క వృద్ధి నిత్యము బ్రాహ్మణ సమారాధనయు శుభశోభనములు జరుగుటయు శూద్రప్రభువువల్లనుంచి సౌఖ్యమున్ను గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవావ్యయేవాపాపసంయుతే
పాపగ్రహయుతేవాపిపాపచింతాభవిష్యతి
అకస్మాత్కలహశ్చైవబాంధవాదివినాశనం
విద్యావాదేభయంచైవవిదేశగమనంతథా

దశానాథుని లగాయతు బుధుడు షష్ఠాష్టవ్యయముల యందు పాపగ్రహసంబంధవీక్షణములు గలిగియున్నయెడల పాపచింతయు అకస్మాత్తుగా కలహమును బంధునాశనము విద్యావాదభయము విదేశగమనమును గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవాఅపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థంమహిషీదానమాచరేత్॥

ద్వితీయసప్తమములయందు బుధుడున్నయెడల మరణభయముగలుగును. అట్టిదోషము పోవుటకై గేదనుదానము చేసినయెడల శాంతిగలుగును.

శనిదశలో కేతుభుక్తి సం1 మా1 రో 9

శ్లో॥ శనేరంతర్గతే కేతౌతృతీయేషష్ఠలాభగే
శుభగ్రహాయుతేదృష్టేసుఖంస్త్రీపుత్రవర్ధనం
వాహనంభూమిలాభంచస్వబంధుజనపూజ్యతాం
తీర్థయాత్రాదిలాభంచపుణ్యకర్మసమాచరేత్॥

శనిదశలో కేత్వంతర్దశయందు కేతువుతృతీయలాభములయందుగాని షష్ఠమమందుగాని శుభగ్రహయుక్తుడై యున్న యెడల స్త్రీసౌఖ్యము పుత్రప్రాప్తివాహనము భూమివీనియొక్కలాభము బంధుపూజ్యత తీర్థయాత్రాదిలాభము పుణ్యకర్మలుచేయుట యివిగలుగును.

శ్లో॥ శనేరంతర్గతే కేతౌరంధ్రేవావ్యయసంస్థితే
ధనేవాకేంద్రకోణస్థేపాపగ్రహయుతేక్షితే
వాతపిత్తాగ్నిపీడాచపుత్రదారాదివిగ్రహః
స్థానచ్యుతింమనోదుఃఖంశరీరేవ్యాధివర్ధనం
అకస్మాత్కలహశ్చైవబంధుభిస్స్వజనైస్సహ॥

శనిలో కేతువు అష్టమమందుగాని వ్యయమందుగాని ధనస్థానమందుగాని కేంద్రకోణములయందుగాని వుండి పాపగ్రహసంబంధవీక్షణములు గలిగియున్నయెడల యీఅంతర్దశయందు వాతమువల్లను పిత్తమువల్లను అగ్నివల్లను భయమున్ను దారాపుత్రాదులతో విరోధము స్థానభ్రష్టత్వము మనోదుఃఖము రోగవృద్ధియు కుటుంబముతో బంధువులతోను అక

స్నాత్తుగా కలహమున్ను గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే యత్నకార్య వినాశనం
స్వప్రభోస్తువిరోధశ్చచింతా ప్రాబల్యమేవచ
శశినాసంయుతేదృష్టే రత్నభూషణ సంగ్రహః
ఉత్తమాశ్వాదిలాభశ్చ చిత్రవస్త్రాది సంగ్రహః

రవియొక్క సంబంధవీక్షణములవలన కార్యనాశనము ప్రభువిరోధము విశేషచింత యివిగలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన రత్నములు స్థాపించిన భూషణములయొక్క సంగ్రహము మంచిగుఱ్ఱములు విచిత్రమైన వస్త్రములు యివిమొదలగు మంచిఫలములు గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే ధనధాన్య వ్రయస్తథా
స్థానాంతరాది సంప్రాప్తిర్యుద్ధే శతృభయంతథా
బుధేనసంయుతేదృష్టే విద్యాభ్యాసాది సంగ్రహః
సత్కథాశ్రవణంచైవ యత్నకార్య సుసిద్ధిదం॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన ధననాశనము ధాన్యనాశనమును గలుగును. స్థానభ్రష్టత్వము యుద్ధమందు శతృభయమును గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన విద్యాభ్యాసము సత్కథాశ్రవణము యత్నకార్యసిద్ధి యివిగలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే గురుపుత్రవినాశనం
విప్రజాతి విరోధశ్చ నానామూలా ద్ధనవ్యయం॥
శుక్రేణసంయుతేదృష్టే వస్త్రవాహన సంగ్రహం
ముక్తామణి నిధిర్లాభం నృపాల సద్మృశోపమః

గురునియొక్క సంబంధవీక్షణములవలన గురువుపుత్రులు వీరియొక్క నాశనము బ్రాహ్మణవిరోధము అనేకవిధములుగా ధనవ్యయమును గలుగును.

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన వస్త్రములు వాహనములు ముత్యములు మణులు నిధి వీటియొక్క లాభము రాజులవలన సౌఖ్యమును గలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే దారాపుత్ర వినాశనం
సమానజనశోకంచ నానారోగాది పీడనం॥

శనియొక్క సంబంధవీక్షణములవలన దారాపుత్రనాశనము సమానమనుజునికొరకు విచారము అనేకరోగములవల్లనుంచి బాధయు గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్ర కోణేవాదుశ్చిక్యే లాభగేపివా
శుభగ్రహాయుతేవాపి దారసౌభాగ్యమేవచ
యత్నకార్యాణిసిద్ధిశ్చరత్నకాంచన లాభకృత్
వినోదవిద్యావిజయం సమరేశత్రునాశనం॥

దశానాథునిలగాయతు కేతువు కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహసంబంధము

లు గలిగియున్నయెడల కళత్రముయొక్క సౌభాగ్యము కార్య సిద్ధి రత్నములు బంగారము వీనియొక్క లాభము వినోదము విద్యయందు జయము యుద్ధమందు శత్రువులకు అపజయము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రే వావ్యయేవా పాపసంయుతే
స్త్రీనాశం పుత్రనాశంచ సర్వకార్యాది నాశనం
యాత్రాయాం కార్యహానిశ్చ ఇష్టప్రభువినాశనం
విధవాకలహంచైవ యత్నకార్య వినాశనం॥

దశానాధునిలగాయతు కేతువు షష్ఠాష్టవ్యయముల యందు పాపయుక్తుడై యున్నయెడల స్త్రీనాశనము పుత్రనాశ నము సర్వకార్య వినాశనము యాత్రయందు కార్యహాని తన కుప్రియప్రభువుయొక్క మరణమును యివిగలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి
తద్దోష పరిహారార్థం మృత్యుంజయ మహార్చనం
సువర్ణతిలందానం కుర్యాచ్ఛాంతి మవాప్నుయాత్॥

ద్వితీయసప్తమములయందు కేతువున్నయెడల అపమృత్యుభ యము గలుగును. అట్టిదోషము పోవుటకై మృత్యుంజయపూ జయు సువర్ణతిల దానములును చేసినయెడల శాంతిగలుగును.

శనిదశలో శుక్రాంతర్దశ సం 3 మా 2

శ్లో॥ శనేరంతర్గతే శుక్రే కేంద్ర లాభత్రికోణగే
స్వోచ్చేద్వితీయ రాశిస్థే శుభగ్రహాయుతేక్షితే

గోభూమి ధనలాభంచ దూరదేశాద్ధనాయుతం
రాజసన్మానమర్ధాప్తిః పుత్రస్త్రీ ధనసంపదః
కృషిమూలాద్ద్రవ్యలాభముద్యోగస్యాభివర్ధనం॥

శనిదశలో శుక్రభుక్తియందు శుక్రుడు కేంద్రకోణములయందుగాని ఉచ్చయందుగాని ద్వితీయలాభములయందుగాని శుభగ్రహసంబంధవీక్షణములు గలిగియున్నయెడల పశువృద్ధి భూలాభము ధనలాభము దూరదేశమునందుండి ధనరాబడి రాజులవలన సన్మానము పుత్రవృద్ధి కళత్రసౌఖ్యము సంపత్తు వ్యవసాయమువలన ద్రవ్యలాభము ఉద్యోగాభివృద్ధి మొదలగు మంచిఫలములు గలుగును.

శ్లో॥ శనేరంతర్గతే శుక్రే నీచే షష్ఠాష్టరిష్ఫగే
శనైశ్చైవం చాష్టమేవారిష్ఫేవా షష్ఠసంస్థితే
ఉద్యోగభంగం దుఃఖంచ దారాపుత్ర వినాశనం
ఋణవృద్ధిర్వ్యేషంచ కృషిమూలాద్ధనవ్యయం
చోరాగ్ని దేహపీడాచ స్వబంధు జననాశనం
మహాదుఃఖ మవాప్నోతి ధనధాన్య వినాశనం॥

శనిమహాదశలో శుక్రాంతర్దశలో శుక్రుడు నీచయందుగాని లగ్నములగాయతుగాని లేక దశానాథునిలగాయతుగానిషష్ఠాష్టమ వ్యయస్థానములయందుగాని శుక్రుడున్నయెడల ఉద్యోగభంగము దుఃఖము భార్యాపుత్రులయొక్క నాశనము ఋణవృద్ధి వ్యవసాయనష్టము చోరులవల్లను అగ్నివల్లను బాధ

యున్ను శరీరపీడ బంధునష్టము గొప్పదుఃఖము ధాన్యనాశనము యివిమొదలగు చెడుఫలములు గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే యత్నకార్యవినాశనం
స్వప్రభోస్తువిరోధశ్చ చింతా ప్రాబల్యమేవచ
శశినాసంయుతేదృష్టే రత్నభూషణసంగ్రహః
ఉత్తమాశ్వాదిలాభశ్చ చిత్రవస్త్రాదిసంగ్రహః॥

రవియొక్క సంబంధవీక్షణములవలన కార్యనాశనము ప్రభువిరోధము విశేషచింత యివిగలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన రత్నములతోగూర్చిన అలంకారములు మంచిగుర్రములు చిత్రమైన వస్త్రములు యివి గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే వ్యాధిపీడాభయోద్భవం
సమానప్రభుకోపశ్చ దాయాదిజనపీడనం
బుధేనసంయుతేదృష్టే వేదశాస్త్రాదిచింతనం
బంధువృద్ధిశ్చకళ్యాణం పుత్రప్రాప్తిసువృద్ధిదా॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన వ్యాధివలన భయము సమానప్రభువుతో విరోధము జ్ఞాతులవలన భయము గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన వేదశాస్త్రములయందుచింతన బంధువృద్ధి కళ్యాణము పుత్రసంతానప్రాప్తి యివిమొదలగు మంచిఫలములుగలుగును.

శ్లో॥ గురుణా సంయుతేదృష్టే నిధిలాభో భవేద్ధ్రువం
యజ్ఞదీక్షాదిసత్కర్మ లభతేనాత్రసంశయః
శనినాసంయుతేదృష్టే దారావర్గవినాశనం
స్వప్రభోస్తుమహత్కష్టం స్వవారేన్నృపపీడనం॥

గురునియొక్క సంబంధ వీక్షణములవలన నిధిలాభము యజ్ఞదీక్ష మొదలైన సత్కర్మలుచేయుటయుగలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన భార్యవైపు వారియొక్కనష్టము ప్రభువువలన విశేషబాధ శుక్రవారమందు రాజులవలన పీడయు గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిత్కేలాభగేపివా।
శుభగ్రహాయుతేవాపి లాభం భూపాలపూజనం।
అతిసౌఖ్యంసుతప్రాప్తిం గృహేగోధనసంకులం।
వాహనాంబరలాభంచ వ్యవసాయవివృద్ధిదం।

దశానాథుని లగాయతు శుక్రుడు కేంద్రకోణముల యందుగాని తృతీయలాభముల యందుగాని రాజదర్శనము అందువలన విశేషలాభము అతిసౌఖ్యము పుత్రసంతానప్రాప్తి గృహమందు గోవులు ధనము మొదలగునవి గలుగుటయువి లభించును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం ఛాగదంచకమాచరేత్॥

ద్వితీయసప్తమ స్థానములయందు శుక్రుడున్న యెడల

అపమృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై మేక దానమును చేసినయెడల సౌఖ్యముగలుగును.

శనిదశలో రవిభుక్తి మా 11 రో 12

శో॥ శనేరంతర్గతేభానౌ తృతీయేషష్ఠలాభగే।
స్వోచ్ఛేవాశుభరాశిస్థే శుభగ్రహాయుతేక్షితే ।
ఆరోగ్యంధనలాభంచ గౌరవం పితృసౌఖ్యదం ।
నేత్రవాహనసౌఖ్యంచ రాజసన్మానవైభవం ।

శనిదశలో రవ్యంతర్దశయందు రవితృతీయషష్ఠలాభములయందున్నయెడల ఆరోగ్యము ధనలాభము గౌరవము పితృసౌఖ్యము నేత్రసౌఖ్యము వాహనసౌఖ్యము రాజసన్మానము మొదలగునవి గలుగును.

శో॥ శనేరంతర్గతేభానౌ కేంద్రేవాకోణసంస్థితే ।
నీచేవాష్టమరిష్ఫేచ పాపగ్రహాయుతేక్షితే ।
రాజశతృభయంమృత్యుర్ధనహానిః పితుర్భయం ।
పిత్తజ్వరశిరోరోగః ప్రవాసః కుక్షిపీడనం ।
బంధుహానించయుద్ధంచ దారిద్ర్యంమానభంజనం ।
మానహానిర్మహాదుఃఖం కారాగృహనివేశనం ।

శనిదశలో రవ్యంతర్దశయందు రవి కేంద్రకోణములయందుగాని నీచయందుగాని అష్టమవ్యయముల యందుగాని పాపగ్రహసంబంధుడై యున్నయెడల రాజులవల్లనుంచిన్ని శతృవులవల్లనుంచిన్ని భయమున్నూ మరణభయము ధనహాని పితృ

భయము పిత్తజ్వరము శిరోరోగము ప్రవాసము కుక్షిపీడబంధు నాశనము యుద్ధభయము దరిద్రము మానభంగము విశేషదుఃఖము కారాగృహప్రాప్తి యివిగలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే మతిభ్రంశంమహద్భయం
సర్వత్రకలహశ్చైవ అతిసారాదికం భయం
కుజేనసంయుతేదృష్టే జ్వరస్ఫోటభయంతథా
వస్త్రఘాతాదిబాధాచ నీచానాంకలహంతథా ॥

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మతిచాంచల్యము విశేషభయము సమస్తజనులతో కలహము అతిసారరోగమువలన భయమున్ను గలుగును.

కుజునియొక్క సంబంధవీక్షణములవలన జ్వరముస్ఫోటకభయము శస్త్రములనుంచి దెబ్బతగులుటవలన బాధయున్ను నీచులతో కలహమున్ను గలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే తీర్థయాత్రాదిజంఫలం ।
స్వవారేనృపసన్మానం క్రయవిక్రయకౌశలం ॥
గురుణా పుత్రరోగాది దేహబాధా ధనక్షయం ।
స్వస్త్రీగర్భవినాశంచ చింతావ్యాధిసమాకులం॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన తీర్థయాత్రలు సేవించుటవలన ఫలము బుధవారమునందు రాజసన్మానము వర్తకమునందు నేర్పరితనము గలుగును.

గురునియొక్క సంబంధమువలన పుత్రులకు రోగభయ

ము ధనసష్టము కళత్రమునకు గర్భస్రావముగలుగుట చింత వ్యాధివలన భయమును గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే చతుష్పాజ్జీవలాభకృత్
వస్త్రాభరణసంప్రాప్తి ర్యత్నసిద్ధిర్భవిష్యతి
శనినావ్యాధిశోకంచ పితృవర్గవినాశనం
స్వభృత్యజననాశంచ నానాధాన్యవినాశనం॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన పశులాభము వస్త్రములు ఆభరణములు వీనియొక్క సంపాదనకార్యసిద్ధి యివిగలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన వ్యాధి అందువలనవిచారము పితృవర్గవినాశనము సేవకనష్టము ధాన్యనాశనము నుగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యే లాభగేపివా
శుభగ్రహయుతేవాపి ధనధాన్యసుఖప్రదః
ప్రాంచ్యాందిశిప్రయాణం స్యాదత్యంతకలహోభవేత్
దారాపుత్రాదిసౌఖ్యంచ పశులాభోభవేత్సుఖం॥
మిత్రప్రభువశాత్సౌఖ్యం యత్నసిద్ధిర్భవిష్యతి॥

దశానాథుని లగాయతురవి కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహసంబంధవీక్షణములు గలిగియున్నయెడల ధనము ధాన్యము సుఖము కీర్తి ప్రతాపము యుద్ధమందు శత్రువులనుజయించుట తూర్పుదిక్కునకు

ప్రయాణమువలన అధికకలహము భార్యాపుత్రులయొక్క సౌఖ్యము పశులాభము మిత్రప్రభువల్ల మంచి సౌఖ్యము యత్నకార్యసిద్ధి యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవావ్యయేవాపాపసంయుతే
తద్భుక్తౌవ్యాధిపీడాచసమానజననాశనం
కలహంవ్యాధిపీడాచమతిభ్రంశంమనోవ్యథా
చతుష్పాజ్జీవనాశంచయుద్ధేశత్రుభయంతథా

దశానాధుని లగాయతు రవిషష్ఠాష్టమవ్యయములయందు పాపసంబంధవీక్షణములు గలిగియున్నయెడల అట్టిఅంతర్దశయందు వ్యాధిభయము సమానజననాశనము కలహముమతిచాంచల్యము మనోవ్యాకులత పశునాశనము యుద్ధమందుశత్రుభయమును గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థంసూర్యప్రార్థనమాచరేత్
స్వర్ణగర్భితకుష్మాండదానేనారోగ్యమావిశేత్॥

ద్వితీయ సప్తమస్థానములయందు రవియున్నయెడల అపమృత్యుభయముగలుగును. అట్టిదోషము పోవుటకై సూర్యప్రార్థనయు స్వర్ణమువుంచబడిన పెద్దగుమ్మడికాయదానమును యిచ్చినయెడల శాంతిగలుగును.

శనిదశలోచంద్రభుక్తిసం1 మా 7

శ్లో॥ శనేరంతర్గతేచంద్రే కేంద్రేలాభత్రికోణగే
ఆరోగ్యంధనసంపత్తిర్భూషణంవాహనంతథా

మిత్రాన్నాంవర్ధనంచ్చైవకృషివాణిజ్యవర్ధనం॥

శనిదశలో చంద్రాంతర్దశయందు చంద్రుడు కేంద్రకోణములయందుగాని లాభమందుగాని వున్నయెడల ఆరోగ్యము ధనసంపత్తిభూషణము వాహనము మిత్రులయొక్క అభివృద్ధియున్ను వ్యవసాయాభివృద్ధియు గలుగును.

శ్లో॥ శనేరంతర్గతేచంద్రేనీచేషష్ఠాష్టరిప్ఫగే
కృషిబంధోధాన్యహానిఃకువస్త్రంచకుభోజనం
మాతాపితృవిపత్తిశ్చస్వజనేషువిరోధితా॥

శనిదశలో చంద్రాంతర్దశయందు చంద్రుడునీచయందుగాని షష్ఠాష్టమవ్యయములయందుగాని ఉన్నయెడలవ్యవసాయనష్టము ధాన్యహాని జీర్ణవస్త్రములు భోజనసౌఖ్యము లేకపోవుటయు మాతాపితృలయొక్క నష్టము స్వజనులతో విరోధము యివిగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టేశిరోరోగంత్వథైవచ
పితృవర్గవిరోధంచస్వస్థానేభయకృద్భవేత్॥
కుజేనసంయుతేదృష్టేయుద్ధేభయమవాప్నుయాత్
దాయాదికలహాశ్చైవశత్రువృద్ధిర్భవిష్యతి॥

రవియొక్క సంబంధవీక్షణములవలన శిరోరోగముపితృవర్గముతో విరోధము స్థానభ్రష్టత్వము గలుగును.

కుజునియొక్క సంబంధవీక్షణములవలన యుద్ధమందు భయముగలుగుట జ్ఞాతివిరోధము శత్రువృద్ధి యివిగలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టేధర్మవృద్ధిపరోభవేత్
అన్నదానపరోనిత్యం దేవబ్రాహ్మణపూజనం॥
గురుణాశ్వాదిలాభంచ గృహేకళ్యాణసంభ్రమం
మహారాజప్రసాదేనఇష్టసిద్ధిస్సుఖాధికం॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన ధర్మకార్యవృద్ధి నిత్యాన్నదానము దేవబ్రాహ్మణపూజయుగలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన అశ్వలాభముము గృహమందు కళ్యాణముజరుగుటయు రాజానుగ్రహమువలన ఇష్టకార్యసిద్ధి సౌఖ్యము గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టేక్షీరాన్నంరాజపూజ్యతా
అధికారాదిసిద్ధిశ్చమహారాజాశ్రియస్తథా॥
శనినాసంయుతేదృష్టేవాతరోగాదిపీడనం
స్వభృత్యపశునాశంచనీచారికలహంతథా॥



శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన క్షీరాన్నభోజనము రాజపూజ్యత ఉద్యోగప్రాప్తి మహారాజానుగ్రహము యివిగలుగును.



శనియొక్క సంబంధవీక్షణములవలన వాతరోగమువలన పీడయు భృత్యులు పశువులు వీనియొక్క నాశనమునీచులతో కలహము యివిగలుగును.

శ్లో॥ రాహుశాత్కేంద్రకోణేవాదుశ్చిక్యేలాభగేపివా
శుభగ్రహయుతేవాపిశుభంఫలముదీరయేత్

విచిత్రవస్త్రలాభంచధనధాన్యాదిసంగ్రహం.
అపూర్వవస్తుసంప్రాప్తింపండితానాంసమాగమం
పుణ్యతీర్థాదిగమనందూరాదాహ్వానపత్రికా
యత్నకార్యార్థసిద్ధించనానామూలాద్ధనాగమం॥

దశానాథునిలగాయతు చంద్రుడు కేంద్రకోణముల యందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహయుక్తుడై యున్నయెడల శుభఫలమును విచిత్రవస్త్రలాభమును ధనము ధాన్యము వీటిలాభము అపూర్వవస్తుసంప్రాప్తి పండితుల యొక్క సమాగమము పుణ్యతీర్థములు సేవించుట యత్నకార్యసిద్ధి అనేకవైపులనుంచి ధనరాబడి యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవావ్యయేవా పాపసంయుతే
దూరయాత్రా కార్యహానిస్సంగ్రామే ప్రాణహానికః
బాంధవాని విరోధశ్చ నానాచింతాపశుక్షయః
అర్థవ్యయంచదుఃఖంచ అశ్వనాశోభవిష్యతి॥

దశానాథునిలగాయతు చంద్రుడు షష్ఠాష్టవ్యయముల యందు పాపగ్రహసంబంధవీక్షణములు గలిగియున్నయెడల దూరయాత్రాసేవనము కార్యహాని యుద్ధమందు మరణభయము గలుగుట బంధువిరోధము అనేకవిధములుగా విచారము గలుగుటయు పశునాశనము ధననష్టము దుఃఖము అశ్వనాశనము యివిగలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం శ్వేతాంగాం దానమాచరేత్
ద్వితీయసప్తమములయందు చంద్రుడున్నయెడల మర
ణభయము గలుగును. అట్టిదోషము పోవుటకై తెల్లనిగోవును
దానము చేయవలెను.

శనిదశలో కుజభుక్తి సం 1 మా 1 రో 9

శ్లో॥ శనేరంతర్గతే భౌమే తృతీయే షష్టలాభగే
భూలాభశ్చాధికారాప్తిరారోగ్యం విజయోధనం
భ్రాతృసౌఖ్యబలం మానం వాహనం శుభమాప్నుయాత్
భూలాభం ధనలాభంచ మిత్రబంధు సమాగమం॥
కుజుడు తృతీయమందుగాని షష్టమమందుగాని లాభ
మందుగాని యున్నయెడల భూలాభము అధికారారోగ్యము విజ
యము ధనలాభము భ్రాతృసౌఖ్యము బలము మానము వాహ
నము శుభకార్యములు జరుగుట భూలాభము బంధుమిత్ర
సమాగమము యివిగలుగును.

శ్లో॥ మందస్యాంతర్గతే భౌమే నీచే వాష్టమరిప్ఫగే
కేంద్రేవాకోణసంస్థేచ పాపగ్రహయుతేక్షితే
ఉష్ణవాతామయశ్చైవ దుఃఖం దేశాటనంతథా
కష్టాధిక్యం ఫలాల్పత్వం దారాపుత్రాదిపీడనం॥
కుజుడు నీచయందుగాని అష్టమ వ్యయములందుగాని
కేంద్రకోణముల యందుగాని పాపగ్రహయుతుడై యున్న

యెడల ఉష్ణవాతరోగము దుఃఖము దేశాటనము మిక్కిలి కష్టము స్వల్ప ఫలము దారాపుత్రాదిపీడయు గలుగును.

శ్లో॥ రవిణాసంయుతే దృష్టే బంధుప్రీతిః ప్రజాయతే
వివాహ కార్యయత్నాని భూపాలాత్సుఖమశ్నుతే
చంద్రేణసంయుతే దృష్టే ముక్తామణిసుసంగ్రహః
అపూర్వవస్తుసంప్రాప్తిః ఇష్టసిద్ధిర్భవిష్యతి॥

రవియొక్క సంబంధవీక్షణములవలన బంధుప్రీతి వివాహాది శుభకార్యములు జరుగుటయు రాజులవల్లనుంచి సౌఖ్యమును గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన ముత్యములు మణులు మొదలగువాని సంగ్రహము అపూర్వవస్తుసంపాదన ఇష్టకార్యసిద్ధి యివిగలుగును.

శ్లో॥ బుధేనసంయుతే దృష్టే బంధూనాముపకారకమ్
స్వస్త్రీవిలాసంపాండిత్యం విచిత్రగృహలాభకృత్
గురుణాసంయుతే దృష్టే పుత్రపీడాధనక్షయం
దేహబాధామతిభ్రంశం స్వాధికార వినాశనం॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన బంధూపకారము భార్యయొక్క సౌఖ్యము పాండిత్యము విచిత్రగృహలాభము యివిగలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రపీడధనవ్యయము దేహబాధ మతిచాంచల్యము ఉద్యోగభంగము యివిగలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే భోగస్త్రీ భోగవైభవం
గృహేకళ్యాణసంపత్తిం వస్త్రలాభం విచిత్రకం
శనినాసంయుతేదృష్టె నీచసేవామహద్భయం
ఉద్యోగచలనంచైవ సమానజనపీడనం॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన వేశ్యాసంభోగము గృహమందు కళ్యాణవైభవము సంపత్తు వస్త్రలాభము గలుగును.

శనియొక్క సంబంధమువలన నీచసేవ విశేషభయము ఉద్యోగభంగము సమానజనపీడ యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా షష్టేలాభతృతీయగే
భౌమే బలయుతేవాపి వివాహాది సుఖప్రదం
స్త్రీపుత్రసౌఖ్యం సుఖదం మనోత్సాహం తథైవచ
భూలాభం ధాన్యవృద్ధించ గోలాభం ధనవృద్ధిదం
యత్నకార్యార్థసిద్ధించ దేహారోగ్యం తథైవచ॥

దశానాథునిలగాయతు కుజుడు కేంద్రకోణములయందుగాని తృతీయ షష్టలాభములయందుగాని బలయుక్తుడైయున్నయెడల వివాహాది సౌఖ్యములు స్త్రీపుత్రసౌఖ్యము భూలాభము ధాన్యవృద్ధి పశులాభము ధనవృద్ధి యత్నకార్యసిద్ధి మనోత్సాహమున్ను గలుగును.

శ్లో॥ దాయేశాదష్టమేరాశౌ వ్యయేవానీచరాశిగే
అపకీర్తిభయంచైవ మానహానిర్భవిష్యతి

చోరాగ్నిరిపుబాధాచ స్థాననాశంతథైవచ
యత్నకార్యవినాశశ్చ శత్రుబాధాభవిష్యతి॥

దశానాథుని లగాయతు కుజుడు అష్టమవ్యయముల యందుగాని నీచయందుగాని యున్నయెడల అపకీర్తి భయము మానభంగము యివిగలుగును. మరియును చోరులవల్లను అగ్నివల్లను రాజులవల్లను భయము స్థానభ్రష్టత్వము యత్నకార్య వినాశనము యివిగలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం మహిషీదానమాచరేత్॥

ద్వితీయసప్తమములయందు కుజుడున్నయెడల అపమృత్యుభయముగలుగును. అట్టిదోషముపోవుటకై గేదెనుదానమును జేసినయెడల సౌఖ్యముగలుగును.

శనిదశలో రాహుభుక్తి సం 2 మా 10 రో 6.

శ్లో॥ శనేరంతర్గతే రాహౌ తృతీయే షష్ఠలాభగే
క్వచిత్సౌఖ్యంక్వచిద్ధాన్యం క్వచిత్కీర్తింక్వచిద్ధనం
వస్త్రవాహనభూషాప్తిం క్రియవిక్రియభూషణం॥

రాహువు తృతీయషష్టలాభములయందున్నయెడల స్వల్పసౌఖ్యము స్వల్పధాన్యము స్వల్పకీర్తిస్వల్పధనము వస్త్రవాహనభూషణప్రాప్తి వస్తువులుకొనుట అమ్ముటయు గలుగును.

శ్లో॥ శనేరంతర్గతే రాహౌ నీచేవాష్టమరిష్ఫగే
కేంద్రేవాకోణసంస్థేచ పాపగ్రహాయుతేక్షితే

గృహదాహోక్షిరోగశ్చ దారాపుత్రమహద్భయం
స్థానచ్యుతింమనోదుఃఖం నిజాచారవివర్జితం॥

యీ రాహువు నీచయందుగాని అష్టమవ్యయములయందుగాని కేంద్రకోణములయందుగాని పాపగ్రహయుక్తుడై యున్నయెడల గృహము దగ్ధమగుటయు నేత్రరోగము భార్యాపుత్రభయము స్థానభ్రష్టత్వము మనోదుఃఖము ఆచారము విడిచిపెట్టుటయు యివిగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే రాజదండోధనక్షయః
పైత్యభ్రమణరోగాది దుర్గారణ్యచరోభవేత్
శశినాసంయుతేదృష్టే మాతృపీడామహద్భయం
అభిమానాదిభంగంచ హ్యపకీర్తిభయంతథా॥

రవియొక్క సంబంధవీక్షణములవలన రాజదండన, ధననష్టము, మతిచాంచల్యము మహారణ్య సంచారము యివిగలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మాతృపీడ విశేషభయము అభిమానము మానభంగము అపకీర్తి భయమున్నూ గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే శత్రువర్గకృతంభయం
సహోదరవినాశశ్చ అగ్నిబాధాభవిష్యతి
బుధేనసంయుతేదృష్టే విద్యాలాభోభవిష్యతి
వస్త్రాభరణవృద్ధిశ్చ మిత్రవర్గవిరోధకృత్॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన శస్త్రములవల్ల నుంచి స్వబంధువులవల్లనుంచి భయము సోదరనష్టము అగ్నిబాధ యివిగలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన విద్యాలాభము వస్త్రములు ఆభరణములు వీనియొక్క సంపాదన స్నేహితులతో విరోధము యివిగలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే కులాచారవినాశనం
పుత్రపీడాద్రవ్యహానిః దేహబాధాభవిష్యతి
శుక్రేణసంయుతేదృష్టే దారాపుత్రవినాశనం
స్త్రీవివాదంమనఃక్లేశం వాహనాదిపశుక్షయం॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన కులాచారమునువిడిచిపెట్టుటయు పుత్రపీడ ధననష్టము శరీరబాధ యివిగలుగును.

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన దారాపుత్రవినాశనము స్త్రీలతోవాదము మనోవిచారము వాహనములు పశువులుమొదలగువాని నాశనమునుగలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే సమానజవనాశనం
చండాలజనసంవాదం తస్మాల్లాద్ద్రవ్యనాశనం॥

శనియొక్క సంబంధవీక్షణములవలన సమానమనుజునియొక్క నాశనము చండాలురతో విరోధము వారిమూలముగా ధనష్టమున్నూ గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్టగే కేంద్రే త్రికోణేలాభగేపివా
తృతీయేశుభసంయుక్తే ధనధాన్యసమృద్ధిదః
యానవాహానసంప్రాప్తిః దారాపుత్రాదిసౌఖ్యదః
సమానప్రభుసన్మానం వివిధైర్ధనలాభకృత్॥

దశానాథునిలగాయతు రాహువు షష్ఠమమందుగాని కేంద్రమందుగాని తృతీయలాభములయందుగాని కోణములయందుగాని బలయుక్తుడై యున్న యెడల ధనధాన్యసమృద్ధి పల్లకి వాహనము మొదలగువాని సంప్రాప్తి భార్యాపుత్రులయొక్క సౌఖ్యము సమానమైనప్రభువుయొక్క అనుగ్రహము అనేకవిధములుగా ధనలాభమున్నూ గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రగేసే చేవ్యయేవాపాపసంయుతే
కరోతివిపులంకష్టం మహదాపత్సుసంభవం
బంధుశోకంవ్యాకులంచ విధవాకలహంతథా
దాయాదికలహంచైవరాజ మూలాద్ధనక్షయం॥

దశానాథునిలగాయతు రాహువు కేంద్రములయందుగాని నీచయందుగాని వ్యయమందుగాని పాపయుక్తుడైయున్న యెడల విశేషకష్టములు గొప్పఆపత్తు బంధుశోకము, వ్యాకులత, విధవలతో కలహము జ్ఞాతివిరోధము రాజమూలకముగా ధననష్టమున్నూ గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థే వామృత్యుబాధానసంశయః
తద్దోషపరిహారార్థం నాగదానంచకారయేత్
సుబ్రహ్మణ్యజపంకుర్యా ద్దానేనారోగ్యమాప్నుయాత్॥

ద్వితీయసప్తమములయందు గ్రహమువున్నయెడల అప మృత్యుభయముగలుగును. అట్టిదోషముపోవుటకై నాగదానము సుబ్రహ్మణ్యజపమునుచేసిన యెడల ఆరోగ్యముగలుగును.

శనిదశలో గురుభుక్తి సం 2 మా 6 రో 12

శ్లో॥ శనేరంతర్గతేజీవే స్వోచ్చకేంద్రత్రికోణగే
లాభేవాధనరాశిస్థే।భార్యావిభవతోషితః
దేవద్విజార్చనంచైవ పుత్రదారధనాన్వితం
జయమానాన్వితంసౌఖ్యం రాజసన్మానవైభవం॥

గురుడుఉచ్చయందుగాని కేంద్రకోణములయందుగాని ధనలాభములయందుగాని ఉన్నను భార్యాసౌఖ్యమును దేవబ్రాహ్మణపూజయున్ను పుత్రదారసౌఖ్యమున్ను రాజసన్మానమున్ను జయమున్ను గలుగును.

శ్లో॥ శనేరంతర్గతే జీవేనీచేషష్ఠాష్టరిష్ఫగే
ధర్మక్షయోవిత్తహానిర్గ్రామణ్యంచాపసౌఖ్యకం
కుటుంబకలహంచైవ మహద్దుఃఖంభవిష్యతి॥

శనిలో గుర్వంతర్దశయందు గురుడు నీచయందుగాని షష్ఠాష్టవ్యయములయందుగాని ఉన్నయెడల ధర్మక్షయము ధననష్టము గ్రామాధికారము అపసౌఖ్యము కుటుంబకలహము మహాదుఃఖమున్ను గలుగును.

శ్లో॥ రవినాసంయుతేస్పష్టే గురుదేవద్విజార్చనం
తీర్థయాత్రాఫలప్రాప్తి శ్శివపూజాఫలప్రదః

శశినాసంయుతే దృష్టే పుత్రనాథత్వమేవచ
అశ్వాందోళ్యాదిలాభంచ యుద్ధేచజయమాప్నుయాత్ ॥

రవియొక్క సంబంధవీక్షణములవలన గురువు దేవతలు బ్రాహ్మణులు పెద్దలయొక్క పూజయు తీర్థయాత్రాఫలము శివపూజాఫలము యివిగలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన గ్రామాధికారము గుర్రములు పల్లకీమొదలగువాని లాభము యుద్ధమందుజయమున్ను గలుగును.

శ్లో॥ కుజేనసంయుతే దృష్టే ప్రవాళమణిలాభకృత్
సహోదరాదివృద్ధిశ్చ క్షేత్రవృద్ధిస్తుజాయతే
బుధేనసంయుతే దృష్టే గురుపూజాభవిష్యతి
శివపూజాదిసిద్ధిశ్చ పుత్రప్రాప్తిర్భవిష్యతి॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన పగడములు మణులు మొదలగువాని లాభమును సోదరసౌఖ్యము భూవృద్ధి యివిగలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన గురుపూజయు శివపూజ పుత్రసంతానప్రాప్తి యివిగలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతే దృష్టే స్త్రీసౌఖ్యంబహులాభకృత్
వాహనంభూషణప్రాప్తిః మహారాజాశ్రయ స్తథా
శనినాసంయుతే దృష్టే దాసీదాసవినాశనం
పశుధాన్యవినాశశ్చ దేహబాధాభవిష్యతి॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన స్త్రీసౌఖ్యము విశేషలాభము వాహనము భూషణములు రాజానుగ్రహము గలుగును.

శనియొక్క సంబంధమువలన దాసదాసీజన నష్టము పశునష్టము ధాన్యనాశనము శరీరకష్టము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యేలాభగేపివా
శుభగ్రహయుతేవాపి కళ్యాణాదిశుభంభవేత్
పుత్రదారాదిసౌఖ్యంచ పుత్రజన్మాదిసంభవం
స్వప్రభోస్తుమహత్సౌఖ్యం రాజమూలాద్ధనాగమం
బ్రాహ్మణప్రభుమిత్రత్వం బంధూనాముపకారకం
యజ్ఞకర్మాదిసంప్రాప్తి రత్నదానపరోభవేత్

దశానాథునిలగాయతు గురుడు కేంద్రకోణములయందుగాని తృతీయ లాభములయందుగాని శుభగ్రహ సంబంధములుగలిగియున్నయెడల కళ్యాణాది సుఖములు దారాపుత్రాది సౌఖ్యము పుత్రోత్సవము స్వప్రభువువల్లనుంచిసౌఖ్యము రాజమూలకముగా ధనలాభము బ్రాహ్మణప్రభువువల్లనుంచి స్నేహము బంధూపకారము యజ్ఞకర్మలుచేయుటరత్నదానములుచేయుట యివి యీఅంతర్దశలయందు లభించును.

శ్లో॥ దాయేశాదష్టమేషష్ఠే వ్యయేవాపాపసంయుతే
గురుపుత్రవినాశాది సమానజననాశనం
మిత్రవర్గవిరోధత్వం ధననాశ స్తథైవచ
శూద్రసేవామహావ్యాధిః స్త్రీపీడాబంధుభిర్ద్వేషం॥

దశానాథునిలగాయతు షష్ఠాష్టవ్యయములయందు పాప యుక్తుడై గురువున్నయెడల అట్టిగురుభుక్తియందు గురుపుత్రి నాశనము సమానజననష్టము మిత్రులతో విరోధము ధన నాశనము శూద్రసేవ మహావ్యాధి స్త్రీలయొక్కయు బంధు వులయొక్కయు పీడ యివి గలుగును.

శ్లో॥ ద్వితీయద్యూననాథేవా అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం త్రియంబకజపంచరేత్
స్వర్ణేననిర్మితంఛాగదానేనారోగ్యమావిశేత్

ద్వితీయసప్తమములయందు గురువున్నయెడల మృత్యు భయముగలుగును. అట్టిదోషములుపోవుటకై త్రియంబక జప మును బంగారముతో చేయబడిన మేకదానమును చేసినయెడల సౌఖ్య ముగలుగును.

బుధమహాదశలో బుధభుక్తి సం 2 మా 4 రో 27

శ్లో॥ బుధస్యాంతర్గతేసౌమ్యే కేంద్రలాభత్రికోణగే
స్వోచ్ఛేవాధనరాశిస్థే శుభగ్రహయుతేక్షితే
కృషివాణిజ్యలాభంచ బంధుమిత్రసమాగమం
గణితంసిల్పకౌశల్యం దారాపుత్రాదివర్ధనం॥

బుధదశలో బుధాంతర్దశయందు బుధుడు కేంద్రకోణ ములయందుగాని తృతీయలాభములయందుగాని ఉచ్ఛయందు గాని ధనస్థానమందుగాని యున్నయెడల వ్యవసాయమువల్లను వర్తకమువల్లను లాభము బంధుమిత్రులతో స్నేహము గణిత

మందును శిల్పవిద్యయందును నేర్పును దారాపుత్రాభివృద్ధియు నగలుగును.

శ్లో॥ బుధస్యాంతర్గతేసౌమ్యే నీచేషష్ఠాష్టరిప్ఫగే
పుత్రదారార్థపీడాచ రోగోత్పత్తిర్మహాభ్భయం
కుటుంబకలహాంచైవ బుద్ధినాశోధనవ్యయః ॥

బుధాంతర్దశయందు బుధుడు నీచయందుగాని షష్ఠాష్ట వ్యయములయందుగాని యున్నయెడల పుత్రులయొక్కయు భార్యయొక్కయు పీడయును మహారోగము విశేషభయము కుటుంబకలహము బుద్ధినాశనము ధనవ్యయమును గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే దుర్గాధిశత్వమాప్నుయాత్
పితృవర్గశుభంచైవ రాజప్రీతిర్నసంశయః
శశినాసంయుతేదృష్టే స్వస్త్రీసౌఖ్యంసుతోదయం
భూషణానివిశేషాణి సంగ్రహస్వస్యమందిరే॥

రవియొక్క సంబంధమువలన పర్వతాధిపత్యము పితృవర్గాది సౌఖ్యము శుభము రాజసన్మానము యివిగలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన భార్యా సౌఖ్యము పుత్రప్రాప్తి విశేషాలంకారప్రాప్తి గృహమందు సౌఖ్యమును గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే యుద్ధేశతృవివృద్ధినం
దాయాదికలహాంచైవ వ్యవహారేపరాభవం
గురుణాసంయుతేదృష్టే సుతోత్పత్తిర్నసంశయః
దేవతాదర్శనప్రాప్తిస్యా పూర్వప్రియదర్శనం॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన యుద్ధమందు శత్రువృద్ధి జ్ఞాతివిరోధము వ్యవహారములయందు అపజయమును గలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రసంతానప్రాప్తి దేవతాదర్శనము యివిగలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే చిత్రవస్త్రాదిసంగ్రహం
యానవాహనసంప్రాప్తి మధికారాధిలబ్ధవాక్
శనినాసంయుతేదృష్టే నిగళంరాజవిడ్వరం
కారాగృహప్రవేశంచ బంధుద్వేషంతథైవచ॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన విచిత్రవస్త్రములు పల్లకీవాహనము ఉద్యోగప్రాప్తి యివిగలుగును.

శనియొక్క సంబంధ వీక్షములవలన నిగళము రాజదండన కారాగృహప్రవేశము బంధువిరోధము యివిగలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థే వాహ్యాపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం విష్ణుసాహస్రకంజపేత్॥

ద్వితీయసప్తమములయందు బుధుడున్నయెడల అపమృత్యు భయముగలుగును. అట్టిదోషముపోవుటకై విష్ణుసహస్రనామములు జపించినయెడల సౌఖ్యముగలుగును.

బుధదశలో కేతుభుక్తి మా 11 రో 27

శ్లో॥ బుధస్యాంతర్గతే కేతౌ కేంద్రలాభత్రికోణగే
క్వచిద్దుఃఖంక్వచిత్సౌఖ్యం మిత్రశత్రుసమాగమం
వాణిజ్యాత్స్వల్పలాభంచ వ్యనాశంతథైవచ

బుధదశలో కేతుభుక్తియందు కేతువు కేంద్రకోణములయందుగాని ఉచ్చయందుగాని లాభమందుగాని ఉన్నయెడల స్వల్పదుఃఖము స్వల్పసౌఖ్యము మిత్రశత్రుసమాగమము యివిగలుగును.

శ్లో॥ బుధస్యాంతర్గతే కేతౌ షష్ఠాష్టవ్యయరిప్ఫగే
పుత్రమిత్రాదిమరణం పితుర్నాశమథాపివా
స్థానార్థకలహోయానం మిత్రబంధువిరోధితా॥

యీ కేతువు షష్ఠాష్టవ్యయములయందున్నయెడల పుత్రులయొక్కయు స్నేహితులయొక్కయు మరణమున్ను పితృనష్టము స్థానభ్రష్టత్వము బంధువులతోను మిత్రులతోను విరోధము గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే శిరోరోగంమహద్భయం
పైత్యరోగవివృద్ధించ నృపచోరాగ్నిపీడనం
శశినాసంయుతేదృష్టే మాతృనష్టంమనోవ్యథా.
అకాలభోజనంచైవ ధననాశంతథైనచ

రవియొక్క సంబంధ వీక్షణముల వలన శిరోరోగము విశేషభయము పైత్యరోగవృద్ధి రాజులవల్లను అగ్నివల్లను చోరులవల్లను భయమున్ను గలుగును.

చంద్రునియొక్క సంబంధ వీక్షణములవలన మాతృనష్టము మనోవ్యాకులత అకాలభోజనము ధననష్టమును దేవతాదర్శనప్రాప్తిహ్యా

# దశాఫలాధ్యాయము.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే భాతృవంశవినాశనం
శస్త్రచోరాగ్నిబాధాచ విషసర్పాదిజంభయం
బుధేనసంయుతేదృష్టే బాంధవానాం వివృద్ధిదం
వివాహాదిశుభంచైవ యత్నకార్యార్థసిద్ధిదం

కుజునియొక్క సంబంధ వీక్షణములవలన సోదరవంశము నశించుటయు శస్త్రమువల్లను అగ్నివల్లను దొంగలవల్లను భయమున్ను విషమువల్లను సర్పవిషమువల్లను భయమున్ను గలుగును.

బుధునియొక్క సంబంధ వీక్షణమువలన బంధువృద్ధి వివాహాదిశుభకార్యములుజరుగుటయు కార్యసిద్ధి యివిగలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే గురుద్వేషంసుతక్షయం
సుమిత్రరాజకోపంచసమానజననాశనం
శుక్రేణసంయుతేదృష్టే స్త్రీపుత్రకలహాంతథా
సర్వత్రకలహంచైవ యానవాహననాశనం

గురునియొక్క సంబంధవీక్షణములవలన గురుద్వేషము పుత్రనాశనము ముఖ్యస్నేహితునితోను రాజులతోను విరోధము సమానమనుజునియొక్క నష్టము యివిగలుగును శుక్రునియొక్క సంబంధ వీక్షణములవలన స్త్రీలతోను పుత్రులతోను కలహమున్ను సమస్తజనులతో ద్వేషము వాహనాదినష్టమున్ను గలుగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే సమానజననాశనం
కృషిక్షేత్రవినాశంచ ధాన్యనాశంతథైవచ

శనియొక్క సంబంధవీక్షణములవలన సమానమనుజుని యొక్కనష్టము భూమివ్యవసాయము వీనియొక్కయు ధాన్యము యొక్కయు నాశనమును గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా
షష్ఠేవాశుభసంయుక్తె ధనవృద్ధింతథైవచ
గోలాభం చాశ్వలాభంచ స్త్రీసౌఖ్యంబంధుసంయుతం
విద్యాలాభంకీర్తిలాభం యత్నకార్యార్థసిద్ధిదం

దశానాథుని లగాయతు కేతువు కేంద్రకోణములయందుగాని తృతీయలాభముల యందుగాని షష్టమమందుగాని శుభయుక్తుడై యున్నయెడల ధనవృద్ధి గోలాభము అశ్వలాభము స్త్రీసౌఖ్యము బంధుసన్మానము విద్యాలాభము కీర్తి యత్నకార్యసిద్ధి యినిగలుగును.

శ్లో॥ దాయేశాద్రంధ్రగేవాపి వ్యయేవాపాపసంయుతే
అతికష్టంమానభంగమపకీర్తి భయంతథా
సమానజననాశంచ స్త్రీపీడాబంధునిగ్రహం
సమస్తవస్తునాశంచ చతుష్పాజ్జీవనాశనం

దశానాథుని లగాయతు కేతువు అష్టమమందుగాని వ్యయమందుగాని పాపయుక్తుడై యున్నయెడల మిక్కిలికష్టము మానభంగము అపకీర్తి భయము సమానమనుజునియొక్క నష్టము స్త్రీపీడ బంధువిరోధము సమస్తవస్తునాశనము పశునష్టము యివిగలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థేహ్యపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం మహిషీదానమాచరేత్ ॥

ద్వితీయ సప్తమములయందు కేతువున్నయెడల అప
మృత్యుభయము గలుగును అట్టి దోషముపోవుటకై గేదెను
దానము చేయవలెను.

బుధదశలో శుక్రభుక్తి సం౨ మా౧౦

శ్లో॥ బుధస్యాంతర్గతేశుక్రేస్వోచ్చేవా కేంద్రకోణగే
రాజసన్మానమర్థాప్తిం పుత్రస్త్రీధనసంపదః
వస్త్రవాహనభూషాప్తిం దేహారోగ్యంమహత్సుఖం॥

బుధునిదశలో శుక్రభుక్తియందు శుక్రుడుఉచ్చయందు
గాని కేంద్రకోణములయందుగాని ఉన్నయెడల రాజసన్మానము
ధనలాభము పుత్రస్త్రీధనసంపత్తు వస్త్రములు వాహనములు
భూషణములు వీనిలాభము శరీరసౌఖ్యము విశేషసుఖమును
గలుగును.

శ్లో॥ బుధస్యాంతర్గతేశుక్రేనీచే షష్టాష్టరిప్ఫగే
ఉద్యోగభంగంక్లేశంచ స్వబంధుజననాశనం
భూవివాదం స్వబంధూనాంనాశనం స్వపదచ్యుతిం॥

బుధునియొక్క దశలో శుక్రభుక్తియందు శుక్రుడు
నీచయందుగాని షష్టాష్టవ్యయముల యందుగాని ఉన్నయెడల
ఉద్యోగభంగము దుఃఖము బంధునాశనము భూవివాదయు
ముఖ్యబంధువునియొక్క మరణము స్థానభ్రష్టత్వము యివి
గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే రాజకోపోధనక్షయః
యత్నకార్యవినాశశ్చస్వస్థానచలనంభవేత్
చంద్రేణసంయుతేదృష్టే మాతృకష్టం మనోవ్యథాం॥
చింతితార్థవినాశంచ సర్వకార్యవినాశనం

రవియొక్క సంబంధవీక్షణముల వలన రాజకోపము ధననష్టము యత్నకార్యసిద్ధి స్వస్థానచలనము యివి గలుగును చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మాతృపీడమనో వ్యాకులత అర్థనాశనము సర్వకార్యభంగమును గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే స్త్రీమూలాత్కలహోభవేత్
కళత్రదేహబాధాచ సోదరద్వేషమాప్నుయాత్
బుధేనసంయుతేదృష్టే ధర్మచింతాపరోభవేత్
గణితాగమశిల్పాదివిద్యా సంగ్రహతత్పరః॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన స్త్రీమూలకముగా కలహము కళత్రశరీరమునకుపీడ సోదరునితోవిరోధమున్ను గలుగును

బుధునియొక్క సంబంధ వీక్షణములవలన ధర్మకార్యములు చేయుటయందిష్టము గణితమునందును వేదశాస్త్రముల యందును శిల్పవిద్యయందును నేర్పునుయివి గలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే పుత్రవృద్ధింధనాగమం
దేహారోగ్యంచ కీర్తించ సర్వకార్యసుసిద్ధిదం

శనినాసంయుతేదృష్టే స్వభృత్య కలహంతథా
కృషిక్షేత్రి వినాశంచ ధనధాన్య వినాశనం॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన సంతానసౌఖ్యము ధనలాభము శరీరసౌఖ్యము కీర్తి సర్వకార్యములు నెరవేరుటయు గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన భృత్యులతో విరోధము భూనాశనము వ్యవసాయనష్టము ధనధాన్యనాశనము గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణే వాతృతీయే లాభగేపివా
శుభగ్రిహాయుతేవాపి హేమభూషణావృద్ధిదం
దుకూలవస్త్రసంప్రాప్తిము పూర్వవస్తుసంగ్రిహం
పశువాహానవృద్ధించ గృహేకళ్యాణ సంభ్రిమం
దారాపుత్రాదిసౌఖ్యంచ మిత్రప్రభువ శాత్సుఖం
అన్నదానరతోనిత్యం బంధూనాముపకారకం॥

దశానాథుని లగాయతు శుక్రుడు కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహసంబంధములు గలిగియున్నయెడల సువర్ణవస్తుసంప్రాప్తి పట్టువస్త్రముల సంపాదన అపూర్వవస్తుసంపాదన పశువృద్ధి వాహానసౌఖ్యము గృహమందు కళ్యాణము జరుగుటయు దారాపుత్రసౌఖ్యము మిత్రప్రభువువల్లనుంచి సౌఖ్యము నిత్యాన్నదానపరుడును బంధువుపకారమున్ను గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రే వావ్యయేవా పాపసంయుతే
నీచరాశిగతేవాపి దారపీడా భవిష్యతి
సమానజనపీడాచ యాత్రాయాం కార్యనాశనం
దూరాదప్రియవార్తాచవ్యాకస్మాత్కలహ స్తథా॥

దశానాథునిలగాయతు శుక్రుడు షష్ఠాష్టవ్యయముల యందు పాపగ్రహయుక్తుడై యున్న యెడలను నీచయందున్నను కళత్రపీడయు సమానమనుజునియొక్క శరీరపీడయు యాత్రయందు కార్యనాశనమును దూరస్థలమునుంచి అప్రియ వార్తయు అకస్మాత్తుగా కలహమున్ను గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుభయంతథా
తద్దోషపరిహారార్థం శ్వేతాంగాం దానమాచరేత్
దుర్గాలక్ష్మీజపం కుర్యాదాయురారోగ్యవర్ధనం॥

ద్వితీయసప్తమములయందు శుక్రుడున్న యెడల అపమృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై తెల్లని గోవును దానమును దుర్గాలక్ష్మీజపమును చేసినయెడల ఆయురారోగ్యము గలుగును.

బుధదశలో రవిభుక్తి మా 10 రో 6

శ్లో॥ బుధస్యాంతర్గతేభానౌ స్వోచ్ఛకేంద్రత్రికోణగే
ధైర్యం విత్తసుతాప్తించ సమరే జయమాప్నుయాత్
విద్యాలాభం నృపాత్ప్రీతిం వస్త్రవాహన భూషణం॥

రవి కేంద్రకోణములయందుగాని ఉచ్ఛయందుగాని వున్నయెడల ధైర్యము ధనలాభము సంతానసౌఖ్యము యుద్ధ

మందు జయము విద్యాలాభము రాజులవలన సంతోషము వస్త్రవాహనాలంకారప్రాప్తియును గలుగును.

శ్లో॥ బుధస్యాంతర్గతే భానో నీచే షష్ఠాష్టరిప్ఫగే
వాక్పారుష్యం మనోదుఃఖం నేత్రరోగం మహద్భయం
పితృనాశం శత్రువృద్ధి శ్చోరాది నృపపీడనం॥

రవి నీచయందుగాని షష్ఠాష్ట వ్యయములయందుగాని ఉన్నయెడల పరుషవాక్యములు పలుకుటయు దుఃఖము నేత్రరోగము మిక్కిలి భయము పితృనష్టము శత్రువృద్ధి చోరులవలన పీడయున్నూ గలుగును.

శ్లో॥ శశినాసంయుతేదృష్టే మణిభూషణ సంగ్రహం
విచిత్రవస్త్రాభరణం సుపుత్రాది సౌఖ్యదం
కుజేనసంయుతేదృష్టే ప్రవాళమణి లాభకృత్
రక్తవస్త్రాదిలాభంచ ధనవృద్ధిస్సజాయతే॥

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మణులు భూషణములు మొదలగువాని సంపాదనయు విచిత్రమైన అలంకారములు వస్త్రములు మొదలగువాని సౌఖ్యమును సుపుత్రులు వీరియొక్క సౌఖ్యమును గలుగును.

కుజునియొక్క సంబంధవీక్షణములవలన మంచిపగడములు మణులు వీనియొక్కయు యెఱ్ఱనివస్త్రములుయొక్కయు లాభమును ధనవృద్ధియు గలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే నానామూలాద్ధనాగమం
బంధుకళ్యాణవిభవం వారస్త్రీ సంగమం లభేత్

గురుణాసంయుతేదృష్టే పుత్రవృద్ధిర్భవిష్యతి
దేహసౌఖ్యధనప్రాప్తిర్బహువస్తు సుసంగ్రహః॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన అనేకవిధములుగా ధనలాభమున్నూ బంధుకళ్యాణము వైభవము వారస్త్రీ సంభోగమును గలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రవృద్ధి శరీరసౌఖ్యము ధనలాభము విశేషవస్తుసంపాదన యివిగలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే వాహనం గోవృద్ధిదం
వరభూషణలాభశ్చ కళ్యాణంభవతిధ్రువం
శనినావస్త్రనాశాదివాహనం పశునాశనం
ఆప్తబంధువియోగంచ దాసీదాసాదినాశనం॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన వాహనము గోవులు వీనియొక్క లాభము భూషణలాభము కళ్యాణము యివిగలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన వస్త్రనాశనము వాహననాశనము పశునాశనము ముఖ్యబంధువునియొక్క వియోగము దాసదాసీజనములయొక్క నష్టము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాతృతీయే లాభగేపివా
శుభగ్రహేణ సంయుక్తే ఉద్యోగప్రాప్తిమేవచ
తత్వజ్ఞానాదివార్తాభిః కాలక్షేపం సుతోత్సవం
అపూర్వబంధు సంప్రాప్తిం నిత్యంసంపదవైభవం॥

దశానాధుని లగాయతు రవి కేంద్రకోణములయందు గాని తృతీయలాభములయందుగాని శుభగ్రహయుక్తుడై యున్న యెడల ఉద్యోగప్రాప్తి తత్వజ్ఞానాది సంభాషణతో కాలము గడుపుట పుత్రోత్సవము అపూర్వబంధుదర్శనము యెల్లప్పుడును సంపదతో నిండియుండుట యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠ గేవాపివ్యయే వారంధ్రగేపివా
పాపగ్రహయుతేవాపి మనఃక్లేశం ధనవ్రియం
వివాహే కలహంచ్చైవ స్త్రీపీడాంబంధునిగ్రహం
ధాన్యార్ధపశునాశంచ అధికార వినాశనం॥

దశానాధునిలగాయతు రవి షష్ఠాష్టవ్యయములయందున్న యెడలను పాపులతోగూడినను మనోక్లేశము ధనవ్యయము వివాహసమయమందు కలహము స్త్రీపీడ బంధువిరోధము ధాన్యము ధనము పశువులు వీనియొక్క నాశనము అధికార నాశనమును గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థే వా అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం సూర్యప్రీతికరో భవేత్॥

ద్వితీయసప్తమములయందు రవియున్న యెడల అపమృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై సూర్యనారాయణస్తోత్రమును గోధుమదానమును చేయవలెను.

బుధదశలో చంద్రభుక్తి సం 1 మా 5

శ్లో॥ బుధస్యాంతర్గతే చంద్రే కేంద్రలాభ త్రికోణగే
శుభగ్రహయుతేదృష్టే దారాపుత్రాభివర్ధనం

మాతృసౌఖ్యం మనోత్సాహం వాహనాంబరభూషణం
ధర్మ్మయజ్ఞం వివాహంచ రాజ్యశ్రీధన సంపదః॥

బుధదశలో చంద్రాంతర్దశయందు చంద్రుడు కేంద్ర క్రోణములయందుగాని లాభమందుగాని శుభగ్రహసంబంధవీక్షణములు గలిగియున్నయెడల భార్యాపుత్రులయొక్క అభివృద్ధి మాతృసౌఖ్యము మనోత్సాహము వాహనములు వస్త్రములు ధర్మము యజ్ఞముచేయుట వివాహము రాజ్యప్రాప్తి ధనము యివిగలుగును.

శ్లో॥ బుధస్యాంతర్గతే చంద్రే నీచే షష్ఠాష్టరిప్ఫగే
మాతృసౌఖ్య విహీనంచ కృషి గోభూమినాశనం
వ్యాపారేధననష్టంచ గృహదారార్థనాశనం॥

చంద్రుడు నీచయందుగాని షష్ఠాష్టవ్యయములయందుగాని ఉండెనేని మాతృసౌఖ్యము లేకపోవుటయును వ్యవసాయనష్టము గోభూనష్టము వ్యాపారమువలన నష్టము గృహదారార్థ నాశనమున్నూ గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే మార్గసంచారమేవచ
స్వస్థాననాశంకురుతే ధనహానిర్భవిష్యతి
కుజేన సంయుతేదృష్టే వివాహాది శుభప్రదః
సహోదరాదివృద్ధిశ్చ బంధువృద్ధిర్భవిష్యతి
బుధేనసంయుతేదృష్టే శాస్త్రాభ్యాసాది చింతనం
తీర్థస్నానఫలం ప్రాప్తింవ్యాపారాద్ధనలాభకృత్॥

రవియొక్క సంబంధవీక్షణములవల్ల మార్గసంచారము స్థాననాశనము ధనహానియు గలుగును.

కుజునియొక్క సంబంధవీక్షణములవలన వివాహాదిశుభకార్యములు జరుగుటయు పుత్రసమృద్ధి యునుగలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన శాస్త్రపరిశీలన తీర్థస్నానఫలము వ్యాపారమందు ధనలాభము యునుగలుగును.

శ్లో॥ గురుణాసంయుతే దృష్టే గురుభక్తి ర్ద్విజార్చనం
మంత్రోపదేశః ప్రసంగాశ్చ సత్కర్మాణి పరిగ్రహః
శుక్రేణాసంయుతే దృష్టే పరస్త్రీ సంగమంతథా
భూషణాని సమృద్ధించ యత్నకార్య సుసిద్ధయః॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన గురుభక్తి బ్రాహ్మణపూజ మంత్రోపదేశ ప్రసంగము సత్కర్మలుచేయుట యునుగలుగును.

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన పరస్త్రీసంభోగము భూషణములు యత్నకార్యసిద్ధి యునుగలుగును.

శ్లో॥ శనినాసంయుతే దృష్టే నీచానాం కలహంతథా
పశుస్త్రీధనహానిశ్చ మానహానిర్భవిష్యతి॥

శనియొక్క సంబంధవీక్షణములవలన నీచులతో కలహము పశునష్టము ధనహాని మానహాని యునుగలుగును.

శ్లో॥ దాయేశాం త్కేంద్ర కోణేవాతృతీయే లాభగేవాపివా
శుభగ్రహయుతేవాపి సుతలాభోధ నాగమః
అశ్వాదివాహన ప్రాప్తిః వరభూషణలబ్ధవాన్

యత్నకార్యార్థసిద్ధిశ్చ మహారాజాశ్రియస్తథా
దారాపుత్రాదిసౌఖ్యంచ కృషిధాన్య వివృద్ధిదః
దానధర్మాదివృద్ధిశ్చ దుర్గారాధనతత్పరః॥

దశానాథునిలగాయతు చంద్రుడు కేంద్రకోణముల యందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహయుక్తుడై యున్నయెడల పుత్రలాభము ధనలాభము అశ్వములు వాహనములు మంచివస్తువులు వీనియొక్క సంపాదన కార్యసిద్ధి మహారాజానుగ్రహము దారాపుత్రులయొక్క సౌఖ్యము వ్యవసాయాభివృద్ధి ధాన్యవృద్ధి దానములు ధర్మములు యివిచేయుటయు దుర్గారాధన చేయుటయు యివి గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠ రంధ్రేవావ్యయేవా పాపసంయుతే
నానాజనవిరోధశ్చ బంధుద్వేషో మనోవ్యథా
సర్వకార్యవినాశశ్చ స్వస్థాన చలనంతథా
నీచస్త్రీ కలహంచైవ వస్త్రహానిర్భవిష్యతి॥

దశానాథుని లగాయతు చంద్రుడు షష్ఠాష్టవ్యయముల యందున్నయెడల సకలజనవిరోధము బంధుద్వేషము మనోవ్యాకులత సర్వకార్యవినాశనము స్థానభ్రష్టత్వము నీచస్త్రీలతో కలహము వస్త్రహాని యివిగలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవాహ్యపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం దుర్గాదేవీ జపంచరేత్
రజితప్రతిమాదానం కుర్యాచ్ఛాంతి మవాప్నుయాత్॥

ద్వితీయ సప్తమములయందు చంద్రుడున్న యెడల అపమృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై దుర్గాదేవీజపమును రజతప్రతిమాదానమును చేసినయెడలశాంతి గలుగును.

బుధదశలోకుజభుక్తి మా 11 రో 27

శ్లో॥ బుధస్యాంతర్గతేభౌమే కేంద్రలాభత్రికోణగే
భ్రాతృసౌఖ్యంమనోత్సాహం విద్యావాహనభూషణం
భూలాభం ధనలాభంచ రాజసన్మానవైభవం॥

కుజుడు కేంద్రకోణములయందుగాని లాభమందుగాని యున్నయెడల సోదరసౌఖ్యము మనోత్సాహము విద్య, వాహనము భూషణములు భూలాభము ధనలాభమురాజసన్మానము వైభవమును గలుగును.

శ్లో॥ బుధస్యాంతర్గతేభౌమే నీచేషష్ఠాష్టరిప్ఫగే
గృహక్షేత్రవినాశంచ భ్రాతృవర్గవినాశనం
పూర్వార్జిత్తవినాశంచ రాజమూలాద్ధనవ్యయం॥

కుజాంతర్దశయందుకుజుడు నీచయందుగాని షష్ఠాష్ట వ్యయములయందుగాని ఉన్నయెడల గృహము క్షేత్రము సోదరులు వీనియొక్క నాశనము గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టె మహాప్రభువశాత్సుఖం
స్వాధికారవివృద్ధిశ్చ సంగ్రామేవిజయప్రదః
శశినాసంయుతేదృష్టె క్షీరాన్నాదిసుభోజనం
స్వస్త్రీశయ్యాసుఖప్రాప్తిః గాయకాదిసమాగమం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన మహారాజానుగ్రహమువలన ఉద్యోగాభివృద్ధి యుద్ధమందు జయము యివి గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన క్షీరాన్నభోజనము భార్యాసౌఖ్యము ఆనందము వేశ్యాసంగమము యివిగలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే బంధుమిత్రాదిసంకులః
వణిజ్యాల్లాద్ధనప్రాప్తిః సర్వకార్యార్థసిద్ధిదః
గురుణాసంయుతేదృష్టే పుత్రపీడాధనవ్యయః
గురుద్వేషోధర్మహాని బుద్ధిభ్రంశస్తథైవచ

బుధునియొక్క సంబంధవీక్షణములవలన బంధువులు మిత్రులు మొదలగువారి సన్మానము వైశ్యుల మూలముగా ధనలాభము సర్వకార్యములయందు జయము యివిగలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన సంతాననష్టము ధనవ్యయము గురుద్వేషము ధర్మహాని మతిచాంచల్యము యివిగలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే గర్భస్రావాదిపీడనం
రక్తసంబంధరోగశ్చ కళత్రస్యనసంశయః
శనినాసంయుతేదృష్టే నీచారికలహాంతథా
పశుదాసాదినాశంచ యత్నకార్యవినాశనం॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన గర్భస్రావము

వలన రోగముగలుగుట రక్తసంబంధరోగము కళత్రనష్టము గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన నీచులతోను శత్రువులతోను కలహము పశునష్టము దాసదాసీజననష్టము కార్యనాశనము యివి గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా తృతీయేలాభగేపివా
శుభగ్రహాయుతేవాపి ఉచ్చరాశిస్థితేపివా
వాహనంభూపసన్మానం మణిభూషణశోభనం
స్త్రీపుత్రశుభసంప్రాప్తిం గృహేకళ్యాణశోభనం
స్వనామాంకితఉద్యోగం కీర్తిలాభంతథైవచ॥
నీలవస్త్రాదిలాభంచ నీలోత్పలసుగంధకం
తీర్థస్నానఫలప్రాప్తిం సేతుస్నానమథాపివా
స్వప్రభోస్తుమహాత్సౌఖ్యం సర్వకార్యసుసిద్ధిదం॥

దశానాథునికిగాయతు కుజునకు కేంద్రకోణములయందును గాని తృతీయలాభముల యందుగాని శుభగ్రహ సంబంధము గలిగియున్నను ఉచ్చయందున్నను వాహనము రాజసన్మానము మణులు భూషణములు వీనియొక్క సంగ్రహము స్త్రీలయొక్కయు పుత్రులయొక్కయు సౌఖ్యము గృహమందు కళ్యాణ మహోత్సవము ఉద్యోగాభివృద్ధికీర్తిలాభము నల్లని వస్త్రములయొక్కలాభము నల్లకలువలు పరిమళద్రవ్యములు వీనియొక్కలాభము తీర్థస్నానఫలము సేతుస్నానప్రాప్తి తనప్రభువు వలన విశేషసౌఖ్యముగలుగుట కార్యసిద్ధియివి గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రేవా వ్యయేవానీచరాశిగే
పాపగ్రహాయుతేవాపి ధననాశస్తథైవచ
బంధువర్గవిరోధశ్చ వహ్నిపీడాభవిష్యతి
స్వదేహేగుదబాధాచ విషసర్పభయంతథా
దారాపుత్రాది బాధాచహ్యాప్తబంధువినాశనం
సమానజనవిద్వేషందాయాది కలహంతథా

దశానాధునిలగాయతు కుజుడు షష్టాష్టమవ్యయముల యందున్నయెడలను నీచయందున్నను పాపగ్రహాయుక్తుడైనను ధననాశనము బంధువిరోధము అగ్నిభయము గుదపీడనము విషమువల్లనుగాని సర్పములవలనగాని భయము భార్యాపుత్రులయొక్క పీడబంధునష్టము సమానమనుజునియొక్క విరోధము జ్ఞాతులతో కలహమున్ను గలుగును.

శ్లో॥ ద్వితీయద్యూనరాశిస్థే అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థమనడ్వాహంప్రదాపయేత్
మృత్యుంజయజపంవాపి స్కంధపూజాంసమాచరేత్

ద్వితీయ సప్తమములయందు కుజుడున్నయెడల అపమృత్యుభయముగలుగును. అట్టిదోషముపోవుటకై యెద్దును దానముచేయుటయు మృత్యుంజయజపమును. స్కంధపూజయు యివిచేసినయెడల సౌఖ్యముగలుగును.

బుధమహాదశలో రాహుభుక్తి సం2 మా6 రో18

శ్లో॥ బుధస్యాంతర్గతేరాహౌ తృతీయేషష్టలాభగే

ఉద్యోగాద్ధనలాభంచ గృహక్షేత్రాభివర్ధనం
క్రియవిక్రియవిత్తాప్తిం నృపమూలాద్ధనాగమం॥

రాహువు తృతీయమందుగాని షష్టమమందుగాని లాభమందుగాని యున్నయెడల ఉద్యోగలాభము ధనలాభము గృహక్షేత్రాభివృద్ధి క్రియవిక్రియములయందు ధనలాభము రాజమూలకముగా ధనలాభమున్ను గలుగును.

శ్లో॥ బుధస్యాంతర్గతే రాహౌ నీచేవా కేంద్రకోణగే
వ్యయస్థానేష్టమేవాపి పాపగ్రహయుతేక్షితే
కరోతిదుఃఖబాహుళ్యం ఋణశత్రువివర్ధనం
శరీరేరోగపీడాచ కారాగృహనివేశనం॥

బుధదశలో రాహువు నీచయందుగాని కేంద్రకోణములయందుగాని అష్టమవ్యయములయందుగాని పాపగ్రహ సంబంధములు గలిగియున్నయెడల విశేషమైనదుఃఖము శత్రువృద్ధి ఋణవృద్ధిరోగవృద్ధియివి గలుగుటయు కారాగృహప్రాప్తియుగలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే శిరోరోగంతథైవచ
నేత్రేపటలరోగాదీః పితృవర్గవినాశనం
శశినాసంయుతేదృష్టే మాతృహానిర్వినాశనం
సర్వత్రకలహంచైవ హ్యాయత్నేనధనక్షయం

రవియొక్క సంబంధ వీక్షణములవలన శిరోరోగము నేత్రపటలరోగము పితృవర్గనాశనమును గలుగును.

చంద్రునియొక్క సంబంధ వీక్షణములవలన మాతృహాని స్త్రీజననష్టము సమస్తజనులతో విరోధము అయత్నముగా ధనవ్యయమును గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే భ్రాతృభిఃకలహాంతథా
దాయాదివృద్ధికలహం బంధుక్షయమవాప్నుయాత్
బుధేనసంయుతేదృష్టే జ్ఞానహీనేనభాషణం
అయుక్తాలాపవార్తాచ ఋణవృద్ధిర్భవిష్యతి

కుజునియొక్క సంబంధవీక్షణములవలన సోదరులతో కలహము జ్ఞాతిజనులతో కలహము బంధునాశనమును గలుగును. బుధునియొక్క సంబంధవీక్షణములవలన జ్ఞానహీనమైన సంభాషణచేయుట ఋణవృద్ధి గలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే గురుపుత్రవినాశనం
బుద్ధిజాడ్యం దేహబాధా ధనక్షయకరోభవేత్
శుక్రేణసంయుతేదృష్టే స్త్రీపుత్రాణాంశుభంతథా
వాహనాదిశుభప్రాప్తిః కల్యాణం పుత్రసంభవః

గురునియొక్క సంబంధ వీక్షణములవలన గురునియొక్కయు పుత్రులయొక్కయు నాశనమును బుద్ధిమాంద్యము శరీరపీడధననష్టము యివిగలుగును.

శుక్రునియొక్క సంబంధ వీక్షణములవలన స్త్రీలు పుత్రులు వీరలయొక్క సౌఖ్యము వాహనములు శుభకార్యములు జరుగుట కళ్యాణము పుత్రప్రాప్తియివి గలుగుటయు నగును.

శ్లో॥ శనినాసంయుతేదృష్టే దేహజాడ్యం మనోవ్యథా
పశుదాసాదినాశంచ స్వస్త్రీదేహస్య బాధకం

శనియొక్క సంబంధ వీక్షణములవలన శరీరపీడమనో వ్యాకులత పశునష్టము దాసదాసీజననష్టము భార్యయొక్క శరీర బాధయుగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవా దుశ్చిక్యేలాభగేపివా
షష్ఠేవాశుభసంయుక్తేహ్యపూర్వప్రియదర్శనం
కళత్రసౌఖ్యమాప్నోతి బంధుసౌఖ్యంభవేత్తథా
పుత్రమిత్రాదిసౌఖ్యంచ సర్వకార్యసుసిద్ధిదం

దశానాథుని లగాయతు కేంద్రకోణముల యందుగాని తృతీయలాభములయందుగాని షష్ఠమస్థానమందుగాని బలయుక్తుడైరాహువున్నయెడల పూర్వసేహితునియొక్క దర్శనము కళత్రసౌఖ్యము బంధుసౌఖ్యము పుత్రులు మిత్రులు వీరియొక్కసౌఖ్యము సర్వకార్యములయందు జయమునుగలుగును.

శ్లో॥ దాయేశాద్రంధ్రగేవాపి వ్యయేవాపాపసంయుతే
దేహబాధామతిభ్రంశః పరదారాది సంగ్రహః
అపకీర్తిభయంచైవ విథవాకలహస్తథా॥
అకాలభోజన ప్రాప్తిర్యత్న కార్యార్థ నాశనం ॥

దశానాథుని లగాయతు రాహువు అష్టమవ్యయముల యందు పాపగ్రహయుక్తుడై యున్నయెడల శరీరపీడమతిభ్రంశము పరస్త్రీసంభోగము అపకీర్తి భయము విథవతో

కలహము అకాలభోజనము యత్నకార్యార్థ నాశనమును గలుగును.

శ్లో॥ ద్వితీయ సప్తమస్థే వాహ్యాపమృత్యుర్భ విష్యతి ।
తద్దోషపరిహారార్థంరుద్ర సాహస్రికంజపేత్ ।
ఛాగదానం ప్రకుర్వీత సర్వసంపత్ప్రదాయకం ॥

ద్వితీయ సప్తమస్థానములయందు రాహువున్న యెడల అపమృత్యుభయముగలుగును. అట్టిదోషము పోవుటకై రుద్ర సహస్రజపమును మేకదానమును జేసినయెడల సమస్త సౌఖ్యములు గలుగును.

బుధదశలో గురుభుక్తి సం 2 మా 3 రో 6

శ్లో॥ బుధస్యాంతర్గతే జీవే స్వోచ్చ కేంద్ర త్రికోణగే
విదేశయానాదర్థాప్తిః యశోవిద్యాం జయంసుఖం
దేశాధిపత్యం మంత్రిత్వం లభతే నాత్రసంశయః
దారాపుత్రాదిసౌఖ్యంచ న్యాయమూలార్ధనాగమం॥

గురుడు కేంద్రకోణములయందుగాని ఉచ్చయందుగాని యున్నయెడల విదేశవ్యాపారమువలన ధనలాభము యశస్సు విద్య జయము సౌఖ్యము గలుగును. మరియు దేశాధిపత్యము మంత్రిత్వము భార్యాపుత్రులయొక్క సౌఖ్యము న్యాయమూలముగా ధనమార్జించుటయు గలుగును.

శ్లో॥ లగ్నషష్ఠాష్ట గేజీవేవ్యయేవా నీచరాశిగే
శన్యారఫణిసంయుక్తే కలహం బంధునాశనం

చోరాదాగ్నిజ్ఞో భయంక్లేశం పితృమాతృ వినాశనం
జ్వరవ్రణాగ్ని పీడాచ జీవగోభూమినాశనం॥

లగ్నములగాయతు షష్ఠాష్టవ్యయములయందు గురుడున్న యెడలను శని కుజ కేతువులతో గలిసినను కలహము బంధునష్టము దొంగలవల్లను రాజులవల్లను భయము దుఃఖము పితృమాతృనష్టము జ్వరము వ్రణములు అగ్ని పీనివలన బాధ పశునష్టము భూవ్యయము గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే కృషిమూలాద్ధనాగమం
ఉద్యోగలాభంకురుతే రాజసన్మానమేవచ
శశినాసంయుతేదృష్టే వస్త్రలాభం శుభోదయం
మనస్సంతోష సౌఖ్యంచ మాతృవంశ వివర్ధనం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన వ్యవసాయమూలకముగా ధనలాభము ఉద్యోగలాభము రాజసన్మానము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన వస్త్రలాభము శుభము మనస్సంతోషము సౌఖ్యము మాతృవంశవృద్ధియుపిగలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే యుద్ధేజయమవాప్నుయాత్
స్వవారేరాజసన్మానం భూమిలాభం తథైవచ
బుధేనసంయుతేదృష్టే వస్త్రభూషణ లబ్ధవాక్
విద్యావినోదగోష్టించ పండితైస్సమాగమం॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన యుద్ధమందు జయము గురువారమునాడు రాజదర్శనము భూమిలాభము యివిగలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన మంచివస్త్రములు అలంకారములు విద్యావినోదము విద్యాగోష్ఠి పండితజనసందర్శనము యివిగలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే స్త్రీసౌఖ్యం యానవృద్ధిదం
స్వప్రభోస్తు మహాకీర్తిం వస్త్రాభరణ సంగ్రహం
శనినాసంయుతేదృష్టే గళరోగం తథైవచ
భృత్యవర్గ వినాశంచ పూజ్యానాంతు విరోధకృత్॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన స్త్రీసౌఖ్యం వాహనసౌఖ్యము ప్రభుసన్మానము కీర్తి వస్త్రాభరణసంగ్రహము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాతృతీయే లాభగేపివా
శుభగ్రహాయుతేవాపి ధనలాభము దీరయేత్
ఉద్యోగలాభంకురుతే కళత్రాదిషుసౌఖ్యదం
కృషిక్షేత్రవివృద్ధించ ధాన్యలాభం తథైవచ
స్వప్రభోస్తు మహత్సౌఖ్యం స్వవాశే నృపదర్శనం॥

దశానాథునిలగాయతు గురుడు కేంద్రకోణములయందున్నను తృతీయలాభములయందున్నను శుభగ్రహయుక్తుడై యున్నయెడల ధనలాభము ఉద్యోగలాభము కళత్రసౌఖ్యము వ్యవసాయవృద్ధి క్షేత్రవృద్ధి ధాన్యలాభము స్వప్రభువువ

మంచి సౌఖ్యము గురువారమునాడు రాజదర్శనమును గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరంధ్రే వా వ్యయేవా పాపసంయుతే
బ్రాహ్మణానాం విరోధశ్చ పుత్రద్వేషో భవిష్యతి
దేహబాధా బుద్ధినాశం కలహం స్థాననాశనం
సమానజనకష్టంచ చతుష్పాజ్జీవనాశనం॥

దశానాథునిలగాయతు గురుడు షష్ఠాష్టవ్యయముల యందున్నను పాపగ్రహయుక్తుడైనయెడల బ్రాహ్మణవిరోధము పుత్రద్వేషము శరీరకష్టము బుద్ధినాశనము కలహము స్థానభ్రష్టత్వము సమానమనుజునియొక్క కష్టము పశునష్టము యివి గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవా అపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం మృత్యుంజయ జపంచరేత్
కాంచన ప్రతిమాదానం గురుప్రీతి కరంతథా॥

ద్వితీయసప్తమస్థానములయందు గురువున్నయెడల అపమృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై మృత్యుంజయజపమును సువర్ణప్రతిమాదానమును చేసినయెడల గురుప్రీతి గలుగును.

బుధదశలో శనిభుక్తి సం 2 మా 8 రో 9

శ్లో॥ బుధస్యాంతర్గతేమందే తృతీయే షష్ఠలాభగే
రాజపూజ్యం కృపేల్లాభం ధనధాన్య వివర్ధనం

స్వబంధు దారపుత్రాణా మారోగ్యం భూషణాదికం
భృత్యమిత్రార్థసంపత్తిర్లభతే కర్మసంగ్రహం॥

శని తృతీయమందుగాని షష్టమమందుగాని లాభమందుగాని యున్నయెడల రాజపూజ్యమున్ను వ్యవసాయమువలన లాభమున్ను ధనధాన్యాభివృద్ధియును దారాపుత్రాది సౌఖ్యమున్న భూషణలాభము బంధుమిత్ర సమాగమము ధనలాభముగలుగును.

శ్లో॥ బుధస్యాంతర్గతే మందే కేంద్రే వాష్టమసంయుతే
కోణేవారిప్ఫ సంస్థేచ గుల్మశూలాదిపీడనం
పరోపవాదం బంధూనాం మరణం ధననాశనం
ఉద్యోగభంగం దుఃఖంచ స్థలధాన్య వినాశనం॥

శని కేంద్రకోణములయందుగాని అష్టమందుగాని కోణములయందుగాని వ్యయమందుగాని యున్నయెడల గుల్మవ్యాధియున్ను శూలవ్యాధియున్న పరులవలన అపవాదమున్న బంధువుల మరణమున్ను ధననాశనమున్న ఉద్యోగభంగమున్న దుఃఖమున్న ధనధాన్య వినాశమున్న గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే పితృనాశం ధనక్షయం
శిరోరోగంచ కలహం మహత్సంగర సంభవం
శశినాసంయుతేదృష్టే మాతృబంధు వినాశనం
అకాలభోజనప్రాప్తిం యత్నకార్యవినాశనం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన పితృనాశనము ధనక్షయము శిరోరోగము కలహము గొప్పయుద్ధము గలుగును

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మాతృనష్టము బంధునష్టము అకాలభోజనము కార్యనాశనము గలుగును.

శ్లో॥ కుజేనజాతివైషమ్యం తన్మూలాద్ధననాశనం
విషశస్త్రాది బాధాచ ఉష్ణరోగాది సంభవం
బుధేనసంయుతేదృష్టే లిపివిద్యావిశారదః
వ్యవహారేణ చాతుర్యః బంధుపోషణతత్పరః॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన జ్ఞాతివిరోధము అందుమూలముగా ధనవ్యయము విషమువల్లనుంచిన్ని శస్త్రమువల్లనుంచిన్ని బాధయు ఉష్ణరోగము యివిగలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన లిపివిద్యయందు నేర్పరితనము వ్యవహారమందు చాతుర్యము బంధుపోషణయు గలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే పుత్రపీడామతిభ్రమః
బ్రాహ్మణాది విరోధశ్చయత్న కార్య వినాశనం
శుక్రేణసంయుతేదృష్టే ఖ్యాతిలాభోధనప్రదః
దారాపుత్రాది సౌఖ్యంచ వాహనాధిపసంగ్రహః॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రపీడ మతిచాంచల్యము బ్రాహ్మణవిరోధము కార్యనాశనము గలుగును.

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన విశేషలాభము ధనవృద్ధి భార్యాపుత్రులయొక్క సౌఖ్యము వాహనము యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్ర కోణేవా విక్రమేలాభ రాశిగే
శుభగ్రహాయుతేవాపి శుభశోచన వృద్ధిదః
అత్యాశ్రయేషు ప్రీతిశ్చ సభాపాండిత్య శీలవాన్
అపూర్వ్వవస్తులాభశ్చ వేదాంతార్థ విశారదః
శూద్రప్రభువశాత్సౌఖ్యం సర్వకార్యార్థ సంగ్రహః

దశానాథుని లగాయతు శని కేంద్రకోణములయందు గాని విక్రమస్థానమందుగాని లాభమందుగాని శుభగ్రహ యుక్తుడై యున్నయెడల శుభశోభనములు జరుగుటయు సభల యందు పాండిత్యశీలము అపూర్వ్వవస్తుసంపాదన వేదాంతార్థ విచారముగలవాడును శూద్రప్రభువల్లనుంచి సౌఖ్యమున్ను సర్వకాలములయందు జయమున్న ధనలాభము గలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠ రంధ్రేవావ్యయేవా నీచరాశిగే
పాపగ్రహాయుతేవాపి దేహబాధాభవిష్యతి
స్వస్థానచలనంహానిః గురుబంధువినాశనం
క్షితీశాత్కలహశ్చైవ స్వాధికార వినాశనం॥

దశానాథునిలగాయతు షష్ఠాష్టవ్యయములయందుగాని నీచయందుగాని పాపగ్రహయుతుడై శనియున్నయెడల శరీర పీడ స్థానభ్రష్టత్వము గురువు బంధువులు వీరియొక్క నాశన ము రాజవిరోధము అధికారనాశనమును గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమ స్థేవాహ్యా పమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం మహిషీదానమాచరేత్॥

ద్వితీయసప్తమస్థానములయందు శనియున్నయెడల అప

మృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై గోదానమును చేయవలెను.

కేతుదశలో కేతుభుక్తి మా 4 రో 27

శ్లో॥ కేతోరంతర్గతే కేతౌతృతీయే షష్టలాభగే
జ్ఞానమీశ్వరభక్తిశ్చ రోగార్తిర్బంధమోచనం
ధర్మమూలాద్ధనాప్తించ పురాణశ్రవణాదికం॥

కేతుదశలో కేతువు తృతీయషష్టలాభములయందున్న యెడల జ్ఞానమున్ను ఈశ్వరభక్తియున్ను రోగమువల్లనుంచిన్ని దుఃఖమువల్లనుంచిన్ని విముక్తియు పురాణశ్రవణమును గలుగును.

శ్లో॥ కేతోరంతర్గతే కేతౌవ్యయేవాష్టమసంయుతే
శరీరేవ్యాధిపీడాచ స్థానభ్రష్టం ధనక్షయం
ఉద్యోగభంగం దుఃఖంచ కారాగృహనివేశనం॥

కేతువు అష్టమవ్యయములయందున్నయెడల శరీరమందు వ్యాధియు స్థానభ్రష్టత్వము ధననష్టము ఉద్యోగభంగము దుఃఖము కారాగృహనివేశమును గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే స్వాధికారవినాశనం
రాజకోపం కార్యహానిం శిరోరోగంనసంశయః
శశినాసంయుతేదృష్టే మాతృవంశవినాశనం
మనఃఖేదం మానభంగ మశ్వవాహన నాశనం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన ఉద్యోగనష్టము రాజవిరోధము కార్యహాని శిరోరోగము గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన మాతృవంశనాశనము మనోదుఃఖము మానభంగము అశ్వములు వాహనములు మొదలగువాని నాశనమును గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే విషశస్త్రాగ్నిజంభయం
ఉద్యోగహానిం దుఃఖశ్చ భగినీ వంశనాశనం॥
బుధేనసంయుతేదృష్టె బంధుద్వేషమవాప్నుయాత్
అకాలభోజనప్రాప్తిం మిత్రబంధువిరోధతాం

కుజునియొక్క సంబంధవీక్షణములవలన విషమువల్లనుంచిన్ని శస్త్రములవల్లనుంచిన్ని అగ్నివల్లనుంచిన్ని భయమున్ను ఉద్యోగభంగము దుఃఖము భగినీవంశ నాశనమును గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన బంధువిరోధము అకాలభోజనము బంధుమిత్రాదులతో విరోధము యివి గలుగును.

శ్లో ॥గురుణాసంయుతేదృష్టె గురుపుత్రాదిపీడనం
దేహబాధామతిభ్రంశం స్త్రీమూలాద్ధననాశనం
శుక్రేణసంయుతేదృష్టె కళత్రస్యతుపీడనం
వాహనాదివినాశంచ స్త్రీమూలాద్ధననాశనం

గురునియొక్క సంబంధ వీక్షణములవలన గురుపుత్రులు వీరియొక్క నాశనమును శరీరపీడ మతిచాంచల్యము స్త్రీమూలకముగా ధననష్టమును గలుగును.

శుక్రునియొక్క సంబంధ వీక్షణములవలన కళత్రపీడ

వాహనసష్టము స్త్రీమూలకముగా ధననాశనమును గలుగును.

శ్లో॥ శనినాసంయుతేకృష్టె దాసీదాసాదినిగ్రహం
కారాగృహాంతరప్రాప్తిం నిగళంరాజనిగ్రహం

శనియొక్క సంబంధవీక్షణములవలన దాసదాసీజన నష్టము కారాగృహాప్రవేశము రాజాగ్రహమువల్లనుంచి నిగళ ప్రాప్తియివిగలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవాహ్యాపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థం మృత్యుంజయజపంచరేత్
ఉమామహేశ్వరందానం కుర్యాదాయుష్యవర్ధనం

ద్వితీయసప్తమములయందు కేతువున్నయెడల అపమృత్యు భయముగలుగును. దానికిమృత్యుంజయజపమును ఉమామహేశ్వరప్రతిమా దానమును చేసినయెడలఆయురారోగ్యములుగలుగును.

కేతుదశలో శుక్రభుక్తి సం1 మా2

శ్లో॥ కేతోరంతర్గతేశుక్రే స్వోచ్చేకేంద్రత్రికోణగే
క్షేత్రపుత్రార్థలాభంచ వాహనాంబరభూషణం
విద్యాలాభంయశోవృద్ధిం గృహేకళ్యాణవర్ధనం

శుక్రభుక్తియందు శుక్రుడు ఉచ్చయందుగాని కేంద్ర కోణములయందుగాని యున్నయెడల భూమిపుత్రులు ధనము వీనియొక్క లాభమును వాహనములు వస్త్రములు అలంకారములు వీటియొక్కలాభమును విద్యాలాభము యశోవృద్ధిగృహమందు కళ్యాణము జరుగుటయు గలుగును.

శ్లో॥ కేతోరంతర్గతేశుక్రేనీచేషష్ఠాష్టరిప్పగే
దారాపుత్రాదిపీడాచ దేహకార్శ్యంధనక్షయం
రాజకార్యవిరోధశ్చధర్మమూలాద్ధనవ్యయం

శుక్రభుక్తియందు శుక్రుడు నీచయందుగాని షష్ఠాష్టవ్యయముల యందుగాని వున్నయెడల భార్యాపుత్రాదిపీడయు దేహము యెండిపోవుటయు ధననష్టమును రాచకార్యముల యందు విరోధముగలుగుట ధర్మమూలకముగా ధనవ్యయమును గలుగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టే రాజానుగ్రహశాంతికం
సర్వకార్యవినాశంచ రాజకార్యవినాశనం
శశినాసంయుతేదృష్టే రత్నభూషణలాభవాన్
విచిత్రవస్త్రలాభంచ వాహనాదివివృద్ధిదం

రవియొక్క సంబంధవీక్షణములవలన రాజానుగ్రహము లేకపోవుటయు సర్వకార్యనాశనము రాజకార్య నాశనమును గలుగును.

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన రత్నములు భూషణములు వీనియొక్కలాభము విచిత్రవస్త్రలాభము వాహనవృద్ధియివి గలుగును.

శ్లో॥ కుజేనసంయుతేదృష్టే జ్ఞాతీనాం కలహంతథా
చోరభీతించ రోగాంశ్చ హ్యాపకీర్తి భయంతథా
బుధేనసంయుతేదృష్టే విద్యాలాభం ధనాగమం
బంధూనాముపకారంచవణిజ్ మూలాద్ధనాగమం॥

కుజునియొక్క సంబంధవీక్షణములవలన జ్ఞాతులతో విరోధము చోరభీతి రోగము అపకీర్తి భయముయివి గలుగును.

బుధునియొక్క సంబంధవీక్షణములవలన విద్యాలాభము ధనలాభము బంధూపకారము వర్తకులమూలకముగా ధనలాభము యివిగలుగును.

శ్లో॥ గురుణాసంయుతేదృష్టే పుత్రవృద్ధిర్భవిష్యతి
దేహారోగ్యం చార్థలాభం సర్వకార్య సుసిద్ధిదం
శనినాసంయుతేదృష్టే దారాపుత్రాదిపీడనం
సమానజనశోకంచ పశుక్షేత్ర వినాశనం॥

గురునియొక్క సంబంధవీక్షణములవలన పుత్రసంతానము శరీరసౌఖ్యము ధనలాభము సర్వకార్యములయందు జయము యివిగలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన భార్యాపుత్రులయొక్క శరీరపీడ సమానమనుజునియొక్క శోకము పశునాశనము భూనాశనము గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్ర కోణేవాతృతీయే లాభగేపివా
లక్ష్మీకటాక్షచిహ్నాని మహారాజాశ్రయంతథా
స్వాధికారవివృద్ధించ రత్నలాభం వినిర్దిశేత్
స్వస్త్రీసౌఖ్యం పుత్రసౌఖ్యం వేశ్యాసంగ మనంతథా
సుఖశయ్యా వివృద్ధించ రత్నలాభం వినిర్దిశేత్॥

దశానాథుని లగాయతు కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని శుక్రుడున్నయెడల మహాలక్ష్మీ

కటాక్షము మహారాజానుగ్రహమును గలుగును. మరియును ఉద్యోగసౌఖ్యము రత్నలాభము స్త్రీసౌఖ్యము పుత్రసౌఖ్యము వేశ్యాసంగమము సుఖశయ్య ధనాగమము దాసజనవృద్ధి యివిగలుగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠగే రంధ్రేవ్యయేవా పాపసంయుతే
నీచాంశకగతేవాపి స్త్రీమూలాత్కలహోభవేత్
ధననాశం మనఃఖేదం బంధువిద్వేష మేవచ
అన్యస్థలప్రవాసంచ సమానజనపీడనం॥

దశానాథునిలగాయతు శుక్రుడు షష్ఠాష్టవ్యయముల యందున్నను పాపులతో గలిసినను నీచాంశను బొందినను స్త్రీమూలకముగా కలహమును ధననాశనము మనోవ్యాకులత బంధుద్వేషము సమానజనునియొక్క పీడ ద్వీపాంతరవాసమున్ను గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవాహ్యప మృత్యుభయంవదేత్
తద్దోషపరిహారార్థం దుర్గాదానం చకారయేత్॥

ద్వితీయసప్తములయందు శుక్రుడున్నయెడల అప మృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై దుర్గా ప్రతిమదానమును చేయవలెను.

కేతుదశలో రవిభుక్తి మా 4 రో 6

శ్లో॥ కేతోరంతర్గతే భానౌ తృతీయే షష్ఠలాభగే
స్వోచ్చే శుభయుతేదృష్టే వస్త్రవాహనభూషణం
ధనాప్తిం రాజసన్మానం దారాపుత్రవివర్ధనం॥

కేతుదశలో రవిభుక్తియందురవి తృతీయాష్టలాభముల యందుగాని ఉచ్చయందుగాని శుభగ్రహాయుక్తుడై యున్నయెడల వస్త్రములు వాహనములు అలంకారములు ధనలాభము రాజసన్మానము భార్యాపుత్రులయొక్క అభివృద్ధి యివి గలుగును.

శ్లో॥ కేతోరంతర్గతే భానోనీచేవాష్ట మరిప్ఫగే
పాపగ్రహాయుతేదృష్టే పాపమూలాద్ధనవ్యయం
జ్వరాతిసారకృచ్ఛ్రంచ మేహపిత్తాదిపీడనం
ఉద్యోగభంగం దుఃఖంచ రాజమూలాచ్చ బంధనం॥

యీరవ్యంతర్దశయందు రవి నీచయందుగాని అష్టమ వ్యయములయందుగాని పాపగ్రహాయుతుడై యున్నయెడల పాపమూలకముగా ధనవ్యయమును జ్వరాతిసారము మూత్రకృచ్ఛ్ర మేహపైత్యబాధ ఉద్యోగభంగము దుఃఖము రాజమూలకముగ బంధనప్రాప్తియు గలుగును.

శ్లో॥ చంద్రేణసంయుతేదృష్టే సుఖభోజన వర్జితం
సువస్త్రాది విహీనంచ వ్యాపారే ఋణవృద్ధిదం
కుజేనసంయుతేదృష్టే శస్త్రభీతిం రణేభయం
సోదరాణాంతు కలహం నృపచోరాగ్ని పీడనం॥

చంద్రునియొక్క సంబంధవీక్షణములవలన సుఖభోజనము మంచివస్త్రములు లేకపోవుటయు వ్యాపారమందు ఋణవృద్ధి గలుగుటయు గలుగును.

కుజునియొక్క సంబంధవీక్షణములవలన శస్త్రమువలన

భయము యుద్ధమందు భీతియు సోదరులతో కలహామున్ను రాజులవల్ల నుంచి దొంగలవల్ల నుంచి అగ్నివల్లనుంచి భయము న్ను గలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టే జటధారీ సమాగమం
తీర్థయాత్రాప్రసంగాది అధ్యాత్మజ్ఞానయుక్తవాక్
గురుణాసంయుతేదృష్టె సుతస్త్రీ సౌఖ్యమేవచ
దేహసౌఖ్యం ధనప్రాప్తిర్ధర్మబుద్ధి పరోభవేత్॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన యతీశ్వరునితో స్నేహము తీర్థయాత్రాప్రసంగము అధ్యాత్మమునందు విశేష పరిజ్ఞానము యివిగలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన స్త్రీపుత్రసౌఖ్యము శరీరసౌఖ్యము ధనప్రాప్తి ధర్మబుద్ధి యివిగలుగును.

శ్లో॥ శుక్రేణగంధతాంబూలాసిద్ధి సంతుష్టమానసః
యానవాహన సంప్రాప్తిం కళ్యాణం శుభవృద్ధిదం
శనినానీచకలహం మహావ్యాధిభయంతథా
పశుదాన వినాశంచ స్వప్రభోస్తు మహద్భయం॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన గంధతాంబూలప్రాప్తి మనస్సంతోషము వాహనము పల్లకీమొదలగు వానిలాభము కళ్యాణము శుభకార్యములు జరుగుటయు గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన నీచులతో కల

హాము మహావ్యాధిభయము పశునష్టము దానవాశనము స్వ ప్రభువువల్లనుంచి భయమున్ను గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణే వాతృతీయే లాభగేపివా
అపూర్వ తీర్థయాత్రాది శివకేశవ పూజనం
నృపమూలాద్ధనప్రాప్తిం ఋణద్రవ్యాయతిం సుఖం
రిపుహానింజయంచైవ పత్రికాగమనంతథా
అశ్వాదివాహన ప్రాప్తిం బంధుకళ్యాణ శోభనం
అన్నదాన రతోనిత్యం సత్కర్మ సహితోనరః॥

దశానాథుని లగాయతు కేంద్రకోణములయందుగాని తృతీయలాభములయందుగాని రవియున్నయెడల పురాతనతీర్థ యాత్రలు సేవించుటయు శివకేశవులయొక్క పూజయు రాజ మూలకముగా ధనప్రాప్తి అప్పుయివ్వబడిన ద్రవ్యము లభిం చుటయు శత్రునష్టము జయము శుభలేఖలు వచ్చుటయు గుఱ్ఱ ములు వాహనములు మొదలగువాని లాభము బంధుకళ్యా ణము శుభము నిత్యాన్నదాతయు మంచికర్మలు చేయువా డును అగును.

శ్లో॥ దాయేశాత్షష్ఠరాశిస్థేవ్యయేవామృత్యురాశిగే
పాపగ్రహాయుతేవాపిసమానస్యమృతింవదేత్
అకస్మాద్ధ్యానచలనమాప్తవర్గభయంవదేత్
సర్వత్రకలహంచైవసర్వకార్యవినాశనం॥

దశానాథుని లగాయతు రవిషష్టవ్యయములయందుగాని మృత్యురాశియందుగాని పాపగ్రహయుక్తుడై యున్న యెడల

సమాన మనుజునియొక్క మరణము అకస్మాత్తుగస్థానచలనము బంధువులవల్లనుంచి భయము సమస్తజనులతో కలహమున్ను గలుగును.

శ్లో॥ ద్వితీయసప్తమస్థేవాహ్యపమృత్యుర్భవిష్యతి
తద్దోషపరిహారార్థంశివసహస్రకంజపేత్
కపిలంవృషభందద్యాచ్ఛాంతిహోమంచకారయేత్॥

ద్వితీయసప్తమములయందు రవియున్నయెడల అపమృత్యుభయము గలుగును. అట్టిదోషము పోవుటకై శివసహస్రనామజపమును కపిలవర్ణముగల యెద్దునుదానము చేయుటయు శాంతిహోమాదులు చేయుటవలనను సౌఖ్యము గలుగును.

కేతుదశలోచంద్రభుక్తి మా 7

శ్లో॥ కేతోరంతర్గతేచంద్రే కేంద్రలాభత్రికోణగే
స్వోచ్చేవాధనరాశిస్థేశుభగ్రహయుతేక్షితే
దేహారోగ్యంనృపప్రీతింవాహనాంబరభూషణం
కళత్రపుత్రసంపత్తింవ్యాపారేణధనాగమం

కేతువులో చంద్రుడు ఉచ్చయందుగాని కేంద్రకోణములయందుగాని యుండి శుభగ్రహసంబంధవీక్షణములు గలిగియున్నయెడల దేహారోగ్యము రాజసన్మానము వస్త్రములు అలంకారములు వాహనములు యివిగలుగుటయు కళత్రపుత్ర సంపత్తును వ్యాపారమందు ధనలాభమున్ను గలుగును.

శ్లో॥ కేతోరంతర్గతేచంద్రేనీచేవాష్టమరిప్పగే
షష్ఠేవాపాపసంయుక్తేపాపగ్రహయుతేక్షితే

మాతృసౌఖ్యవిహీనశ్చవాణిజ్యేనధనవ్యయం
ఋణవృద్ధిర్విశేషంచశత్రురోగవివర్ధనం॥

చంద్రాంతర్దశయందు చంద్రుడు నీచయందుగాని అష్టమమందుగాని వ్యయమందుగాని షష్టమమందుగాని పాపగ్రహసంబంధవీక్షణములుగలగి యున్నయెడల మాతృసౌఖ్యము లేకపోవుటయున్ను వర్తకవ్యాపారమువలన ధనవ్యయమున్ను ఋణవృద్ధి రోగవృద్ధి శత్రువృద్ధి యివి గలుగుటయునగును.

శ్లో॥ రవిణాసంయుతేదృష్టేసంతాపంకలహాంతథా
స్థాననాశంచకురుతేహ్యుద్యోగచలనంతథా॥
కుజేనసంయుతేదృష్టేవాహనాదివివృద్ధిదం
గోధాన్యధనవృద్ధించసోదరాణాంవివృద్ధిదం॥

రవియొక్క సంబంధవీక్షణములవలన సంతాపముకలహము స్థానభ్రష్టత్వము ఉద్యోగభంగమునుగలుగును.

కుజునియొక్క సంబంధవీక్షణములవలన వాహనముపశువులు ధనము ధాన్యము సోదరులు వీటియొక్కవృద్ధిగలుగును.

శ్లో॥ బుధేనసంయుతేదృష్టేబంధువృద్ధింసుఖంభవేత్
వేదాంతశ్రవణంచైవనృపాలాత్సుఖమశ్నుతే॥
గురుణాసంయుతేదృష్టేపుత్రరాజ్యవివృద్ధిదం
ధనలాభంనృపాత్ప్రీతింయత్నకార్యార్థసిద్ధిదం॥

బుధునియొక్క సంబంధవీక్షణములవలన బంధువృద్ధిసుఖము వేదాంతశ్రవణము రాజులవల్లనుంచి సౌఖ్యమును గలుగును.

గురునియొక్క సంబంధవీక్షణములవలన సంతానము రాజ్యవృద్ధి ధనలాభము రాజానుగ్రహము కార్యసిద్ధి యివి గలుగును.

శ్లో॥ శుక్రేణసంయుతేదృష్టే వస్త్రభూషణ సంగ్రహం
వాహనాదివివృద్ధించ స్వస్త్రీసౌఖ్యం తథైవచ
శనినాసంయుతేదృష్టే దాసీదాస సుతక్షయం
పశుధాన్యవినాశంచ నీచసేవాం తథైవచ॥

శుక్రునియొక్క సంబంధవీక్షణములవలన వస్త్రములు అలంకారములు వీటియొక్కలాభము వాహనసౌఖ్యము కళత్రసౌఖ్యమును గలుగును.

శనియొక్క సంబంధవీక్షణములవలన దాసదాసీజననష్టము సంతాననష్టము పశునష్టము ధాన్యహాని నీచసేవయు గలుగును.

శ్లో॥ దాయేశాత్కేంద్రకోణేవాదుశ్చిక్యేలాభగేపివా
శుభగ్రహయుతే వాపిధనభూషణ లాభవాక్
శుభశోభన సంప్రాప్తిం చందనాది మహోత్సవం
నరవాహన యోగంచ రాజ్యలాభం మహత్సుఖం
విద్యావినోదగోష్టంచ నానామూలార్ధనాగమం॥

దశానాథునిలగాయతు చంద్రుడు కేంద్రకోణముల యందుగాని తృతీయలాభములయందుగాని శుభగ్రహయుక్తుడై యున్నయెడల ధనము అలంకారములు వీనియొక్క లాభ

